ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్



Like us to follow

@mohanpublications




- డా॥ డి.విద్యేశ్వరీ

# ఆంధ్రమహాభారతం - ధర్మతత్వం

**ANDHRA MAHABHARATAM - DHARMATATTVAM**


ప్రథమ ముద్రణ - ఆగస్టు 1998

ప్రతులు - 1000



ప్రతులకు :

**డా. డి. విద్యేశ్వరి**

2-2-3/1/1, శివంరోడ్డు,

హైద్రాబాదు - 500 044.

ఫోన్ : 7614267



విశాలాంధ్ర బుక్ హౌస్ -

అన్ని బ్రాంచీలు








THIS BOOK IS PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF TIRUMALA TIRUPATI DEVASTANAMS UNDER THEIR SCHEME, "AID TO PUBLISH RELIGIOUS BOOKS."

ముద్రణ :

**కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్**

40 ఏ.పి హెచ్ బి బ్లాక్, విద్యానగర్,

హైద్రాబాదు. ఫోన్ . 7618261

**వెల : రు. 60/-**





శ్లో॥ శ్రీకల్యాణ గుణోల్లాసం చిద్విలాసం మహౌజసం।
శేషాద్రి మస్తకావాసం శ్రీనివాసం భజామహే॥

# ఎందరో మహానుభావులు

శ్లో॥ కృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయ యోగినే
నాథాయ రుక్మిణీశాయ నమోవేదాంత వేదినే ॥

శ్లో॥ వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే
నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః ॥

మహాభారతం నా అభిమాన గ్రంథం. హృద్యము, అపూర్వము, సకల శాస్త్ర సమ్మిళితము అయిన భారతం ఎప్పుడు చదివినా కొత్త కొత్త అంశాలను, అర్థాలను చూపుతూనే ఉంటుంది. బుద్ధికి పదును పెట్టే మహాగ్రంథం భారతం. ఎమ్.ఎ. పూర్తి కాగానే మా ఆచార్యులు శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు "మహాభారత సంశోధిత ముద్రణ" ప్రాజెక్టులో పనిచేసే అవకాశం కల్పించారు. ఈ ఉద్యోగం మహాభారతం మీద నాకుండే అభిమానాన్ని ద్విగుణీకృతం చేసింది. మహాభారతంలో ఏదైనా ఒక అంశం తీసుకుని పిహెచ్.డి చెయ్యాలన్న నా కోరికను బయటపెట్టినప్పుడు మా ప్రొఫెసర్ డా. నాయనికృష్ణకుమారిగారు "మహాభారతంలో ధర్మతత్త్వం" అనే విషయాన్ని సూచించారు. విషయ సూచన మాత్రమే కాకుండా, నాకు పర్యవేక్షకురాలై ప్రోత్సాహాన్ని, అవసరమైన పుస్తకాలను కూడా ఇచ్చి నన్ను కృతకృత్యురాలిని చేశారు.

"మహాభారతంలో ధర్మతత్త్వం" అనే అంశాన్ని ధృవపరుస్తూ పిహెచ్.డిలో సీటు రాగానే, మా నాన్నగారు, "ఇది ఎంత పెద్ద విషయమో నీకేమన్నా అయిడియా ఉందా" అంటూ, ఇంట్లో ఉన్న మా తాతగారి పుస్తకాలు, పి.వి. కాణే పుస్తకాలు, స్మృతులు, హిందూధర్మశాస్త్రం, హిందూ లా వంటివి తీసి యిచ్చి, "ముందు వీటిని బాగా చదువు" అన్నారు. నిజానికి అప్పటికి నాకు ఒక నిర్దుష్టమైన ప్రణాళిక లేదు. నేను వ్రాసుకున్న Synopsis ప్రకారం పనిచేస్తే మహా సముద్రంలో మునిగిపోతానేమో అనే భయం మాత్రం మనసులో ఉంది. భయాన్ని పక్కకుపెట్టి ఆ పుస్తకాలు చదవటం ప్రారంభించాను.

"మహాభారతంలో ధర్మం" అని వినగానే చాలామంది 'ఎంత పెద్దవిషయం, ఎంత పెద్ద పరిధి గలది, ఎలా వ్రాస్తావని' ప్రశ్నించారు. శాంతి, అనుశాసనిక పర్వాలలో ఒక్క అక్షరం కూడా వదలకుండా తిరిగి వ్రాయాలనీ, భారతంలో ఉన్న ధర్మాలు అనంతమనీ, ఏ విధంగా చెయ్యగలవనీ, ఎలా చేసినా మళ్లీ మహాభారతం వ్రాసినంత పని కాగలదనీ వారు భయపడ్డారు నన్ను భయపెట్టారు.

"భారతంలో ధర్మాధర్మాల పట్టిక ఇవ్వను. విధులు, నిషేధాలు వల్లించను, నా మార్గం వేరైంది " అని అన్ని ప్రశ్నలకూ కలిపి నాకు నేనే ఒక సమాధానం చెప్పుకున్నాను. మహాభారతంలో ధర్మాలు, ధర్మసూక్ష్మాలు పెద్దలెందరో తమ ఉపన్యాసాలలో వివరించారు పుస్తకాలు ప్రచురించారు. అయితే ధర్మం అనేది మానవ జీవితానికి ఎందుకు అవసరం? ధర్మం వలన ప్రయోజనం ఏమిటి? ఏ ఏ రూపాలలో ధర్మం అనుసరణీయము? అనే మార్గంలో నా సిద్ధాంతాన్ని నిరూపించేందుకు ప్రయత్నం చేశాను. 'మహాభారతకాలం నాటి ధర్మం ఈ కాలానికి ఎంతవరకు, ఏ విధంగా ఉపయోగపడుతుంది' అనే ప్రశ్నకు కూడా సమాధానాన్ని వివరించాను.

భారతం మానవ జీవితానికీ, సమాజానికీ దర్పణంవంటిది. మనుషులలోని మంచీ చెడూ రెండింటినీ భారతం ప్రతిబింబింప చేస్తుంది. ఈ మహా గ్రంథం నుంచి ఎవరెవరు ఏమిగ్రహిస్తారన్నది వారి వారి మేధను, సంస్కారాన్ని బట్టి ఉంటుంది. భారతంలో వెలలేని మణులున్నాయని నన్నయ " భారత భారతీసముద్రము" అన్నాడు. విజ్ఞాన విషయపరంగా భారతాన్ని అపరిమితమైన సముద్రంతో పోల్చాడు. ఇటువంటి భారతం భారతీయ సంస్కృతికి, సంప్రదాయానికి జీవవాహిని. ఈ జీవవాహినిలోని 'ప్రాణశక్తి' ధర్మం. ధర్మం మానవజీవితానికి దారి చూపే వెలుగు. ఆ వెలుగును అనుసరిస్తూ మానవుడు జీవన మార్గం ఏర్పరచుకొని గమ్యం చేరటం వ్యక్తికి, సమాజానికి క్షేమమన్నదే మహాభారతం మానవాళికి అందిస్తున్న సందేశం.

పిహెచ్.డి. మౌఖిక పరీక్ష జరిగినప్పుడు ఉస్మానియా యూనివర్సిటి ఆచార్యులు, పరీక్షాధికారులు నా పరిశ్రమను ప్రశంసించి పుస్తక రూపంలో ప్రచురించమని ప్రోత్సహించారు. సిద్ధాంతవ్యాసం ఉన్నదున్నట్టుగా ప్రచురిస్తే అది పూర్తిగా టెక్నికల్‌గా ఉంటుందని, భాషవిషయంలో కూడా కొంచెం మార్పుచేసి సులభశైలిలో ఉంటే అందరూ చదివేందుకు అనువుగా ఉంటుందని కొందరు పెద్దలు సూచించారు. "సిద్ధ ధర్మ స్వరూపుడు శ్రీ కృష్ణుడు" అన్న అధ్యాయం మరికొంచెం విపులీకరించి, భారత కృష్ణుడు ఆచరణలో చూపిన కర్మయోగాన్ని మరింత వివరిస్తే విషయం వటిష్టంగా ఉంటుందని ఆచార్య డా. కృష్ణకుమారి గారు అభిప్రాయపడ్డారు. ఈ విషయాలను దృష్టిలో ఉంచుకొని, పునరుక్తులైన శ్లోకాలను, పద్యాలను సరిచేసుకుని, అవసరమైనచోట్ల వాని భావం వివరిస్తూ, భాషను కూడా సులభతరం చేసి, సిద్ధాంతవ్యాస ముఖ్యోద్దేశం ప్రస్ఫుటమయ్యే విధంగా తిరిగి వ్రాశాను. మహాభారతాన్ని గురించి ఏంచెప్పినా, ఎంతచెప్పినా అది తరగని గని. నేను రూపొందించుకున్న ప్రణాళికను అనుసరించి రచన కొనసాగించాను.

అనేక వ్యక్తి గతమైన కారణాలవలన నా పిహెచ్.డి. సుదీర్ఘ కాలం కొనసాగింది. అయినా నా పరిస్థితిని, నా మనసులోని ఆరాటాన్ని గ్రహించి డా. శ్రీమతి నాయని

కృష్ణకుమారి గారు నా వెన్ను తట్టి, ఎప్పటికప్పుడు నన్ను ప్రోత్సహిస్తూ వచ్చారు. బి.ఎ. నుంచి పిహెచ్.డి వరకు నాకు గురువై, మార్గదర్శకురాలై మాతృవాత్సల్యంతో నన్ను ఆదరించిన ఆచార్య కృష్ణకుమారిగారికి నా మనఃపూర్వక కృతజ్ఞతాంజలి సమర్పించటం మాత్రమే చేయగలుగుతున్నాను. ఈ పుస్తకం రూపం దిద్దుకునే సమయానికి ఆచార్య కృష్ణకుమారి గారు విదేశ పర్యటనలో ఉండిపోయారు.

ఈ నా పుస్తకానికి ముందుమాట వ్రాయడానికి కోరిన వెంటనే అంగీకరించి, అమూల్యమైన వారి అభిప్రాయాలను వ్రాసి యిచ్చిన ఆచార్య శ్రీ జి.వి సుబ్రహ్మణ్యం గారికి, ఆచార్య శ్రీ ఎల్లూరి శివారెడ్డిగారికి నామనఃపూర్వక కృతజ్ఞతాభివందనాలు తెలుపుకుంటున్నాను. ఎన్ని పనుల ఒత్తిడిలో ఉన్నా అడిగినదే తడవుగా, అతి స్వల్పకాలంలో ముందుమాటలు వ్రాసి ఇచ్చిన సహృదయులు శ్రీ సుబ్రహ్మణ్యంగారు, శ్రీ శివారెడ్డిగారు.

ప్రతి విషయంలోను నన్ను నిరంతరం ప్రోత్సహిస్తూండే నాకుటుంబ సభ్యులకు, మిత్రులకు, శ్రేయోభిలాషులకు నా హృదయ పూర్వక శుభాకాంక్షలు అందిస్తున్నాను. ఈ పుస్తకం వ్రాత ప్రతిని సిద్ధం చేయటంలో నాకు సహకరించిన చి॥ సుజనకు నా ఆశీస్సులు.

ఈ పుస్తక ముద్రణలో ముఖ్య పాత్రవహించి, ఆర్థిక సహాయంచేసి, చేయూత నిచ్చిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారికి, పొట్టిశ్రీరాములు తెలుగు యూనివర్శిటీ వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాను.

ఈ పుస్తకాన్ని తక్కువకాలంలో, చక్కని గెటప్‌తో ముద్రించి ఇచ్చిన కర్షక్ గ్రాఫిక్స్, హైద్రాబాద్ వారికి నా కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను.

ఈ నా ప్రయత్నంలో నాకు సహకరించిన వారెందరో మహానుభావులు, అందరికీ వందనాలు.

హైద్రాబాదు

17-8-1998

విద్యేశ్వరి

# ధర్మ దీపిక

ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం

'ధర్మో రక్షతి రక్షితః' అని పురాణోక్తి. ధర్మాన్ని మనం రక్షిస్తే అది మనలను రక్షిస్తుందనే సూక్తం మానవ ధర్మానికి మూలంవంటిది. ధర్మాన్ని రక్షిస్తే మానవుడు తనను తాను రక్షించుకొన్నట్లే. ధర్మం ఆత్మాశ్రితమైనది. 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్' అన్న ఉపనిషద్వాక్యంలో ఆనందం ఆత్మధర్మం; ఆత్మయే బ్రహ్మం. బ్రహ్మమే పరమార్థంలో మానవుడు. "ధరతి విశ్వం ధర్మః" అన్నప్పుడు పరమాత్మపరంగానూ, "ధ్రియతే నా జనైరితి ధర్మః" అన్నప్పుడు సామాజిక పరంగానూ ఒకేధర్మం అన్వయిస్తుంది. దీనినే తత్త్వజ్ఞులు ప్రవృత్తి నివృత్తి ధర్మాలుగా పేర్కొంటారు. "వేదోక్తోహి ద్వివిధో ధర్మః ప్రవృత్తి లక్షణోనివృత్తి లక్షణశ్చ" అని ఆదిశంకరులు గీతాభాష్యంలో పేర్కొనటం ప్రసిద్ధం.

భారతీయులకు ధర్మమంటే వేదధర్మమనే వారి అనుభవం. అది దర్శనస్థాయిలో తత్వంగానూ, ఆచరణ స్థాయిలో అనేక గుణరూపాలుగానూ సాక్షాత్కరిస్తుంది. ధర్మం అంటే ఎన్ని అర్థాలలో లోకంలో వ్యాపించి ఉందో విశ్వకోశం ఇలా వివరించింది:-

**"ధర్మః పుణ్య యమే న్యాయే స్వభావాచార యోః క్రతౌ**
**ఉపమాయా మహింసాయాం కార్ముకేచ నిగద్యతే"**

'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్ర'మని కీర్తించే మహాభారతంలో ధర్మం మౌలికంగా మానవుల ఆత్మధర్మమనీ, అది మానవులలో పదిగుణాల ద్వారా వ్యవహారంలో గుర్తింప బడుతుందనీ అందువలన "దశకం ధర్మలక్షణ" మ్మనీ నిర్దేశించింది ఆ లక్షణాలనే ఇతర ధర్మశాస్త్రాలూ చెప్పాయి.

**"అహింసా సత్య మస్తేయం శౌచ మింద్రియ నిగ్రహః**
**దానం దమో దయా క్షాంతిః సర్వేషాం ధర్మసాధనమ్"**

అని యాజ్ఞవల్క్యస్మృతి దశగుణాలను ధర్మసాధన కుపయోగించేవిగా కూడా గుర్తించింది.

మనుస్మృతి -

**"విద్వద్భి స్సేవిత స్సద్భిః నిత్య మద్వేష రాగిభిః**
**హృదయేనాऽభ్యనుజ్ఞాతో ధర్మః"**

అని ఉత్తములాచరించిందే ధర్మమని నిర్దేశించింది. ఇవన్నీ ప్రవృత్తి ధర్మాన్ని గురించి చెప్పిన మాటలే. ఆ ప్రవృత్తి ధర్మంలో సామాన్య ధర్మమనీ, విశేషధర్మమనీ రెండు రకాలున్నాయి. అహింసాస్తేయాది దశకం సామాన్య ధర్మాలు వేదోక్త ధర్మాలకూ, అఖిలస్మృతి పురాణవర్గాలలో పేర్కొనబడిన వాటికీ వాదేర్పడితే విశేషధర్మం అనుష్ఠింపదగింది దానిని ధర్మసూక్ష్మం అంటారు.

**'ప్రాణహాని వచ్చు పట్టున సర్వథ**

**నాపహార వేళయందు నడపు**

**సత్య మన్నృతమం బ్రసత్యంబు సూన్నృత**

**మని పలగ్రహింతు రార్యజనులు"** ఇటువంటి ధర్మాలు ధర్మ సూక్ష్మాలు. సర్వహితాన్ని సాధించటమే ప్రవృత్తి ధర్మ తాత్పర్యం. అందువల్లనే మహాభారతం ఇలా చెప్పింది.

**"ధర్మజ్ఞులైన పురుషులు**

**ధర్మువునకు బాధసేయు ధర్మువు నైనన్**

**ధర్మముగా మదిదలపరు**

**ధర్మువు సర్వంబునకు హితంబు కావలయున్"**, అరణ్య 3. 330

అందుకే శాస్త్రకారులు "నజాతు కామాన్న భయా న్నలోభాత్ ధర్మం త్యజేరజ్జీవ తస్యాపిహేతోః' అని నిర్దేశించారు.

ప్రవృత్తి ధర్మానికి విరుద్ధమైనది నివృత్తి ధర్మం. అత్యంతిక దుఃఖనివృత్తి రూపమైన స్వస్వరూప స్థితిని పొంది బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి అనే ఆనందస్థితిలో నిలిచిపోయే ప్రవృత్తి నివృత్తి. అది తత్వరూపమైన ధర్మస్వరూపం.

ధర్మవిచారం, ధర్మనిర్ణయం అత్యంతక్లిష్టమైనది. సూక్ష్మబుద్ధులు కాని తద్విచారాన్ని చేపట్టరు. నిపుణులు కాని దానిని నిర్వహించలేరు. అటువంటి దుర్గమమైన అంశాన్ని చేపట్టి అందులోని లోతుల్నీ, మెళకువల్నీ పండొలిచి చేతిలో పెట్టినట్లు చెప్పగలిగిన విదుషీమణి డాక్టర్ డి. విద్యేశ్వరి. ధర్మతత్వాన్ని నిరూపించటానికి పంచమ వేదమని ప్రసిద్ధి చెందిన గ్రంథమే ప్రామాణికంగా ఉంటుంది. అందువల్లనే ఆంధ్రమహాభారతాన్ని ఎన్నుకొన్నారు.

మహాభారతం ఇతిహాసం. చతుర్విధ పురుషార్థ ఫలాలను సమగ్రంగా సాధించిన ఉదాత్తుల సంపూర్ణ చరిత్రను కర్మఫలానుభవ నిదర్శకంగా ప్రదర్శింపగలిగే మహద్రచన ఇతిహాసం. పాండవుల చరిత్ర ఇతిహాస వస్తువు. దానిని గ్రహించి వ్యాసమహర్షి శాస్త్రేతిహాసంగా నిర్వహించారు. దానిని కవిత్రయంవారు తెలుగులో కావ్యేతిహాసంగా సంతరించారు. వ్యాసుడు చతుర్విధ పురుషార్థ సాధనకుపయోగించే శాస్త్రవ్యుత్పత్తిని అందించడానికి ఇతిహాసవస్తువును అలంబనంగా చేసికొన్నట్టుంటుంది. ఎలాగంటే - భగవద్గీత చెప్పడానికే యుద్ధ సన్నివేశం. సన్నివేశం కాదు వ్యాసునికి ముఖ్యం. దాన్ని మిషగా చేసికొని చెప్పే శాస్త్రజ్ఞానమే ముఖ్యం. కవిత్రయంవారు అలాకాదు. వారు ఇతిహాసాన్ని కావ్యంగా రూపొందింప దలచారు. అయితే, మహాభారతబద్ధ నిరూపితార్థం మాత్రం చెడకుండా మూలంలోని శాస్త్రార్థాన్ని సంపదించారు. తెలుగుభారతంలో భగవద్గీత యథాతథంగా అవతరించలేదు కాని దాని పరమార్థం పరిరక్షింపబడింది. వ్యాసునికి ఉపదేశం ముఖ్యం; కవిత్రయానికి ఔచిత్యం ముఖ్యం. అయినా, వ్యాసతాత్పర్యం తెలుగులో భద్రంగా నిలిచేఉంది.

'ఆంధ్ర మహాభారతం - ధర్మతత్త్వం' అనే అంశాన్ని ఎన్నుకొన్నా దాన్ని నిర్వహించే పద్ధతులు ఎన్నో ఉన్నాయి. శృతిస్మృతి ప్రతిపాదిత ధర్మవిశేషాలకు ప్రాధాన్యం ఇచ్చి గ్రంథాన్ని ధర్మమీమాంసగా రూపొందించవచ్చు. సామాజిక ధర్మాలకూ, వ్యక్తి ధర్మాలకూ నడుమ వచ్చే సంఘర్షణలనూ, వాటిలో కానవచ్చే వైరుధ్యాలనూ చర్చించి భారతం ఆధునిక జీవితానికి ఎలా తోడ్పడుతుందో చర్చించవచ్చు. అప్పుడది వాన కోలాహలం కూడా కావచ్చు.

డాక్టర్ డి. విద్యేశ్వరిగారు అటువంటి పద్ధతులలో రచన సాగించకుండా తమదైన ఒక పంథాను ఎన్నుకొని తమ ప్రత్యేకతను ప్రదర్శించుకొన్నారు. ఆమె అభిమాన రంగం నవలాసాహిత్యం. భారతీయ భాషల్లో నవలా ప్రక్రియను గురించి, తెలుగు నవలలో మనోవిశ్లేషణను గురించి ప్రామాణిక గ్రంథాలు రచించారు. అంతేకాక నవలను గురించి శాస్త్రీయమైన చర్చ చేస్తున్నా దానిని నవలలా చదివించగలిగిన సరళమైన, మధురమైన రచన ఆమె కలానికి అబ్బిన వరప్రసాదం. అటువంటి సహజ కథాకథనశైలిలో మహాభారతంలోని ధర్మమీమాంసను నిర్వహించటం వలన ఈరచనకు ఆసక్తితో చదివించే అద్భుతమైన గుణం అలవడింది. ఇంత సీరియస్ విషయాన్ని ఇంత నవనీతంగా చెప్పగలిగిన గ్రంథాలు తెలుగులో కొద్దిగా మాత్రమే ఉన్నాయి.

ధర్మతత్త్వం, ధర్మసూక్ష్మం, ధర్మం - అనే విభాగం రచయిత్రి విశ్లేషణ వివేకానికి చక్కని ఉదాహరణం. గ్రంథంలోని ధర్మ వివేచనమంతా ఈ మూడు రకాల ధర్మ నిరూపణం మీదనే ఆధారపడి ఉండటం విశేషం. ఈ మూడింటికీ సిద్ధ, సాధ్య, సాధన ధర్మాలని పేర్కొని వాటిని రచయిత్రి వివరించారు. అవ్యయం, శాశ్వతం, నిర్ద్వంద్వం అయింది సిద్ధ ధర్మం. ధర్మతత్త్వాన్ని గ్రహించి తెలియదగింది సాధ్య ధర్మం: మానవులందరూ ఆచరింపవలసిన సామాన్య విశేషధర్మాలు సాధన ధర్మం - అని నిష్కర్ష చేశారు. అది గ్రంథరచనా ప్రణాళికకు మంచి ప్రాతిపదికను అందించింది.

సిద్ధధర్మస్వరూపుడు శ్రీకృష్ణుడు, సాధ్యధర్మవర్తనులు వ్యాస భీష్మ విదుర సంజయులు; సాధన ధర్మవర్తనులు కుంతీదేవి, యుధిష్ఠిరులు:- అనే ప్రధాన నిర్ణయాలే భారత ధర్మ తత్త్వ విచారంలోని ఫలితాంశాలు. ఇటువంటి నిర్ణయాలలో ఒక్కొక్కదానినీ నిరూపించటానికే ఒక్కొక్క అధ్యాయాన్ని రచయిత్రి నిపుణంగా నిర్మించారు. ఆయాపాత్రలను గురించి డాక్టర్ విద్యేశ్వరిగారు చెప్పిన పద్ధతి పాత్రచిత్రణను సమీక్షిస్తున్నారా, కథాసన్నివేశాలను పాత్రలోని ధర్మతత్త్వాన్ని నిరూపించడానికి వాహికలుగా వాడుకుంటున్నారా అని అనిపిస్తుంది. చెప్పే పద్ధతి కుస్తీపడుతున్నట్లుగా కాకుండా కమ్మచ్చులీగ తీసినట్లుండటం ప్రశంసావహం. ధర్మసూత్రంతో పాత్రను విలువకడుతున్నట్లు సాగిన ఈ రచన ఇటువంటి పరిశోధనాత్మక రచనలకే తలమానికం.

'ఆంధ్రమహాభారతం ప్రబోధించిన ధర్మతత్త్వం' అనే శీర్షికతో వ్రాసిన చివరి అధ్యాయం ఈ గ్రంథంలో తలమానికం. పట్టభద్రస్థాయిలో చదివే విద్యార్థినీ విద్యార్థులందరికీ అవశ్యపఠనీయాంశంగా ఉంచదగిన అనర్ఘవ్యాసం. "ఆంధ్రభారతం వ్యాస హృదయాన్ని ఆవిష్కరించి ధర్మతత్త్వాన్ని బోధించింది" అని అన్నారు డా॥విద్యేశ్వరిగారు. ఈ గ్రంథం వ్యాసకవిత్రయ హృదయాలను ఆవిష్కరించి ధర్మతత్త్వాన్ని వ్యాఖ్యానించింది - అని చదివినవారి కనిపిస్తుంది. అందరూ చదవదగినదనీ, చదివితే ధర్మవర్తనంమీద అందరికీ చవులూరే ఆపేక్ష పెరుగుతుందనీ అనిపిస్తుంది. ఈనాటి 'ధర్మదీపిక' ఈ గ్రంథం. రచయిత్రికి నా హృదయపూర్వకాభినందనలు!

జి.వి. సుబ్రహ్మణ్యం

హైదరాబాదు.
30-7-1998.

**Prof. E. SIVA REDDY**
M.A.,Ph.D (Telugu)
M.A. (Sanskrit)



Res : 632020
Off : 868951 Ext. 294

**DEPARTMENT OF TELUGU,**
University College of Arts &
Social Sciences,
Osmania University,
Hyderabad - 500 007.

Res : "RASA BHARATI"
1-1-336/77, Viveknagar,
Chikkadpally,
Hyderabad - 500 020

Date : 26-8-98

# ధర్మ ప్రస్థానం

మహాభారతం మానవేతిహాసం. వ్యాసర్షి ఈ ఇతిహాసాన్ని నిర్మించిన తీరు అనితరసాధ్యం. కవిత్రయం వారు తెలుగులోకి పరివర్తించిన విధానం ఔచితీసుందరం. సంస్కృతాంధ్రాల్లో భారతంలోని అనేకాంశాల్ని గురించి విస్తృతపరిశోధన సాగింది. కావ్యలక్షణాల్ని, సాహిత్య భాషా శైలులను ఎందరో విశ్లేషించి గ్రంథాల్ని, సిద్ధాంత గ్రంథాల్ని వెలయించారు. అయినా ఇలా ధర్మతత్త్వ పరిశీలనకు పూనుకున్నవారు తక్కువ - పూనుకున్నా దాని తుదిముట్ట నిగ్గు తేల్చినవారు అరుదు. డా॥ డి. విద్యేశ్వరిగారు 'ఆంధ్ర మహాభారతం - ధర్మతత్త్వం' సిద్ధాంతవ్యాసాన్ని రచించి తమ కృషిని సఫలం చేసుకున్నారు. అంతగహనమైన విషయాన్ని ఘంటాపథంగా మార్చినందుకు ఆమె అభిజ్ఞుల అభినందనలకు అర్హురాలు.

ధర్మమనే శబ్దానికి అంత తృప్తికరమైన నిర్వచనం చెప్పడం సాధ్యంకాదు. అది మతభేధాలను బట్టి దేశకాలాలను బట్టి అర్థచ్ఛాయలను మార్చుకుంటుంది. సహృదయ సంస్కారచిత్తులకు ధర్మశబ్ద తాత్పర్య స్ఫురణతో తికమకలుండవు. శల్యపరీక్ష చేసే వారికే చెప్ప లేనన్ని అర్థాలు స్ఫురిస్తాయి. ఏ కాలంలోగాని ఏ దేశంలోగాని పదిమంది శ్రేయస్సును కోరేది ధర్మం. మానవుని శాశ్వతునిగా నిలబెట్టేది ధర్మం.. పడగొట్టేది

అధర్మం. శాస్త్రకారులు చెప్పిన ధర్మస్వరూపాన్ని డా॥ విద్యేశ్వరిగారు సారభూతంగా క్రోడీకరించారు. జీవన సంఘర్షణల్లో నిరూపితమైన ధర్మ స్వరూపాన్ని సరళసుందరంగా వివరించడం ఈమె వైదుష్యానికి నిదర్శనం. ధర్మాన్ని గ్రహించటానికి వట్టి తార్కిక దృష్టి సమర్థమైందికాదనీ, ధర్మ దృష్టి నిరూపణకు హృదయంలో ఆర్ద్రత కూడా అవసరమని పరోక్షంగా ఈ సిద్ధాంత వ్యాసంలో ప్రస్తావించబడింది.

వ్యాస భీష్మ విదుర సంజయులను సాధ్యధర్మవర్తనులుగా కుంతీ యుధిష్ఠిరులను సాధన ధర్మవర్తనులనుగా పేర్కొని వివరించిన విధానం డా॥ విద్యేశ్వరిగారి విశ్లేషణ పాండితికి పరమోదాహరణం. శ్రీకృష్ణుని సిద్ధ ధర్మస్వరూపునిగా అన్వయిస్తూ 'కర్తవ్య నిర్వహణలో ధర్మసాధనకు తప్ప రాగద్వేషాలకు, సుఖదుఃఖాలకు లోను కారాదు' అని పాత్ర అభిప్రాయాన్ని ప్రవచిన్తూ విద్యేశ్వరిగారు చెప్పిన వాక్యాలు నేటి నమాజానికి మననయోగ్యమైన మాటలు సిద్ధాంతవ్యాసం చిట్టచివర ధర్మం లౌకికాలౌకిక జీవితాలు రెండింటికీ నంబంధించిందని నూచించడం అనుష్ఠాన పరాయణతకు చేసిన నిజమైన వ్యాఖ్య.

విషయ పరిశీలనలో వైశారద్యం, విషయ నివేదనలో సారళ్యం. రచనలో నైగనిగ్యం ఈ సిద్ధాంతవ్యాసానికి మెరుగులు దిద్దాయి. పరిశోధన పరమార్థం తెలిసిన రసికులు ఈ గ్రంథ పఠనంతో మరో ఆలోచనాస్థాయిని అధిగమిస్తారని ఆశిస్తున్నాను. రచయిత్రి సోదరీమణి డా॥ విద్యేశ్వరిగారికి హార్దికాభినుతులు.

# విషయ సూచిక

# 1. సంస్కృతాంధ్ర మహాభారతాల అవతరణ

'వేదోఽఖిలం ధర్మమూలం' అని ప్రాచీనులు వేదాన్ని ప్రశంసించారు. సూక్తుల రూపంలో వేదం మానవ సమాజానికి, మానవుని లౌకిక, ఆధ్యాత్మిక జీవనాలకు అవసరమైన విధులను, నియమాలను నిర్దేశిస్తుంది. ఒక శాసనంలా ఈ నియమాలను ప్రతిపాదిస్తుంది. కనుకనే వేదాన్ని ప్రభువుతో పోల్చి చెప్పారు. వేదవాక్కు అంటే ఇంక తిరుగులేనిది అని శిరసావహించారు.

కాని మానవుడు బుద్ధిజీవి. అతని ప్రవృత్తి ఎప్పుడూ ఒకేలా ఉంటుందనిగాని, మానవ జీవనవాహిని ఒకే మార్గంలో ప్రవహిస్తుందని గాని చెప్పటం అసాధ్యం. కొత్త కొత్త ఆలోచనలతో, కొత్త కొత్త మార్గాలను అన్వేషించటం మనిషి జీవితనైజం లేదా సహజగుణం. కొత్త మార్గాలను వెతుకుతున్నప్పుడు కొత్త ఆలోచనలు ఉద్భవిస్తాయి. వాటి కారణంగా మనిషి మార్పును వాంఛిస్తాడు. ఈ ప్రక్రియలో పాత సిద్ధాంతాలను, పద్ధతులను, విధానాలను కొంతవరకు వ్యతిరేకించటం, వాటి అధికారాన్ని, సార్వకాలీనతను గురించి ప్రశ్నించటం, కొన్ని సందర్భాలలో వాటిని ఉల్లంఘించటం జరుగుతుంటుంది. ఈ మార్పులే కాలగతిలో వివిధ శాఖలుగా, తత్త్వాలుగా రూపొందటం కూడా సంభవిస్తుంటుంది.

ఇంతేకాక కారణాంతరాలవలన మానవులలో అరిషడ్వర్గాల ప్రభావం ప్రకోపిస్తుంటుంది. అప్పుడు స్వార్థం చెలరేగుతుంది. వేదశాసనాన్ని అనుసరిస్తున్నామని భావిస్తూనే కొందరు తమకు అనుగుణంగా వ్యవహరిస్తుండటం కూడా జరుగుతుంటుంది. అటువంటి సందర్భంలోనే సన్మార్గాన్ని బోధించేందుకు, వేదార్థాన్ని ప్రబోధించేందుకు శాసనాలకన్నా ఉదాహరణలతో కూడిన ఉపాఖ్యానాల అవసరం ఏర్పడుతుంది. అలాంటి అవసరకాలంలోనే పురాణేతిహాసాల ఆవిర్భావం జరుగుతుంది సుమారుగా ఐదువేల సంవత్సరాలకు పూర్వం అటువంటి అవసరం కలిగింది. తత్ఫలితంగా కృష్ణద్వైపాయన వ్యాసకృతమైన 'జయకావ్య' నిర్మాణం జరిగింది.

స్వార్థం, లోభం, మదమాత్సర్యాదిగుణాలు పెచ్చుపెరిగితే కేవలం వ్యక్తినాశనమేకాక సమాజానికి, వంశమూలాలకూ కూడా వినాశనం సంభవిస్తుందని జయకావ్యం ప్రబోధిస్తున్నది ఇటువంటి ఒక వినాశనాన్ని ప్రత్యక్షంగా చూసిన కృష్ణద్వైపాయనుడు,

ఊర్ధ్వబాహుర్విరౌమ్యేష కశ్చిచ్ఛృణోతిమే
ధర్మాదర్థశ్చ కామశ్చ సధర్మః కిం న సేవ్యతే ॥

(భుజము) చేతులుపైకెత్తి బిగ్గరగా అరచి మీకందరకూ చెప్పుచున్నాను. కానీ నామాట ఎవరుమా వినరు ధర్మమువల్లనే అర్థకామములు సిద్ధించుచున్నవి అట్టి ధర్మమును మీరెందుకు సేవింపరు."[1]

అని ఆక్రోశించారు. వ్యాసమునీంద్రుని హృదయవేదన ధర్మప్రబోధం లక్ష్యంగా 'జయకావ్యం' గా రూపొందింది. అరిషడ్వర్గాల ప్రభావాన్ని, వానివల్లకలిగే దుష్ఫలితాలను ఉపాఖ్యానాలతో ఉదాహరిస్తూ వివరించారు. మానవులు ధర్మమార్గాన్ని అనుసరిస్తే పొందే శాశ్వతయశస్సునూ, అధర్మాన్ని అలంబనం చేసుకొని సుఖాన్నిపొందాలని ఆశిస్తే కలిగే పరిణామాలనూ 'జయకావ్యం' ద్వారా విస్తృతంగా వర్ణించారు. ఒక్కధర్మమేకాక చతుర్విధపురుషార్థాలకూ సంబంధించిన అంశాలన్నీ ఈకావ్యంలో ఉన్నాయని,

'ధర్మేచార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతుత్రచిత్ ॥"[2]

అనదమేకాకుండా ఇక్కడలేనిది ఇంకెక్కడా లేదని కూడా చాటిచెప్పారు. మానవ జీవితానికి సంబంధించిన వేదవిహితమైన భౌతిక ఆధ్యాత్మిక విధినియమాలు, లౌకిక జీవితంలో కలిగే సంఘర్షణలు, అనేక ప్రశ్నలు, వాటికి సమాధానాలు అన్నింటిని వ్యాసుడు 'జయకావ్యం'లో వివరించారు. ధర్మాన్ని అనుసరించి జీవనంసాగిస్తే లభించే చిత్తస్థైర్యాన్ని, యశస్సును గుర్తించి జీవించమని ప్రబోధించారు. ధర్మబద్ధమైన జీవనవిధానాన్ని అనుసరిస్తూ మానవులు ఇతర పురుషార్థాలను కూడా పొందగలరని నిరూపించేందుకు కురువంశీయులగాథను వస్తువుగా గ్రహించి ఈ 'జయేతిహాసా'న్ని వ్రాశారు. కురువంశవినాశనాన్ని ప్రత్యక్షంగా చూచిన వ్యక్తి వ్యాసుడు. అంతేకాక కురువంశోద్ధరణకు మూలపురుషుడు కూడా అతడే. మాతృదేవి ఆజ్ఞకుబద్ధుడై తాను నిలిపిన వంశం తనకళ్ళముందే బంధుమిత్ర పరివారంతోసహా నాశనమైపోవటం చూసి కలతపొందాడు. ఈ వంశనాశనానికి మూలకారణం ధర్మవ్యతిరేకవర్తన అని, స్వార్థలోభగుణాలు నాశనానికి మూల బీజాలని అతడు మొదటినుంచీ ధృతరాష్ట్రుని హెచ్చరిస్తూనే ఉన్నాడు. అతని మాటను కౌరవులు మన్నించలేదు. ధర్మవిరుద్ధమార్గాన్ని అనుసరించారు. ఈ ఇతిహాసగాథకు ప్రత్యక్ష సాక్షి అయిన వ్యాసుడు మానవజీవితంలో ధర్మానికిగల ప్రాముఖ్యాన్నీ, ధర్మానికి భంగంకలిగిస్తే

★ 1. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక - సంపు.3 సం. 16.పు.158

★ 2. సం.మ.భా - ఆది - 62 - 52

సంభవించే పరిణామాలనూ, ఫలితాన్ని 'జయకావ్యం'లో వర్ణించారు. తాను చేసిన ఈ ప్రబోధాన్ని ప్రచారంచేసే బాధ్యత తన నలుగురు శిష్యులైన పైల, వైశంపాయన, సుమంత జైమినులకు అప్పగించారు.

కురుక్షేత్రయుద్ధానంతరం సుమారుగా కొన్ని శతాబ్దాలు గడచిన తరువాతనే ఈనాడు మనకులభిస్తున్న మహాభారతం రూపుదిద్దుకుని ఉంటుందని, కనుక సమగ్ర మహాభారత నిర్మాణకాలం క్రీ.పూ. 3వ శతాబ్దం అయిఉండవచ్చునని మహాభారత చరిత్రకారులు నిరూపించారు.

కురుక్షేత్రయుద్ధం జరిగిన కాలాన్ని గురించి పండితులు, చరిత్రకారులు పరిశోధనలు చేశారు. క్రీ.పూ. 14వ శతాబ్దం నుంచీ క్రీ.పూ. 3128 సం॥ వరకూ పరిశోధకులు వారి వారి ఆధారాలను అనుసరించి నిర్ణయాలు చేశారు. వీటన్నింటిలోను శ్రీ ఇ. వేదవ్యాస(ఐ.ఏ.యస్) నిరూపించిన కాలం సాధికారకమని చారిత్రక పరిశోధకులు ప్రస్తుతానికి అంగీకరించారు. శ్రీ వేదవ్యాస చేసిన కాలనిర్ణయాన్ని ఆమోదిస్తూ శ్రీ ఆర్.కె. కంచన్ ఈ విధంగా అన్నారు.

"The method of dating has been based by Dr. Vedavyasa on the observation of the sky at the time of the war of Mahabharata has been comparitively studied and cross-verified with the result of radio-carbon dating which misses the mark by plus or minus of about one hundred years.

The net result of the arduous and prolonged efforts on research of Dr. Vedavyasa is that it can be assertively declared that the epic war of Mahabharata took place on Tuesday, the day of new moon of Amavasya, in the month of October 3128 B.C. which more or less tallies with the traditional reckoning of 5000 years ago."[3]

యుధిష్ఠిర జనమేజయుల పేర్లతోగల శాసనాలు కూడా ఈ కాలనిర్ణయానికి ఉపబలకాలై ఉండటంచేత, ఈ వాదాన్ని ఖండించేందుకు తగిన ఇతర ఆధారాలు ఏవీ ఇప్పటికి లభించని కారణంగా శ్రీ వేదవ్యాస చేసిన కాలనిర్ణయాన్నే ప్రస్తుతానికి ఆమోదించారు.వేదవాఙ్మయం, ఉపనిషత్తులలో కొన్ని వ్యాస 'జయకావ్యా'నికి ముందు వెలసిన వాఙ్మయమని, ఇతర ఉపనిషత్తులు బ్రాహ్మణాలు 'జయకావ్యా'నికి, సమగ్ర'మహాభారతాని'కి మధ్యకాలంలోను, అనంతరకాలంలోను వెలువడ్డాయని చారిత్రకులు పేర్కొన్నారు. మనువు, గౌతముడు, నారదుడు మొదలైన స్మృతికారులు, ధర్మశాస్త్ర నిర్మాతలు అయనవారి ప్రసంగం మహాభారతంలో అనేక పర్యాయాలు ప్రస్తావనకు వస్తుంది. అయితే వారి వారి ధర్మ చర్చలు, మతాలు తదనంతరం వారి శిష్య ప్రశిష్యుల ద్వారా గ్రంథస్థమై ఉంటాయని పి.వి. కాణేవంటి పండితులు నిర్ణయించారు.

★ 3. Hindu Kingdoms of South-East Asia. R.K.Kanchan (p.337)

## జయకావ్యం మహాభారతంగా మారిన వైనం

ఆంధ్రమహాభారతంలో నన్నయభట్టారకుడు - 'కృష్ణద్వైపాయనుండు నిఖిలలోకహితార్థంబు దత్తావధానుండై సంవత్సరత్రయంబు నిర్మించి దాని దేవలోకంబునందు వక్కాణింప నారదుం బనిచె పితృలోకంబున వక్కాణింప నసితుండైన దేవలుం బనిచె గరుడగంధర్వయక్షరాక్షసలోకంబులందు వక్కాణింప శుకుం బనిచె నాగలోకంబునందు వక్కాణింప సుమంతుం బనిచె మనుష్యలోకంబున జనమేజయునకు వక్కాణింప వైశంపాయనుం బనిచె నేనా వైశంపాయన మహామునివలన వినివచ్చితి."[4]

అని కురుక్షేత్రయుద్ధానంతరం మూడు సంవత్సరాలకు వ్యాసుడు రచన చేసినట్లు సూతముఖంగా స్పష్టంగా చెప్పారు. ఇదియే 'జయ'నామంతో వెలువడిన తొలి ఇతిహాసగ్రంథం. మహాభారతంలో ఉన్న వివరాలనుబట్టి చూడగా ధర్మరాజు రాజ్యకాలం ముప్పైఆరు సంవత్సరాలు. 'భారత సంగ్రామపారీణుండై జయరమయుల్లసిల్ల సామ్రాజ్యమునకు పాండవముఖ్యుని బట్టంబుఁగట్టిన యదియాదిగాగ ముప్పదియునైదు సంవత్సరంబులునన ననంతర వత్సరంబున' పరీక్షిత్తును రాజ్యాభిషిక్తుఁజేసి పాండవులు ద్రౌపదీసమేతంగా మహాప్రస్థానానికి తరలివెళ్ళినట్లు భారతం చెప్తున్నది. అటుపిమ్మట అభిమన్యుని పుత్రుడైన పరీక్షిత్తు ధర్మార్థకామములను విధితప్పక నిర్వహించుచు పుణ్యచరితుడై ప్రజలను రక్షిస్తూ అరువది సంవత్సరములు రాజ్యంచేశాడు. అతడు తక్షకవిషాగ్నికి గురియైన సమయానికి అతని కుమారుడు జనమేజయుడు బాలుడని భారతమే చెప్తున్నది. జనమేజయుడు యుక్తవయస్కుడైన తరువాత, కొన్నేళ్ళు గడిచివాక తండ్రి మరణానికి కారణాన్ని పెద్దలవలన తెలుసుకుని సర్పయాగాన్ని తలపెట్టాడు. సర్పకులరక్షకుడైన ఆస్తీకుని రాకతో యాగం ఆగిపోయింది. అప్పుడు ఆ యాగశాలలో, వ్యాసుని అనుమతితో, అతడి శిష్యుడైన వైశంపాయనుడు భారతగాథను ఎల్లరకు వినిపించినట్లు, ఆ గాథనే అనంతరకాలంలో సూతుడు శౌనికాదిమునులకు వర్ణించినట్లు మహాభారత ప్రారంభంలో ఉన్నది.

కురుక్షేత్ర యుద్ధానంతరం వ్యాసుడు మూడు సంవత్సరాలకు నిర్మించిన 'జయము'అనే ఇతిహాసప్రస్తావన, ప్రశంస అర్జునునికి మూడవ తరంవాడైన జనమేజయుడికాలంలో మొట్ట మొదటిసారిగా బహిర్గతమైంది. మూలగాథకు, వ్యాసుని హృదయగతలక్ష్యమైన ధర్మప్రబోధానికి భంగం కలగనివిధంగా వైశంపాయనుడు భారతకథను యాగశాలలో వినిపించాడు. ఈ ఇతిహాసాన్నే సౌతి భరతవంశీయులగాథగనుక భారతగాథ అని భారతం అనే పేరుతోను, "శ్రుత్వాహం విచిత్రార్థామహాభారతసంహితా" అని మహాభారతం పేరుతోను వ్యాసుని కావ్యంగా ప్రశంసించాడు.[5]

---

★ 4. ఆంధ్రమహాభారతము - ఆది - 1-67

★ 5. సం.మ.భా. ఆది - 1-19,11

వైశంపాయనుడు, సౌతి జయకావ్యం భారతమహాభారతాలుగా రూపొందేందుకు కారణభూతులై ఉండవచ్చునని విమర్శకులు విశ్వసించారు.

జయకావ్య రచనకు, వైశంపాయనుడు యాగశాలలో జనమేజయుని కోరికపై పాండవుల చరిత్ర వినిపించే సమయానికి మధ్య చాలా కాలభేదంవుంది. తత్కాల పరిస్థితులకు, ధర్మవివరణకు అనుకూలంగా వైశంపాయనుడు మరికొన్ని ఉపాఖ్యానాలను చేర్చి అనాటి శ్రోతలకు వినిపించి ఉండవచ్చు. ఇలా చేశాడని అనేందుకు మరొక కారణంకూడా కనిపిస్తున్నది. ద్వాపరయుగాంతాన కురుక్షేత్రయుద్ధం జరిగింది.[6] కృష్ణ నిర్యాణంతో కలియుగం ప్రారంభమైనదని పూర్వీకుల విశ్వాసం. పరీక్షిత్తు తన పాలనలో కలిని అతిచివుంచినట్లుగా భాగవతం వర్ణిస్తున్నది.[7] పరీక్షిత్తు మరణానంతరం కలి విజృంభించగా ధర్మప్రబోధం మరింత దృఢంగా, విస్తారంగా చేయవలసిన అవసరం కలిగివుంటుంది. ఇందువలననే వైశంపాయమనికి ఉపాఖ్యానాల విస్తరణకు అవశ్యకత ఏర్పడి ఉంటుంది.

అటుపైన పౌరాణికుడైన సౌతి మరికొంతకాలం తరువాత నైమిశారణ్యంలో తన సహజకల్పన, వర్ణనాచాతుర్యాలతో నాటి కాలానికి అనువైన ధర్మప్రబోధవిస్తరణతో ఋషిసమూహంలో భారతగాథను పురాణంగా వర్ణించి చెప్పారు. వైశంపాయనుని ముఖతః విన్న భారతగాథను విచిత్రార్థాలతో కూడిన మహాభారతంగా ప్రస్తుతించాడు. ఈ మహాభారతం వ్యాసప్రోక్త ధర్మప్రబోధానికిగాని, ఇతిహాస మూలాంశాలకు గాని వైక్లబ్యంకలుగని విధంగా విస్తరించింది. కృష్ణద్వైపాయనవ్యాసకృత మహేతిహాసమైన మహాభారతంగా ప్రసిద్ధిపొందింది.

ఈ విధంగా మహాభారత నిర్మాణంలో వ్యాసవైశంపాయన సౌతులు ముగ్గురికీ భాగంవుందని నిర్ణయించేందుకు చరిత్రకారులు మూడు అంశాలను అధారాలుగా చూపారు. అందులో మొదటిది - వ్యాసుని కావ్యం 'జయకావ్యం'; వైశంపాయనుడు ప్రవచించినది 'భారతసంహిత' సౌతిమునిగణానికి పురాణంగా చెప్పినది 'మహాభారతం'. అశ్వలాయన గృహ్యసూత్రాలలో "భారతమహాభారతాచార్యాః"అనే ప్రయోగం సుమంతవైశంపాయన పైలాది వ్యాసశిష్యులను గురించి ప్రస్తావించినప్పుడు కనిపిస్తుంది. కనుక అనాటికి భారత, మహాభారతాలనే పేర్లు ప్రసిద్ధాలు, వేర్వేరు గ్రంథాలను సూచించేవి ప్రచారంలో ఉన్నట్లు తెలుస్తున్నది వీనిలో జనమేజయుని సభలో వైశంపాయనుడు ప్రవచించనది భారతసంహిత పౌరాణికుడైన సౌతి నైమిశారణ్యంలోని మునులకు భారతమహాభారతాలను రెండింటిని కలిసి వినిపించి ఉండవచ్చును.

---

★ 6. అం. మ. భా. ఆది 1-67

★ 7. ఆంధ్రమహాభాగవతం 1-433

రెండవది శ్లోకసంఖ్యను ఆధారం చేసుకున్నది. వ్యాసకావ్యం "అష్టశ్లోక సహస్రాణి అష్టశ్లోక శతాని" అని 8,800లుగా ప్రసిద్ధిపొందింది. ఈ సంఖ్య కూటశ్లోక సంఖ్య అనే వాదం ఒకటి వుంది. అయితే ఈ వాదం సమగ్రంగా నిరూపించే ఆధారాలు లేవు. ఇక శతసహస్ర (లక్ష) శ్లోక సంఖ్య మహాభారతానికి సంబంధించినది. వైశంపాయన సౌతులిద్దరు పౌరాణిక మార్గంలో ఆనాటి పరిస్థితులకు తగినట్లుగా ధర్మ ప్రబోధకాలైన ఉపాఖ్యానాలను చేర్చగా సమగ్ర మహాభారతం లక్షశ్లోక పరిమాణంతో రూపొందింది.

ఇక మూడవ అంశం కథాప్రారంభానికి సంబంధించినది. "మన్వాది భారతం" అని, 'ఆస్తీకాదికథాపరే" అని, "తథోపరిచరాద్యన్యే విప్రాః సమ్యగధీయతే" అని మూడు గాథలు ప్రారంభంలో కనిపిస్తున్నాయి. మహాభారతయుద్ధం ముగిసిన మూడు సంవత్సరాలకు వ్యాసుడు జయకావ్యాన్ని వ్రాశాడని స్పష్టంగావుంది. కనుక పాండవుల విజయంతో ఆగాథ పూర్తికావాలి. అనంతర విశేషాలు, కృష్ణనిర్యాణం, గాంధారి ధృతరాష్ట్ర విదురాది వృద్ధుల మరణం, పాండవుల మహాప్రస్థానం, స్వర్గారోహణం జయకావ్యంలో చెప్పేందుకు వీలులేదు. కనుక 'తథోపరిచరాద్యే' అని కురువంశ మూలపురుషుడైన ఉపరిచరవసువుగాథతో వ్యాసుని జయకావ్యం ప్రారంభమై ఉండవచ్చును.

ఇక 'ఆస్తీకాది కథాపరే' అనే ప్రారంభం - సర్పయాగానికి కారణం, దానిని నివారించేందుకు ఆస్తీకుని ఆగమనంమొదలైన అంశాలతో భారతకథ మొదలయిందని చెప్తున్నది. సర్పసత్రం జరిగేటప్పుడు పరీక్షిత్తు శాపకారణంతోపాటు సర్పగణం ఆవిధంగా భస్మం అయ్యేందుకు తల్లి అయిన కద్రువశాపం కారణమని వైశంపాయనుడు జనమేజయునికి వివరించాడనడం సమర్థనీయమే అవుతుంది. మనుష్యలోకంలో 'జయకావ్యా'న్ని 'భారతసంహిత' పేరుతో వైశంపాయనుడు ప్రచారం చేశాడని ఈ ప్రారంభగాథ నిరూపిస్తున్నది. ఇందులో పాండవుల స్వర్గారోహణం వరకు భారతకథ వుంటుందనటానికి ఏమాత్రం అనుమానించవలసిన పనిలేదు. వైశంపాయనుని భారత సంహిత 24,000 శ్లోకాలతో కూడిన గ్రంథం.

మూడవ ఆరంభం 'మన్వాది భారతం' అనేది. మనువు అంటే విష్ణుస్వరూపుడు గనుక విష్ణుస్తోత్రమైన "నారాయణంనమస్కృత్య"శ్లోకాన్నే మన్వాదిగా పేర్కొనివుంటారని వ్యాఖ్యాతలు వర్ణించారు. ఈ శ్లోకం నుంచి చివరి వరకూ నేడు లభిస్తున్న సమగ్ర సంపూర్ణ మహాభారతం ఏర్పడింది. ఇదే లక్షశ్లోకబంధురమైన కావ్యం. అప్పటి అవసరాన్ని బట్టి అనేక ఉపాఖ్యానాలు, ధర్మచర్చలు సౌతి ప్రవచించిన మహాభారతగాథలో చోటు చేసుకున్నాయి. వ్యాసుని జయకావ్యం మహాభారతంగా మారేందుకు సుమారుగా 170 సంవత్సరాల కాలం పట్టి వుంటుందని మహాభారతంలోని అంశాలనే ఆధారంగా తీసుకుని మహాభారత చరిత్ర గ్రంథకర్త శ్రీ పెండ్యాల

వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు చర్చించారు. కేవలం కథా ప్రారంభం వల్లనేకాక వ్యాఖ్యాతల కౌశలాన్ని బట్టి కూడా గ్రంథధారణకు అవకాశం ఉంటుందనే విషయం మహాభారతంలోనే కనిపిస్తున్నది కనుక ఈ అంశాలన్నింటిని పరిశీలించి చూడగా సంపూర్ణమహాభారత స్వరూప నిర్మాణంలో వైశంపాయనశిశుల ప్రమేయంవుందని నిశ్చయంగా చెప్పేందుకు వీలుకలుగుతున్నది.

ఇక కృష్ణద్వైపాయనుడు ఇతిహాసంగా వ్రాసిన గ్రంథం ధర్మ ప్రబోధకావ్యంగా, పురాణంగా ప్రచారం పొందవలసిన అవసరం ఎందుకు ఏ విధంగా కలిగింది? ఈ ప్రశ్నకు సమాధానం చరిత్రను పరిశీలించి తెలుసుకోవలసివుంది.

క్రీ.పూ. 3వ శతాబ్దంనాటికే భారతదేశంమీద మ్లేచ్ఛుల దండయాత్రలు ప్రారంభమయ్యాయి. భారతదేశంలో ప్రభువులు రాజ్యరక్షణకై పోరాడవలసివచ్చింది. దానితోపాటుగా అంతఃకలహాలుకూడా పెచ్చుపెరిగాయి. ఈ కారణంగా అప్పటి వరకు ప్రజాజీవనంలో వ్యాపించివున్న వేదసంస్కృతి ఏద్దైతేవున్నదో ఆ ప్రకృతి ఆరాధన,యజ్ఞ యాగాది క్రతువుల ప్రాబల్యం తగ్గటం ప్రారంభించింది. వాటిని గురించి అనేక ప్రశ్నలు బయలుదేరాయి. దేవతామూర్తుల సంఖ్య పెరిగింది. ఇంద్ర, వరుణ, అగ్ని, సూర్యాది వైదిక దేవతలు మరుగయివారు. ఆ స్థానంలో విష్ణు, రుద్ర, దేవీపూజల శాఖలు అంకురించాయి. ఈ శాఖలు తమతమ ఆధిక్యతను చాటుకునేందుకు పెనుగులాడసాగాయి. ఇంచుమించుగా ఇదే సమయంలో జైన, బౌద్ధ మతాలు జన్మించి, విస్తరించి సామాన్య ప్రజలను విశేషంగా ఆకర్షించసాగాయి. అశోకునివంటి సామ్రాజ్యాధినేతలు, చక్రవర్తులు వైదిక ధర్మాన్ని విడిచి బౌద్ధధర్మాన్ని స్వీకరించారు. బౌద్ధమత వ్యాప్తికి ఎంతో పాటుపడ్డారు. హింస, అహింసలగురించి చర్చలు, వాదోపవాదాలు చెలరేగాయి. వర్ణాశ్రమధర్మాలపైన నిర్మితమైన ఆర్య సంస్కృతికి, వైదిక ధర్మానికి గ్లాని ఏర్పడింది.

అటువంటి సమయంలో వైదికధర్మ ప్రబోధకము, హృదయ రంజకము, అంతకన్నా ముఖ్యంగా సజీవమైన ఇతివృత్తంగల ఒకానొక ఉద్గ్రంథం అవశ్యకమైంది. 'జయేతిహాసం' అనంతరం, మహాభారత అవతరణకు ముందు, ఆర్య సంస్కృతిని, వేద ధర్మాన్ని వివరించే లేదా ప్రబోధించే ఉపనిషత్తులు, బ్రాహ్మణాలు వెలువడ్డాయి వాటి వెంటనే ఇతర పురాణాలు కొన్ని వర్ధిల్లాయి వేదవాఙ్మయ సారాన్ని, ఉపనిషత్తుల, బ్రాహ్మణాల, పురాణాల ముఖ్యాంశాలను ఒకేచోట క్రోడీకరించి సామాన్య జనులకు సైతం సుబోధకంగా శ్రుతిశుభగంగా తెలియచేయవలసిన అవసరం, సమయం ఆసన్నమయ్యాయి. ఆ సమయంలో,

సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమ పౌరాణికుల్ బహుపురాణసముచ్చయం బని మహిఁ గొనియాడుచుండ [8]

ఒక మహాకావ్యం ఇయితిహాసకర్త అయిన వేదవ్యాసుని కృతిగా మహాభారతరూపంలో ఆవిర్భవించింది. ఆర్య వైదిక సంస్కృతి నాగరికతలను ఉపాఖ్యానరూపంలో వివరిస్తూ వేదధర్మ ప్రబోధం, ప్రచార లక్ష్యాలను మహాభారతం ద్వారా రీతి నెరవేర్చారు. ఈ మహాకావ్యం కృష్ణద్వైపాయన కృతమహేతిహాసంగా ప్రపంచసాహిత్య చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయింది.

వైదిక ధర్మానికి ఆలంబనంగా రూపుదిద్దుకున్న మహాభారతంలో వైదికమత శాఖలన్నింటికీ సమానస్థానం లభించింది. శివకేశవుల ప్రభావం ఎలాంటి హెచ్చుతగ్గులు లేకుండా భారతంలో వర్ణితమైంది. ఉదాహరణకు కృష్ణుడు విష్ణ్వంశసంభూతుడు; అర్జునుడు శివునిగురించి తపస్సుచేసి పాశుపతాస్త్రాన్నిపొందాడు; అశ్వత్థామ రుద్రునిర్ధ్యానించి శతుసంహారం చేశాడు; ఇక దేవీమాహాత్మ్యాన్ని వర్ణించే స్తోత్రాలు కూడా మహాభారతంలో ఉన్నాయి. ఈ కారణాలన్నింటివల్ల వేదశాఖల భేదంలేకుండా మహాభారతం అందరికీ అభిమానయోగ్యం, ఆమోదకరం అయ్యింది. ఇంతేగాక కాలక్రమంలో జైనబౌద్ధమతాలు కూడా కొంతవరకు వైదిక దేవతలను గౌరవించటం, వైదిక మతం బుద్ధుని దైవత్వాన్ని అంగీకరించటం సంభవించింది. ఈ కారణాలవలన ఆర్యవైదికధర్మ పునరుద్ధరణకు మహాభారతం మూలస్తంభమై నిలిచి పంచమవేదంగా ప్రసిద్ధి పొందింది.

మహాభారతంలో ధర్మ ప్రాముఖ్యత, ప్రస్తావన అడుగడుక్కీ కనిపిస్తూంటుంది. మనువు, గౌతముడు, వశిష్ఠుడు, నారదుడు మొదలైన ఋషులు మహాభారతంలో నటవ్యక్తులుగా ధర్మ చర్చల సందర్భాలలో కన్పిస్తారు. భారతీయ ధర్మశాస్త్ర గ్రంథాలలో మనుస్మృతియే మొదటిదని, ఇతర స్మృతులు, శాస్త్ర గ్రంథాలు తరువాత వెలువడినవేనని చారిత్రకులు సోదాహరణంగా నిరూపించారు. కనుక స్మృతులకన్నా ముందు వెలసిన మహాభారతమే తొలి ధర్మగ్రంథం అని చెప్పటంలో ఎటువంటి విప్రతిపత్తి లేదు.

## ఆంధ్రమహాభారతావతరణకు మూలకారణం

వైదిక సంస్కృతి నాగరికతలకు ప్రతిబింబమై తొలి ధర్మ ప్రబోధేతిహాసంగా ప్రసిద్ధిపొందిన సంస్కృత మహాభారతం భారతీయ భాషలన్నిటిలోకీ భాషాంతరీకరణం పొందింది. ఆయా భాషలలోని కవులు వ్యాసకృత మహాభారతంలోని కొన్ని పర్వాలను లేదా కొన్ని ఘట్టాలను మాత్రం

★ 8. ఆం.మ.భా. ఆది 1-32

తీసుకుని మార్పులు చేర్పులతో వారి భాషలలో భారతరచన చేశారు జైనమత ధర్మాన్ని ప్రచారం చేసేందుకు 'విక్రమార్జున విజయం' పేరుతో అర్జునుడు నాయకుడుగా కన్నడంలో పంపకవి వ్రాసిన భారతం; వైష్ణవమత సిద్ధాంతాలను ప్రబోధిస్తూ ఒరియాభాషలో సరళాదాసకవి రచించిన భారతగాథ ఇటువంటి భారత భాషాంతరీకరణాలకు ఉదాహరణలు. ఈ గ్రంథాలుగాని, కథాంశాలుగాని యథాతథంగా వ్యాసహృదయాన్ని ఆవిష్కరించాయని చెప్పేందుకు వీలులేదు ఆంధ్రభాషలో మాత్రమే వ్యాసహృదయగత లక్ష్యమైన వైదిక ధర్మప్రబోధం ఆంధ్రమహాభారతంలో సంపూర్ణంగా దర్శనమిస్తుంది. ఇందుకు ఆంధ్రభారతావతరణ కాలంనాటి సాంఘిక రాజకీయ పరిస్థితులు ముఖ్యకారణం అయితే కవిత్రయంవారి ప్రతిభావ్యుత్పత్తులు ఈ ప్రయత్నం సఫలం అయ్యేందుకు తోడ్పడ్డాయి.

మానవ సమాజానికి, మనిషి ఇహపర జీవితాలకు ధర్మానుసరణ ఒక్కటే తరణోపాయమని ఎలుగెత్తిచాటుతూ వ్యాసుడు నిర్మించిన మహేతిహాసం శతాబ్దాల అనంతరం ఆంధ్రభాషలో తొలి గ్రంథంగా, మహాకావ్యంగా వెలువడింది. సుమారు రెండున్నర శతాబ్దాలమధ్యకాలంలో, ముగ్గురు మహాకవుల ప్రతిభాపాండిత్యాలకు నిదర్శనంగా ఆంధ్రమహాభారతం రూపుదిద్దుకుంది. కవిబ్రహ్మ తిక్కన వ్యాసుని లక్ష్యాన్ని "లోకహితనిష్ఠబూని కావించె ధర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్"[9] అని వివరించారు. లోకహితాన్ని నిష్ఠతో కోరి, ధర్మమునే అద్వైతంగా అనగా రెండవది అనేది లేని స్థితిగా వర్ణిస్తూ, లేఖ్యమైన వేదాన్ని భారతంగా చెప్పాడని వ్యాసకావ్యలక్ష్యాన్ని మూడు అంశాలుగా ఆవిష్కరించారు.

ఆదికవి, భారతరచనకు శ్రీకారం చుట్టిన నన్నయభట్టు ఈ వివరణలు లేకుండా ఒక్కమాటలో

క. ***జననుత కృష్ణద్వైపా***
***యన ముని వృషభాభిహిత మహాభారత బ***
***ద్ధనిరూపితార్థ మేర్పడ***
***దెనుగున రచియింపు మధిక ధీయుక్తిమెయిన్***[10]

అని కృష్ణద్వైపాయనుడు నిరూపించిన అర్థాన్నే తెలుగులో చెప్పమని రాజరాజుకోరాడని స్పష్టంగా చెప్పారు. ధర్మభంగం చేస్తే కలిగే ఫలితాన్ని కళ్ళారా చూశాడు గనుక ధర్మాన్ని ఆచరించవలసిన అవసరాన్ని వ్యాసుడు ప్రబోధించాడు. 'కవిత్రయంవారు కూడా అటువంటి కారణాలవల్లనే భారత రచనకు పూనికొనివుంటారా' తెలియాలంటే చరిత్రను పరిశీలించాలి.

---

★ 9. ఆం.మ. భార విరాట 1-3

★ 10. ఆం.మ. భార ఆది 1-16

సంస్కృత మహాభారతం సమగ్ర స్వరూపంపొంది గ్రంథస్థమైన కాలంనాటి పరిస్థితులే, ధర్మగ్లానియే ఇంచుమించుగా ఆంధ్రభారతావతరణకు పూర్వం తెలుగుగడ్డమీద ఏర్పడ్డాయి. వైదిక ధర్మాన్ని పునరుద్ధరించి ప్రబోధించవలసిన అగత్యం, దేశభాషలో వాఙ్మయ సృష్టికి అవసరం, రెండూ ఏకకాలంలో 11వ శ॥లో సంభవించాయి. చాళుక్య ప్రభువైన రాజరాజనరేంద్రుని ప్రోత్సాహంతో అతని కుల బ్రాహ్మణుడైన నన్నయభట్టారకుడు ఈ మహత్కార్యాన్ని నిర్వహించేందుకు సిద్ధమైనారు. ఇంతటి బృహత్కార్యానికి దారితీసిన ఆనాటి పరిస్థితులు.....

క్రీ.శ.10వ శతాబ్దం నాటికే వేంగిమండలం తూర్పు చాళుక్యుల పరిపాలనలో ఉంది. క్రీ.శ.1011నాటికి రాజమహేంద్రవరం రాజధానిగా పరిపాలన కొనసాగిస్తున్న విమలాదిత్యుడు రాజరాజనరేంద్రుని తండ్రి. విమలాదిత్యుడు మొదట శైవమతావలంబియైనప్పటికీ తరువాత జినధర్మాన్ని స్వీకరించి జైనుడయ్యాడు. విమలాదిత్యుని రాణులలో ఒకరైన చామకాంబ కూడా జైనమతాన్ని స్వీకరించింది. ఇతడి మరొకరాణి కుందమాంబ. ఈమె దక్షిణదేశాన్ని పరిపాలించే చోళవంశీయుల కుమార్తె. చోళ ప్రభువులు వైదికమతానుయాయులు. పైదు మిక్కిలి శైవమతాభిమానులు. ఈకారణంగా కుందమాంబవలన చాళుక్యాంతఃపురంలో వైదికమత సంస్కృతి, మర్యాదలు నిలదొక్కుకున్నాయి. విమలాదిత్యుడు జైనమతాన్ని స్వీకరించినప్పటికి వైదిక మతాన్ని నిరసించలేదు. అప్పుడప్పుడు వేదపండితులను సత్కరించటం, హిందూదేవాలయాలకు మడిమాన్యాలు దానం చేయటం పూర్తిగా మానలేదు. విమలాదిత్య కుందమాంబల పుత్రుడైన రాజరాజు, మేనమామ కుమార్తె అమ్మంగదేవిని పరిణయమాడాడు. ఈమె రాజేంద్రచోళుని పుత్రిక. తల్లి నేర్పిన సంస్కారం, మేనమామల సాంగత్యం, భార్య అమ్మంగదేవి కూడా వైదిక సాంప్రదాయాన్ని అనుసరించే వంశంనుంచి రావటం రాజరాజులో వైదిక మతాభిమానాన్ని పెంపొందించాయి.

విమలాదిత్యునికి పూర్వం పరిపాలించిన చాళుక్య ప్రభువులు కూడా ప్రధానంగా శైవమతాన్ని అనుసరించినప్పటికీ జైనమతోద్ధరణకు తోడ్పడ్డారు. జైనమత గురువులకు ఆశ్రయం కల్పించి అనేక దానాలు చేశారు. ఆనాటికే ఆంధ్రదేశంలో బౌద్ధమతం వేళ్ళూనిస్థిరపడింది. అమరావతి, విజయవాటిక సుప్రసిద్ధ బౌద్ధక్షేత్రాలు, విద్యానిలయాలై ఖండాంతరాలలో కూడా పేరుపొందాయి. జైన బౌద్ధమతాలు రెండూ ప్రజల జీవనంలో, సంస్కృతిలో లీనమై వారికి చేరువైనాయి. ఆదరించే ప్రభువులు, అనుసరించే ప్రజలు కరువై వైదికమతం నిర్వీర్యమైఉంది. చాళుక్య ప్రభువులు మతసహనం చూపినా ఆచరణలో మాత్రం జైనమతం వైపే నిలిచారు. బౌద్ధజైనాల నడుమ చిక్కుకున్న వైదికమతం స్వయం ప్రకాశంతో వర్థిల్లలేకపోయింది. "యథారాజా తథాప్రజా"అనే సూక్తి నిజమై సామాన్య జనులకు కూడా వైదికమతం అంటే ఆసక్తి నిరాసక్తి అనేవి రెండూ క్షీణించాయి. అంతేకాక హింస అహింసలగురించి, యజ్ఞయాగాలగురించి, వర్ణాశ్రమధర్మాలగురించి ప్రజలలో అనేక ప్రశ్నలు తలెత్తాయి. ఈ ప్రశ్నలకు బీజం వేసినవి బౌద్ధజైనమతాలు.

శివపూజాదురంధరుడు. వైదిక మతాభిమాని అయిన రాజరాజనరేంద్రుడు ఈ పరిస్థితిని గుర్తించాడు. వైదిక మతాన్ని ఉద్ధరించాలంటే ఆ మతానికి సంపూర్ణమైన ప్రోత్సాహం, ఆదరణ అవసరమని గ్రహించాడు. ప్రజలకు దగ్గరగా మతాన్ని తీసుకుని వెళ్ళాలంటే ఆ మత ప్రబోధం ప్రజల భాషలో జరగాలని నిశ్చయించాడు. మత ప్రచారం విషయంలో బౌద్ధజైనమతాల మార్గాన్ని అనుసరించి దేశభాషలో అంటే తెలుగులోనే ప్రచారం కొనసాగించటం ముఖ్యమని గుర్తించాడు. తన నిశ్చయాన్ని ప్రయోగంలోకి తీసుకుని రావాలంటే

మ. **అమితాఖ్యానకశాఖలం బొలిచివేదార్థామలచ్ఛాయ యై**
**సుమహావర్గ చతుష్కపుష్పవితతిన్ శోభిల్లికృష్ణార్జునో**
**త్తమనానాగుణకీర్తనార్థఫల మై ద్వైపాయనోద్యానజా**
**తమహాభారత పారిజాత (మమరున్ ధాత్రీసుర ప్రార్థ్యమై)** [11]

భూజాన్ని ఆశ్రయించటం ఒక్కటే మార్గంగా భావించాడు. మహాభారత పారిజాతం ప్రజల భాషలో ప్రజలకు సన్నిహితంగా రావాలని ఆశించాడు. తన కుల బ్రాహ్మణుడైన నన్నయభట్టును వ్యాసప్రబోధితార్థం ఏదైతే ఉందో దానినే తెలుగులో చెప్పమని కోరాడు.

అంతేకాక

క. **బహుభాషల బహు విధముల**
**బహుజనముల వలన వినుచు భారతబద్ధ**
**స్పృహులగువారికి నెప్పుడు**
**బహుయాగంబుల ఫలంబు పరమార్థముగన్** [12]

అని రెండు విశేషాంశాలను పేర్కొన్నారు. మొదటిది ఆనాటికే బహుభాషలలో అనేకవిధాలైన భారతకథలు ప్రచారంలో ఉన్నాయన్నది. రెండవది భారతశ్రవణ ఫలితంగా యజ్ఞంచేసినఫలం లభిస్తుందన్నది. మొదటి విషయం సామాన్య ప్రజలలో భారతకథలకు ఉండే ఆదరాన్ని తెలియజేస్తున్నది. రెండవ విషయం భారతం వినటంవలన యాగఫలం లభిస్తుందని ఫలశ్రుతిచెప్పటంలో వైదికధర్మ ప్రబోధలక్ష్యం సూచితమౌతున్నది

బహుభాషల అని అనటం మరొక అంశాన్ని స్ఫురింపజేస్తున్నది. ఆనాటికే కన్నడభాషలో పంపకవి వ్రాసిన భారతగాథ "విక్రమార్జున విజయం" ప్రచారం పొందింది. ఈ కావ్యంలో

★ 11. ఆం. మ. భార. ఆది 1-66

★ 12. ఆం.మ. భా. ఆది 1-17

కృతిభర్తకు అర్జునునకు అభేదం చెప్పటంవలన అర్జునుడె కావ్యానికి నాయకుడైనాడు. ద్రౌపది అర్జునునికి మాత్రమే భార్య. ఈ కావ్యం ప్రధానంగా జైనధర్మ ప్రబోధ గ్రంథం. వాఙ్మయ ధురంధరుడు, బహుభాషాకోవిదుడు, నన్నయ సహాధ్యాయి అయిన నారాయణభట్టు నన్నయతో విక్రమార్జున విజయాన్ని గురించి చర్చించి వుంటాడు. ఈ కారణంవల్లనే రాజరాజు వ్యాసునిలక్ష్యమైన వైదికధర్మప్రబోధంతోనే తెలుగుభారతాన్ని రచించమనికోరాడు. అంతేకాక రాజరాజు "ఇవి యేమన్ సతతంబు నాయెడఁ గరంబిష్టంబులైయుండు" అని తనకు అత్యంత ప్రియమైన విషయాలని చెప్పినవాటిలో బ్రాహ్మణభక్తి, భారత కథాశ్రవణాసక్తి, పార్వతీపతి పదాబ్జారాధన అనే మూడు కోరికలు అతడి వైదిక ధర్మనిరతిని చాటుతున్నాయి. తాను చేయదలచిన ధర్మప్రబోధానికి వ్యాసుడు తాను సాక్షిగా చూసిన భరతవంశగాథను సూత్రంగా ఎన్నుకోగా, రాజరాజు తాను సంకల్పించిన వైదిక మతోద్ధరణకు తన పూర్వులైన చంద్రవంశీయులగాథను వస్తువుగా తెలుగులో చెప్పమని కోరాడు. ఈ కోరిక బాహ్యమైనదిగా కన్పించినా దీని వెనుకనున్న అంతరార్థంమాత్రం మహాభారత ప్రబోధిత వైదికధర్మ పునరుద్ధరణమే.

ఇంతటి బృహత్తర లక్ష్యంతో బ్రహ్మాండాది నానాపురాణవిజ్ఞాన నిరతుడైన నన్నయభట్టు, అర్జునునకు శ్రీకృష్ణునివలె తన సహాధ్యాయి అయిన నారాయణభట్టు అస్త్రం - అంటే గంటం పట్టకుండా తోడైనిర్వహింపగా భారతరచనకు పూనుకున్నాడు.

కారణాంతరాలవలన నన్నయభట్టు ప్రయత్నం రెండున్నర పర్వాల రచన అనంతరం భంగపడింది. చాళుక్య వంశం అంతరించిన తరువాత ఆంధ్రదేశం రాజకీయంగా అనేక ఒడిదుడుకులను ఎదుర్కొనవలసి వచ్చింది. చిన్న చిన్న స్వతంత్ర్య రాజ్యాలు వెలసి పరస్పర కలహాలు చెలరేగాయి. వీటికి తోడుగా కర్ణాటక నుంచి వీరశైవం, చోళపాండ్యాది దక్షిణ ప్రాంతాలనుంచి వీరవైష్ణవం తెలుగుగడ్డమీద తమతమ ప్రభావాలను చూపించసాగాయి. ఈ విద్వేషాలు, మతకలహాలు అభినవ కురుక్షేత్రమని పేరుపొందిన పల్నాటి యుద్ధానికి దారి తీశాయి. పల్నాటి ప్రభువుల వంశనాశనానికి జ్ఞాతులకలహం స్థూలకారణమైనా, సూక్ష్మంగా పరిశీలిస్తే బ్రహ్మనాయుడి వైష్ణవానికి, నాగమాంబ శైవ మతాభిమానానికి మధ్య రేగిన రవరవలే యుద్ధకారణాలని చరిత్ర చెప్తున్నది. ఇటువంటి పరిస్థితులలో ఎవరికివారే తమ మతం, తమ ధర్మం శ్రేష్ఠమైనవనే రాజస ప్రవృత్తితో ప్రవర్తించారు. సర్వజనామోదకరమైన, వైదిక ధర్మ ప్రబోధకమైన ఆంధ్రమహాభారత రచనను నన్నయ తరువాత చేపట్టే మహాకవి లేకపోయాడు. ఆంధ్రమహాభారతాన్ని పూర్తిచేసే ప్రయత్నం జరగలేదు.

అటు తరువాత సుమారుగా రెండున్నర శతాబ్దాలకు నెల్లూరు ప్రభువు మనుమసిద్ధి ఆస్థానకవి, కవిబ్రహ్మ తిక్కన సోమయాజి (13వ శ.) భారత రచన ప్రయోజనాన్ని సిద్ధింపజేయాలని

పూనుకున్నారు. శైవ వైష్ణవ విభేదాలను రూపుమాపే సంకల్పంతో శివకేశవులు అభేదులని వర్ణించి, హరిహరనాథతత్త్వాన్ని ప్రబోధించి, హరిహరనాథునికి అంకితంగా విరాటపర్వం మొదలుకొని చివరివరకూ పదిహేను పర్వాలను రచించారు. నెల్లూరు మండలం నుంచి ఓరుగల్లు కాకతిగణపతిదేవుని సభాస్థలి వరకూ తిక్కన భారత ప్రశస్తి వ్యాపించింది. అయితే వృద్ధాప్యం వల్లనో, మరేకారణం చేతనో తిక్కన నన్నయ వదలిన భాగాన్ని అలాగే వదలివేశారు. అరణ్యపర్వశేషం లుప్తంగానే ఉండిపోయింది. ఆంధ్రమహాభారతానికి స్వరూపం ఏర్పడిందిగాని సంపూర్ణత్వం సిద్ధించలేదు.

కాకతి గణపతిదేవుని కుమార్తె రుద్రమదేవి. ఆమె మనుమడైన ప్రతాపరుద్రుని కాలంవరకు ఆంధ్రదేశం కొంతవరకు ఒక సామ్రాజ్య పాలనలో ఉందని చెప్పవచ్చు. ప్రతాపరుద్రుని రాజ్యకాలంలోనే ఓరుగల్లు సామ్రాజ్యం పతనమై ఆంధ్రదేశం మహమ్మదీయుల వశమైంది. తురుష్కుల దుండగాలు మితిమీరిపోయాయి. హిందువులను హింసించటం వారికి నిత్యకృత్యమైంది. రాజకీయంగాను, సాంఘికంగాను దేశంలో సుస్థిరత, భద్రత లోపించాయి. ఈ సంక్షోభాన్ని ఎదుర్కొని వెలమదొరలు, రెడ్డివంశీయులు ఏకమై మునుసూరి కాపయనాయకుని నాయకత్వంలో మహమ్మదీయులను ఎదిరించి పోరాడారు. చాలా భాగం ఆంధ్రదేశాన్ని తిరిగి చేజిక్కించుకున్నారు కాని అధికారం లభించాక అంతఃకలహాలు చెలరేగాయి. దేశం చిన్న చిన్న రాజ్యాలుగా విడిపోయింది. పద్మ నాయకులు (వెలమవీరులు), రెడ్డి రాజులు ఆంధ్రదేశాన్ని సమర్థవంతంగా పరిపాలించారు. వీరిలో అద్దంకి రాజధానిగా చేసుకొని పాలించిన రెడ్డి రాజులు శివభక్తి పరాయణులు, సాహిత్యాన్ని ఆదరించిన ఆశ్రితపోషకులు. అద్దంకి ప్రభువు వేమారెడ్డి కాలంలో జీవించిన ఎఱ్ఱాప్రగడ మహాభారత విశిష్టతను ప్రచారం చెయ్యాలని, వైదికధర్మ ప్రబోధలక్ష్యాన్ని సంపూర్ణం చేయాలని సంకల్పించారు. తిక్కన తరువాత సుమారుగా అర్థశతాబ్దం అనంతరం ఎఱ్ఱన (13వ శ॥ చివర 14వ శ॥మొదలు) మహాభారతంలో నన్నయ వదిలిన భాగాన్ని పూరించేందుకు పూనుకున్నారు.

నన్నయ విడిచిపెట్టిన భాగాన్ని ఆయన పేరనే "సకల లోకైక విదితుడయిన నన్నయభట్టు సరససారస్వతాంశ ప్రశస్తిఁ దన్ను జెందుటయు సాధుజన హర్షసిద్ధిఁ గోరి" అరణ్యపర్వ శేషాన్ని పూరించారు. అది కూడా "తత్కవితారీతియుఁ గొంత దోపఁ దద్రచనయకా" చేశానని సవినయంగా చెప్పుకున్నారు. తాను చెప్పుకున్న విషయాలు అతిశయోక్తులు కావని తన రచనలో నిరూపించి చూపించారు.

ఉ. భాసుర భారతార్థముల భంగులు నిక్కమెఱుంగ నేరమిన్
గాసట బీసటే చదివి గాథలు ద్రవ్వు తెలుంగువారికిన్
వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లఁగఁ జేసినట్టి
యభ్యాసనకల్పులం దలఁతు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్ ॥ ★

అని తనకన్నా ముందుగా భారతాంధ్రీకరణ నిర్వహించిన నన్నయ తిక్కనలు వ్యాసముని ప్రణీతార్థం ఏదైతే ఉందో, అట్టి దానిని, స్థూలంగా కథలను మాత్రమే విని ఆనందించే తెలుగువారికి సుబోధకం చేశారని వారిని స్తుతించాడు. సర్వధర్మాలకు నిలయమైన సంస్కృతమహాభారతానికి సమగ్రస్వరూపం ఏ లక్ష్యంతో ఏర్పడిందో అదే లక్ష్యంతో ఆంధ్రమహాభారతం కూడా అవతరించింది. నన్నయ, తిక్కన, ఎఱ్ఱనల కాలాలలో దేశంలో ఏర్పడిన పరిస్థితులే ఆంధ్రమహాభారతం అవతరించేందుకు కారణమయ్యాయి. ఈ కారణాల వల్లనే ఒక్క ఆంధ్రమహాభారతం తప్ప ఏ ఇతర ప్రాంతీయ భాషలలోని మహాభారతంకూడా వ్యాసహృదయాన్ని ఆవిష్కరించలేకపోయింది. వారందరు ఇతిహాసగాథను రసవంతమైన కావ్యేతివృత్తంగా గ్రహించి వారి వారి రచనలు చేశారు. సంస్కృతంలో వేదవాఙ్మయం తరువాత మహాభారతమే ధర్మప్రబోధంతో కూడిన తొలి గ్రంథమయినట్లే తెలుగులో కూడా మహాభారతమే ఆదికావ్యం, తొలి ధర్మ ప్రబోధ గ్రంథం అయ్యింది.

ఈ విధంగా మునిత్రయం సమకూర్చిన మహాభారతం, కవిత్రయం నిర్మించిన ఆంధ్రమహాభారతం రెండూ కూడా ధర్మత్రయాన్ని వివరిస్తున్నాయి. మానవ జీవితంలో మూడురకాలైన ధర్మాలను అనుసరించాలని కృష్ణద్వైపాయనుడు ప్రబోధించాడు. అవి వ్యక్తిధర్మం, సామాజిక ధర్మం, ఆధ్యాత్మికధర్మం. ఇవి ఉత్తరోత్తరం బలీయమైనవి. అంటే వ్యక్తిధర్మాన్ని ప్రతి ఒక్కరు అనుసరించాలి. సామాజిక క్షేమంకోసం అవసరమైతే వ్యక్తిధర్మాన్ని పక్కకు పెట్టాలి. ఆధ్యాత్మికధర్మం ఈ రెంటికన్నా ఉన్నతమైనది. ఎటువంటి పరిస్థితులలోను ఆధర్మాన్ని మాత్రం విడిచిపెట్టరాదు. ఈ మూడింటిలో వ్యక్తిధర్మ సామాజిక ధర్మాలు మనిషి లౌకిక జీవితానికి సంబంధించినవి. ఆధ్యాత్మిక ధర్మం జీవాత్మ, పరమాత్మల స్వరూపాన్ని, సంబంధాన్ని తెలియజేసేది. మహాభారతంలో ఆమూలాగ్రం మానవ జీవితాన్ని నడిపించే ఈ మూడు ధర్మమార్గాల వివరణ, ఆచరణ, ప్రయోజనం వర్ణితమయినాయి. ★

★ 13. నృసింహపురాణము - ఎఱ్ఱాప్రగడ - 1-17

# 2. సంస్కృతాంధ్ర మహాభారతాలలో ధర్మప్రస్తావన

మానవ జీవితంలో ధర్మాచరణకుగల ప్రాముఖ్యాన్ని వివరిస్తూనే మహాభారతం ధర్మనిర్ణయంలో కలిగే సంఘర్షణలను కూడా ప్రస్తావించింది కొన్ని సందర్భాలలో రెండు రకాలైన ధర్మాలమధ్యగాని, లేక పరిస్థితులు కారణంగా గాని ఏర్పడే సంఘర్షణల వలన ధర్మ నిర్ణయంలో సందేహం కలుగుతుంది ఏ ధర్మం ఏ పరిస్థితిలో బలీయమైనది, ఆచరణయోగ్యమైనది అనిగాని లేదా సంకటపరిస్థితులలో ధర్మాన్ని అనుసరించటం సాధ్యమా అనిగాని ప్రశ్నలు ఉద్భవిస్తాయి ఇటువంటి అనేక ప్రశ్నలకు మహాభారతంలో సమాధానాలు లభిస్తాయి సంస్కృతాంధ్ర మహాభారతాలలో ధర్మప్రస్తావన అని చెప్పటం కూడా సందేహానికి ఆస్కారం కలిగిస్తుంది రెండు భాషలలోను వైదికధర్మ ప్రబోధమే మహాభారత లక్ష్యమైనప్పుడు వాటి మధ్య భేదం ఎలావుంటుంది? అనే ప్రశ్న తలెత్తటం అత్యంత సహజం అయితే ధర్మ వివరణలోను, లక్ష్యంలోను రెండు గ్రంథాలలో భేదం లేదనేమాట అక్షరసత్యమేకాని దేశకాలభేదాలవలన లౌకిక ధర్మాలలో కొన్ని భేదాలు, మతాంతరాలు కన్పిస్తాయి ఆంధ్రమహాభారతం అర్వాచీనమైనందు వలన ఈ భేదాలు అక్కడక్కడ కన్పిస్తాయి.

సమగ్ర సంస్కృత మహాభారతం రూపుదిద్దుకున్న తరువాత కొన్ని శతాబ్దాలకు ఆంధ్రమహాభారత రచన ప్రారంభమయింది ఈ మధ్యకాలంలో స్మృతులు, ధర్మశాస్త్రాలు, పురాణాలు అనేకం ప్రచారంలోకి వచ్చాయి. వాదాలు, ప్రతివాదాలు, మతాంతరాలు ఏర్పడ్డాయి సంస్కృత మహాభారతం ఉత్తర భారతదేశానికి సంబంధించిన ఇతిహాసం ఆంధ్రమహాభారతం వింధ్యకు దక్షిణాన, ఆర్య ద్రావిడ సంస్కృతుల సంపర్కంగల తెలుగుదేశంలో ఆవిర్భవించింది ఈ భూభాగంలో బౌద్ధ ధర్మ ప్రభావంవల్ల, ప్రాంతీయాచారాలవల్ల, పద్ధతులలోను, లోకాచారాలలోను (సామాజికధర్మంలో) భేదాలు కన్పిస్తాయి. ఈ భేదాలే సంస్కృతాంధ్ర మహాభారతాలలో లౌకిక ధర్మంలో కొంత వ్యత్యాసానికి కారణాలయ్యాయి

సంస్కృత మహాభారతంలో ధర్మ ప్రబోధకుడుగా కన్పించే మనువు ఆంధ్రమహాభారత కాలానికంటే ఎన్నో శతాబ్దాలకు ముందే స్మృతికారుడైనవాడు 'మానవజాతికే' ధర్మనిర్ణేతగా నిలిచాడు భారతదేశమంతటికీ ధర్మనిర్ణయానికి మనుస్మృతి ప్రామాణిక గ్రంథమయింది మనువు తరువాత అనేక మంది ధర్మశాస్త్రగ్రంథాలు వ్రాశారు వారిలో గౌతమబోధాయన, ఆపస్తంబులు రచించిన ధర్మ శాస్త్రాలు భారతదేశంలోని వివిధ ప్రాంతాలవారికి, వర్గాలవారికి లౌకిక ధర్మ నిర్వహణకు ప్రామాణికాలైనాయి నిత్యనైమిత్తిక విధులలో త్రిలింగ దేశంలో సామవేదులకు తప్ప మిగిలిన

వారందరికీ అపస్తంబ ధర్మ సూత్రాలు ప్రామాణికం. సామవేదులు గౌతమ ధర్మసూత్రాలను అనుసరిస్తారు.

కవిత్రయంవారు ముగ్గురు తాము అపస్తంబ సూత్రులమని స్పష్టంగా చెప్పుకున్నారు. నన్నయ రాజరాజును "మనుమార్గవర్తనుడ"ని, "సకలవర్ణాశ్రమ ధర్మరక్షకుడ"ని వర్ణించాడు. వేద ధర్మాన్ని ప్రతిష్ఠించిన మనుస్మృతిని, లోకాచార విధి నిర్వహణలో అపస్తంబుని అనుసరించి కవిత్రయంవారు భారత రచనను ఏ విధంగా కొనసాగించారు అనే విషయం కొంచెం వివరంగా చూడవలసివున్నది. అపస్తంబుడు కొన్ని విషయాలలో మనువుచెప్పిన వానికన్నా వేరుగా నిర్ణయం చేశాడు. ఈ అంశాలలో నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలు వైదిక ధర్మానికిగాని, ఇతిహాసమూలవస్తువుకుగాని భంగం కలుగకుండా ఎలా నిర్వహించారు అనే విషయాన్ని పరిశీలిద్దాం.

స్మృతికారుడైన మనువు అష్టవిధవివాహాలను పేర్కొన్నారు. అవి బ్రాహ్మ్య, దైవ, అర్ష ప్రాజాపత్య, అసుర, గాంధర్వ, రాక్షస, పైశాచాలు. వీటిలో అసుర పైశాచాలు సర్వదానింద్యాలని స్పష్టంగా చెప్పారు.[14] అపస్తంబుడు కేవలం బ్రాహ్మ్య, దైవ, అర్ష, గాంధర్వ, అసుర, రాక్షస, వివాహాలనే ఆరింటిని మాత్రమే పేర్కొన్నారు.[15] ఈ విషయంలోనన్నయ మనుస్మృతిని అనుసరించి ఎనిమిది వివాహాలను పేర్కొని క్షత్రియులకు గాంధర్వ, రాక్షస వివాహాలు ధర్మ సమ్మతములని వర్ణించాడు.[16] మిగిలిన వాటి యుక్తాయుక్తాలను గురించి ప్రస్తావించలేదు.

వివాహాల విషయంలో తిక్కన కూడా అపస్తంబుడు వదలిన ప్రాజాపత్య, పైశాచ వివాహాలను గురించి ప్రస్తావించలేదు. అర్ష దైవ వివాహాలను కూడా పేర్కొనలేదు. బ్రాహ్మ్య వివాహం గురించి చెప్పి, వధూవరులు పరస్పరానురాగులగుట ఎఱిగి పెద్దలు నిర్వహించేది 'క్షాత్ర'మనే మరొక పద్ధతి వివాహాన్ని వివరించాడు. ఎటువంటి వివరణ లేకుండా క్షాత్రవివాహ ప్రస్తావన సంస్కృత మహాభారతంలో కనిపిస్తుంది.[17] మొత్తం మీద తిక్కన చెప్పినవి బ్రాహ్మ్య, క్షాత్ర, గాంధర్వ, రాక్షస అసుర వివాహాలు అయిదే. ఇందులో అసుర, రాక్షస వివాహాలు ధర్మదూషితాలని నిష్కర్షగా చెప్పారు.[18] అటు తరువాత సంతానం విషయంలో మనువు ద్వాదశవిధపుత్రులను పేర్కొన్నారు. బోధాయన గౌతమ ధర్మ సూత్రాలు కూడా మనువును అనుసరించి వివరించాయి. వీరు చెప్పిన పన్నెండు మంది పుత్రులు - ఔరస, క్షేత్రజ, దత్తక, కృత్రిమ, గూఢోత్పన్న, అపవిద్ధ, కానీన, సహోఢ,

---

★ 14. మనుస్మృతి 3-21, 25

★ 15. History of Dharma Sastra-P.V. Kane - pg36

★ 16. ఆం. మ. భార. ఆది 4-55

★ 17. సం. మ. భార అను 44-9

★ 18. ఆం.మ. భార. అను 2-226

క్రీత, పౌనర్భవ, స్వయందత్త జ్ఞాతులు. అపస్తంబుడు అరుగురిని మాత్రమే పుత్రులుగా పేర్కొని వారినే వారసులు, దాయాదులు అని చెప్పాడు. వారిలో కూడా దత్తుని, క్రీతుని తిరస్కరించాడు.[19] నన్నయ అపస్తంబుని మార్గాన్ని అనుసరించి "ఔరసక్షేత్రజ దత్తక కృత్రిమ గూఢోత్పన్నాపవిద్ధులను వార్వురు పుత్రులు బంధువులు దాయాదులు నగుదురు కానీన సహోఢ క్రీత పౌనర్భవ స్వయందత్త జ్ఞాతులను వార్వురు పుత్రులు బంధువులగుదురుగాని దాయాదులు గారట్టి పుత్రులలో నౌరమనకించుకయ తక్కువగాని తక్కటి పుత్రులకంటె క్షేత్రజుండుత్కృష్టుండందువ దేవర న్యాయ జాతుండుత్తముండం(డుగావున"[20] అని వర్ణించాడు. మనువు చెప్పిన పన్నెండు మందినీ చెప్పినప్పటికీ అపస్తంబుడు చెప్పిన అరుగురినే వారసులుగా పేర్కొన్నాడు. మిగిలిన అరుగురు పుత్రుని వరసగల బంధువులు మాత్రమే అన్నాడు. ఔరసుడి తరువాత స్థానాన్ని క్షేత్రజుడికే కల్పించాడు.

నన్నయ తరువాత 200లసం॥ అనంతరం భారత రచన చేబూనిన తిక్కన ద్వాదశ విధ పుత్రులను వివరించాడు. ఆ వరుస క్రమం ఈ విధంగా ఉంది. ఔరసుడు, పుత్రికా పుత్రుడు, క్షేత్రజుడు, దత్తకుడు. కృత్రిముడు, గూఢజుడు, అపవిద్ధుడు, కానీనుడు, సహోఢుడు, పౌనర్భవుడు, స్వయం దత్తుడు, క్రీతుడు. నన్నయ చెప్పిన జ్ఞాతి అనే పుత్రుడు తిక్కన చెప్పిన వారిలో లేడు. నన్నయ ఔరసుడి తరువాత క్షేత్రజుడు ఉత్తముడని చెప్పగా తిక్కన ఔరసుని తరువాత స్థానం పుత్రికాపుత్రుడు అంటే దౌహిత్రుడికి కల్పించాడు. ఈ విధంగా చెప్పటం దేశకాలభేదాల బట్టి, లోకాచారం వలన సంభవించిన అంశం. మనువు, అపస్తంబుడు, నన్నయ,వివరించిన సంతానంలో దౌహిత్రుడు లేడు. పుత్రసంతానం లేని గృహస్థు కన్యాదాన సమయంలో, ఆ కుమార్తెకు జన్మించే పుత్రుడిని తన వారసుడుగా మంత్రసహితంగా స్వీకరించవచ్చునని మాత్రం మనువు ఒక మార్గం సూచించాడు

అతి ప్రాచీన కాలంనుంచి మహాభారతకాలం వరకూ కూడా విపత్కాలంలో సామాజిక ధర్మంగా నియోగవిధి, దేవర న్యాయం సర్వదా అంగీకారమైన విషయాలు. మహాభారతంలో ధృతరాష్ట్రపాండురాజులు దేవరన్యాయం చేత, పాండవులు నియోగవిధిన జన్మించారు. మనువు నియోగవిధిని అంగీకరించినట్లుగాను, వ్యతిరేకించినట్లుగాను కూడా స్మృతివాక్యాలు కన్పిస్తున్నాయి అపస్తంబుడు నియోగవిధిని పూర్తిగా వ్యతిరేకించాడు.[21] ఈ రెండు ధర్మాలు భారతంలో ఆది పర్వంలోనే ప్రస్తావనకు వస్తాయి. నన్నయ ఈ సందర్భంలో వ్యాసహృదయాన్ని అనుసరించి

---

★ 19. అపస్తంబ ధర్మసూత్రం 2-14-10

★ 20. ఆం.మ. భార ఆది 5-75

★ 21. History of Dharma Sastra I - P.V. Kana Page 29-30.

ఇతివృత్త వస్తువునే యథాతథంగా వర్ణించాడు. నియోగవిధిని సమర్థించడంగాని విమర్శించడంగాని చేయక తటస్థంగా వున్నాడు. సత్యవతి ఆజ్ఞను అనుసరించి దేవరన్యాయంతో వ్యాసునివలన సంతానం పొందిన అంబిక, అంబాలికల హృదయగత భావాలను వ్యాసుడు వారి చర్యలద్వారా స్ఫురింపచేశాడు. వారి వారి చర్యలకు తగినట్టుగానే వారి సంతానం జన్మించారు.

కుంతి విషయంలో ఇందుకు భిన్నంగా జరిగింది. ఆమె స్వతంత్రంగా తన భావాలను వ్యక్తం చేసింది. సంతానాపేక్షతో పాండురాజు నియోగవిధి ద్వారా కుంతిని. పుత్రుని పొంది తనను పున్నామనరకంనుంచి తప్పించమని అర్థిస్తాడు. ఇక్కడ నన్నయ చిన్న చమత్కారం చేశాడు. సంస్కృత భారతంలో పాండురాజు శ్వేతకేతు వృత్తాంతాన్ని వివరించి తాము నివసిస్తున్న ఉత్తర కురుభూములలో నియోగవిధి అంగీకారమేనని ఆ పద్ధతిన సంతానం పొందమని ఆమెను కోరుతాడు. కుంతి తనకు దూర్వాసముని ఇచ్చిన మంత్రాన్ని గురించి చెప్పి 'ఏ దేవతను మెప్పించి పుత్రుని పొందగలన'ని భర్తను అడుగుతుంది. పాండురాజు కోరిన విధంగా దేవతలను ఆవాహనచేసి సంతానం పొందుతుంది. భర్త కోరినమీదట మాద్రికి కూడా మంత్రం ఉపదేశించి మంత్రాన్ని ఒక్కమారే ప్రయోగించమని నిర్దేశిస్తుంది.

నన్నయగారి కుంతిమాత్రం నియోగవిధికి ఒకపట్టాన అంగీకరించదు. 'భరతకుల శ్రేష్ఠుడవైన నీ ధర్మపత్నులమైన మేము అంతఃకరణలోనైనా పరపురుషులను పొందగలమా' అని పలుకుతుంది. వేరొకరిని పొందగలమా అని ప్రశ్నించటం నన్నయ లోకజ్ఞతకు చిహ్నం. నన్నయ చూపించిన చమత్కారం ఇక్కడే వుంది.

**తే॥ భర్త చేత నియోగింపఁ బడక సతికి**
**నెద్దియును జేయఁగాఁ దగ దెద్దియైన**
**భర్త చేత నియోగింపఁబడియుఁ దానిఁ**
**జేయకునికి దోషంబని చెప్పుదురు.** [22]

అని మనువు చెప్పిన పతివ్రత ధర్మాన్ని వివరించాడు. కుంతీదేవి పతివ్రతాధర్మాన్ని పాటించి సంతానాన్ని పొందేందుకు అంగీకరించిందని సమర్థించాడు. నియోగవిధిన జన్మించిన పాండవుల జన్మ విషయంలో నియోగ పద్ధతిని వ్యతిరేకించిన ఆపస్తంబుని సమర్థిస్తున్నట్లు తెలియరాకుండా, మనుస్మృతిలోని పతివ్రత ధర్మాన్ని అలంబనం చేసుకొని వ్యాసుని అభిప్రాయాన్ని అనుసరించి నన్నయ ఇతిహాస విషయాన్ని వర్ణించాడు.

---

★ 22. ఆం.మ. భార ఆది 5-88

నియోగపద్ధతిలో జన్మించిన సంతానం ఆ స్త్రీ భర్తకే చెందుతారని మనువు నిర్దేశించాడు. మహాభారతంలో వ్యాసుడు, పాండవులు పాండురాజుకు పరపురుషుడికి ఇద్దరికీ సంతానంగా వ్యవహరింపబడినట్టుగా వర్ణించాడు. ఈ విషయంలో కవిత్రయం వారు వ్యాసుని మార్గాన్నే అనుసరించారు. అయితే విచిత్రవీర్య క్షేత్రజ పుత్రులైన ధృతరాష్ట్ర పాండురాజులు వ్యాస తనూజులుగా పేరొందలేదు. వీరు దేవర న్యాయం వలన జన్మించిన వారనిగాని లేదా పాండవులవలె దేవతామూర్తుల వరప్రసాదం వలన జన్మించిన వారు కాకపోవటం గాని ఇందుకు కారణమై ఉండవచ్చును.

మనువు చాతుర్వర్ణ్యాలను వర్ణించి వర్ణవ్యవస్థను సమర్థించాడు. వర్ణ సంకరం పాపమని నిరసించాడు. ఆపస్తంబుడు వర్ణసంకరాన్ని గురించి చర్చించలేదు. వర్ణ సంకరానికి పాల్పడిన వారిని చండాలురని అన్నాడు. నన్నయ తిక్కనలు ఆది, శాంతి, అనుశాసనిక పర్వాలలో అనేక సందర్భాలలో వర్ణవ్యవస్థ సమాజ శ్రేయస్సుకు మూలమనే విషయాన్ని పదేపదే చెప్పారు. ఆపస్తంబుని మార్గాన్ని అనుసరించి వర్ణసంకరాన్ని గురించి ప్రస్తావించలేదు.

ఆపస్తంబుడు రథకారకులకు (సూత కులజులకు) ఉపనయన సంస్కారాన్ని అంగీకరించలేదు. సంస్కృత భారతం రాధ భర్త సూతునకు గంగలో లభించిన శిశువుకు నామకర్మ జరిగినట్లు మాత్రం చెప్పింది. ఆంధ్రమహాభారతంలో నన్నయ ఏలాంటి కర్మల ప్రసక్తి లేకుండా సూతునకు లభించిన బాలుడు వసుషేణ నామంతో రాధేయుడై పెరిగాడని మాత్రం వర్ణించాడు. తిక్కన ఈ విషయాన్ని ఇంకొంచెం స్పష్టంగా 'రాధయునధిరథుండు వాని జాతకర్మాది సమస్త సంస్కారంబులు నిజకులోచితంబుగా నాచరించిరట్టి తల్లిదండ్రులకుఁ బుత్రకృత్యంబులు నిర్వర్తింపక వారలఁ బాసి యేనువచ్చుట ధర్మంబగునే' అని వివరించాడుగాని ఇక్కడ ఉపనయన ప్రస్తావన చేయలేదు.

ఈ వివరాలు కవిత్రయంవారు ఇతిహాసమూలగాధకు, వ్యాస ప్రబోధిత ధర్మానికి భంగంరానీయకుండా ప్రాంతీయమైన సమకాలిక లౌకిక ధర్మానికి ఏ విధంగా సామరస్యం చూపారో గ్రహించేందుకు సహాయపడతాయి. ఈ రెండు మహాకావ్యాల మధ్యగల కాలభేదం వలన వచ్చిన మార్పును సూచిస్తాయి. ధర్మానుసరణలోగాని ధర్మప్రబోధంలోగాని సంస్కృతాంధ్ర భారతాల మధ్య ఎలాంటి మౌలికమైన భేదంలేదని తెలుసుకునేందుకే ఈ చర్చ తోడ్పడుతుంది.

అయితే ఇంత చర్చకు మూలమైన ఈ ధర్మం అంటే ఏమిటి, ధర్మానుసరణ వలన ప్రయోజనం ఎటువంటిది? వంటి ప్రశ్నలు తలెత్తటం సహజం. ధర్మ స్వరూపాన్ని, ధర్మశబ్ద నిర్వచనాన్ని, ధర్మ ప్రయోజనాన్ని గురించి పరిశీలిస్తే ఈ ప్రశ్నలకు సమాధానం దొరుకుతుంది. ★

★ 23. మనుస్మృతి 9-52

# 3. ధర్మం అంటే ఏమిటి - ఎటువంటిది

ధర్మశబ్దం 'ధృ' అనే ధాతువునుంచి పుట్టిందని వ్యాకరణ వేత్తలు నిర్వచించారు. 'ధృ' అంటే పట్టివుంచేది అని అర్థం. ధర్మం దేనిని, ఏ రకంగా పట్టివుంచుతుంది అన్న ప్రశ్నకు "ధరతి లోకానితి ధర్మః" (లోకములను ధరించేది ధర్మం). "ధ్రియతే వా జనైరితి" (జనులను పట్టివుంచేది ధర్మం) అనే నిర్వచనాలను ఇచ్చారు. మానవులు, ధర్మం పరస్పరాధారాలని ఈ నిర్వచనాల ద్వారా స్పష్టంగా చెప్పారు. మానవజీవితానికి ఆధారమైన ఈ ధర్మానికి వేదమే మూలమని ప్రకటించారు. "శ్రూయతే ధర్మాధిక మనయేతి శ్రుతిః"[24] ధర్మములను వినిపించునది గనుక వేదం శ్రుతి అని పేరుపొందినదని అర్థాన్ని చెప్పారు.

ఇక వేదం వరకు వెడితే ఋగ్వేదంలో ధర్మశబ్దం మతం, న్యాయం, దైవం, యజ్ఞయాగాది క్రతువులు చేయటం, సత్యం, అహింస అనే అర్థాలతోనేకాక లౌకికమైన నడవడికన్నా అతీతమైనది అనే అర్థంతో కూడా కన్పిస్తున్నది. ఇట్టి ఈ ధర్మానికి ఆధారం విష్ణువని[25] ఋగ్వేదం వివరించింది. ఇంకా సృష్టిని ఒక క్రమంలో నడిపించేది ఋతమని, దానికి విరుద్ధమైనది అనృతమని, అనృతము నాశనహేతువని ఋగ్వేదం వర్ణించింది. అనగా ఋతమునకు మరొకపేరే ధర్మం. ఆ ఋతమునకు లేదా ధర్మమునకు లోబడిన కార్యకలాపాలనే కర్మ అని వ్యవహరించారు. ఋతమును లేక ధర్మాన్ని అనుసరించటం సృష్టి కర్తవ్యం అని ఋగ్వేదం స్పష్టంగా చెప్పింది.

ఋగ్వేదం తరువాత అధర్వణ వేదంలో ధర్మాన్ని గురించి వివరమైన చర్చవుంది. ధర్మాన్ని అనుసరించటం మానవాళికి క్షేమమనే విషయమే ఇక్కడ కూడా నిరూపితమైనది. ధర్మం అంటే మానవుని లౌకిక, నైతిక, ఆధ్యాత్మికమైన సత్ప్రవర్తన అని వేదాలు వివరించాయి. బ్రాహ్మణాలు ఉపనిషత్తులు కూడా ఇదే అభిప్రాయాన్ని నిర్ధారించాయి. మొత్తంమీద ధర్మం అనేది ఒక క్రమపద్ధతిలో మానవుని పట్టివుంచి సక్రమమార్గాన నడిపించేది, పురోగతికి దారిచూపేది అని వేదాలు, ఉపనిషత్తులు, బ్రాహ్మణాలు ముక్తకంఠంతో చాటుతున్నాయి.

అటుపైన వేదాంత, మీమాంసాది శాస్త్రకారులు, మనువు మొదలైన స్మృతికర్తలు వారి వారి సిద్ధాంతాలను అనుసరించి ధర్మం అనే మాటకు వివరణలు ఇచ్చారు. ఈ శాస్త్రకారులు, తత్త్వవేత్తలు, స్మృతికర్తలు ధర్మాన్ని గురించి చెప్పిన అంశాల సారాంశం ఇలావుంది -

---

★ 24. అమరకోశము - పు. 124.

★ 25. శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత - విష్ణుసూక్తం - 18-22.

'ధర్మము మానవుని అభ్యుదయము వైపు నడుపునది'

'ధర్మము దైవముతో ప్రత్యక్ష సంబంధము గలది'

'ధర్మము మానవుని మనుగడకు మూలాధారము'

'ధర్మము మానవునిలో విశ్వప్రేమను వర్ధిల్లజేయును'

'ధర్మము మానవజాతికి సర్వస్యశరణాగతి'

'ధర్మము మానవుని భగవంతునితోను ప్రకృతితోను కలుపునది'

'ధర్మము సమస్త ప్రాణికోటికి సర్వస్వమైనది.[26]

తొలి స్మృతికారుడు మనువు, "ఆచారః పరమోధర్మః" అని నిర్వచించి ఈ ఆచారాలు వర్ణధర్మాలుగా, జాతిధర్మాలుగా శ్రుతులలో ఉన్నవేనని సప్రమాణంగా వివరించారు.[27] ఈ వివరణ కూడా మానవుల ప్రవర్తన గురించినటువంటిదే. పరాశర స్మృతి "కృతయుగమున తపస్సేధర్మము, త్రేతాయుగమున జ్ఞానమే ధర్మము, ద్వాపరయుగమున యజ్ఞమే ధర్మము, కలియుగమున దానమే ధర్మము, అదియుమగాక నాలుగు వర్ణములకును ఆచారమే ధర్మము[28] అని మనువు నిర్వచనాన్ని సమర్థించింది.

ధర్మం సుస్థిరమైనది, శాశ్వతమైనది అని వీరందరు ఎలుగెత్తిచాటారు. ధర్మాన్ని ఎవరూ నాశనం చేయలేరని, అనృతవర్తనులు ధర్మానికి కేవలం గ్లాని అంటే బాధనుమాత్రమే కలిగించగలరని చెప్పారు. భగవద్గీతలో కృష్ణుడు కూడా

"యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారతః
అభ్యుత్థాన మధర్మస్య తదా2త్మానం సృజామ్యహం" (4-7)

అని ధర్మానికి గ్లాని కలిగినప్పుడే తనను తాను సృజించుకుంటానని చెప్పాడే తప్ప ధర్మాన్ని సృష్టిస్తానని చెప్పలేదు.

ఇంతటి ప్రధానమైన ధర్మం సృష్టిలో సమస్త ప్రాణికోటికి మూలాధారమైనప్పుడు ధర్మానుసరణ కేవలం మానవునికే ఎందుకు విధింపబడింది? ఇతర ప్రాణులకు ధర్మానుసరణ అవసరంలేదా? అనే ప్రశ్నలు తలెత్తుతాయి. 'మానవుడు బుద్ధిజీవి కావటమే కారణం' అని ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పవలసివుంది.

---

★ 26. "What is Dharma" Kalyanakalpataru. K. Thakur Page 68

★ 27. మనుస్మృతి 1-34

★ 28. మహాభారత విజ్ఞాన సర్వస్వము ఎమ్. చంద్రశేఖరశర్మ-పుట. 64

సృష్టిలోని ఇతర ప్రాణులన్నీ ప్రకృతి ధర్మానికి లేదా నియతికి లోబడి జీవిస్తాయి. మానవుడు తప్ప ఇతర సృష్టిసమస్తం పుట్టినప్పటి నుంచి లేదా ప్రకృతిలో భాగమైన క్షణం నుంచి ప్రకృతి నియమాలను అనుసరించి, అంతఃప్రేరణలతోను (instincts), మాత్రమే వృద్ధిపొందుతుంది, నాశనమౌతుంది. మానవ జీవితం ఇందుకు భిన్నమైనది. మానవుడు జనన మరణాలకు సంబంధించినంత వరకూ ప్రకృతి నియమానికి, సృష్టిక్రమానికి లోబడినప్పటికీ బుద్ధిజీవి అయినందువలన తన తెలివితేటలతోను, శక్తిసామర్థ్యాలతోను ప్రకృతిని జయించాలని ఆశిస్తాడు. సృష్టి రహస్యాలను తన ఆధీనంలోకి తెచ్చుకోవాలని నిరంతరం ప్రయత్నిస్తుంటాడు. మనిషి బుద్ధిని ప్రలోభపెట్టేవి, ఆకర్షించేవి సత్త్వరజస్తమోగుణాలు, అరిషడ్వర్గాలు. ఇవన్నీ కలిసి మనిషిలో ఆలోచనలను ప్రేరేపిస్తాయి. ఈ ఆలోచనలే వ్యక్తిని ధర్మమార్గానికో అందుకు వ్యతిరేకమార్గానికో నడిపిస్తాయి.

జన్మ, విద్య, సంస్కారం, పరిసరాల ప్రభావం మొదలైనవి మనిషిలో ఆలోచనామార్గాన్ని రూపొందిస్తాయి. అతనిలో గుణాల ప్రభావాన్ని సూచిస్తాయి. ఆయా గుణాల ప్రభావం, ఆధిక్యతలను బట్టి వ్యక్తుల ప్రవర్తనలో మార్పులు ఏర్పడతాయి. రజస్తమోగుణాల ప్రభావం ప్రధానంగా కనిపించే వ్యక్తులమీద అరిషడ్వర్గాల ప్రభావంకూడా ఎక్కువగానే వుంటుంది. ఈ కారణాల మూలంగానే ఒక వ్యక్తి ప్రవర్తన మూలంగా లోకకల్యాణం, లోకవినాశనం కూడా సంభవించే అవకాశం ఏర్పడుతుంది. కనుకనే మనిషి ప్రవర్తన ఒక నియతికి లోబడి వుండాలని, వ్యక్తి నడవడి లోకకల్యాణానికే తోడ్పడాలని వేదం శాసించింది. అట్టి నియతిబద్ధమైన నడవడినే 'ధర్మం' అని వివరించింది ప్రతి మనిషికి ధర్మాన్ని అనుసరించి జీవనం సాగించటం అనుల్లంఘనీయమని నిర్దేశించింది. వ్యక్తుల ధర్మానుసరణ సమాజ పురోగమనానికి శ్రేయస్సుకు మూలమని శ్రుతి స్మృతి శాస్త్రాలన్నీ నిర్ద్వంద్వంగా ప్రకటించాయి.

మహాభారతంలో ధర్మం విష్ణుస్వరూపమని వివరించే ఉపాఖ్యానం వుంది. అందులో శ్రీ మహావిష్ణువు యజ్ఞయాగాది క్రతుకర్మరూపమైన ప్రవృత్తి ధర్మాన్ని బ్రహ్మాది దేవతలకు యిచ్చి, నిశ్చలము, అవ్యయము, శాశ్వతము, బ్రహ్మానంద సదృశము అయిన నివృత్తి ధర్మం తానే అయినిలచాడని[29] వివరంగా వర్ణితమైనది. భగవద్గీతలో శ్రీకృష్ణుడు కూడా 'శాశ్వతమైన ధర్మమునకు స్థానమును నేనే[30] అని అర్జునునికి ధర్మస్వరూపాన్ని గురించి వివరించాడు. అందువలననే ధర్మమనేది భగవంతునితో సమానమైనదని, ధర్మాన్ని భక్తిశ్రద్ధలతో అనుష్ఠించవలసివుందని ప్రాచీనులు నిర్దేశించారు.

---

★ 29. ఆం.మ.భార. శాంతి 6-413.

★ 30. భగ - 14-27

## సిద్ధ, సాధ్య, సాధన, ధర్మ స్వరూపం

ప్రాచీనులు ధర్మాన్ని భగవత్స్వరూపంగా మానవ జీవితానికి మూలాధారంగా వర్ణించారని గ్రహించాం. ఇక ధర్మాచరణ ఏ స్థాయిలో ఏ విధంగా నిర్వహించవలసివున్నది అనే అంశాన్ని గురించి తెలుసుకోవలసివున్నది. ఎందుకంటే ధర్మం భగవంతుడైతే దాన్ని ఆచరించేవారిని ఏమని వివరించాలి అనే సందేహం తప్పకుండా వస్తుంది.

సాధారణంగా ఏ కార్యం తలపెట్టినా దానికి తగిన సాధన ఉండాలి. అప్పుడే ఆకార్యం సాధ్యమై సిద్ధమైన ఫలాన్ని పొందేందుకు అవకాశం కలుగుతుంది. ధర్మాచరణలోను ఇదే క్రమం వర్తిస్తుంది. భగవత్స్వరూపమైన ధర్మమే 'సిద్ధ ధర్మం'. భగవంతుని చేరటమే ధర్మాచరణకు లక్ష్యం. ఇందుకు సాధనచేసేవారే సాధన ధర్మ వర్తనులు. వారి ధర్మబద్ధమైన జీవన విధానమే 'సాధనధర్మం'. వీరిరువురకు మధ్య మరొక వర్గం వారుంటారు. వారు ధర్మస్వరూపాన్ని సంపూర్ణంగా గ్రహించి సాధనధర్మమార్గాన్ని అనుసరించేవారికి ధర్మప్రబోధం చేస్తుంటారు. వీరినే ధర్మతత్త్వజ్ఞులని, స్థితప్రజ్ఞులని పేర్కొంటారు. ధర్మస్వరూపాన్ని సాధ్యము చేసుకున్నవారు గనుక వీరిని సాధ్యధర్మవర్తనులని వ్యవహరిద్దాం.

మహాభారతంలో సిద్ధ, సాధ్య, సాధన ధర్మాచరణస్వరూపానికి పరిపూర్ణమైన ఉదాహరణలుగా నిలిచేవారు అనేకమంది ఉన్నారు. వారి వారి ధర్మానుసరణను, ధర్మ విచక్షణను పరిశీలించినప్పుడు వారి వ్యక్తిత్వాలు ధర్మప్రబోధానికి ఏ విధంగా నిదర్శనాలుగా నిలుస్తాయన్న విషయం బోధపడుతుంది.

మూర్తీభవించిన ధర్మమే సిద్ధధర్మం. "రామోవిగ్రహవాన్ ధర్మః" అని వాల్మీకి అవతార పురుషుడు మూర్తీభవించిన ధర్మమే అని వర్ణించాడు. ఏ వ్యక్తి నిర్మోహుడు, నిస్సంగుడు అయి, ఫలితాన్ని గురించి వ్యాకులపడకుండా తన కర్మలకు లోకశ్రేయస్సునే ప్రయోజనంగా భావిస్తాడో అతడే సిద్ధధర్మస్వరూపుడు. అతడి కర్తవ్యం ధర్మ సంరక్షణం ఒక్కటే. తనకు వ్యక్తిగతమైన ఫలితాన్ని, ప్రయోజనాన్ని కోరకుండా కాలానుగుణంగా వర్తిస్తూ సర్వధర్మాలను ఆచరిస్తూ ఇతరులకు మార్గదర్శకుడై ఉండేవాడు సిద్ధధర్మస్వరూపుడు. "అర్జునా! ముల్లోకములలో నాకెట్టి కర్తవ్యమును లేదు. నేను పొందనిదిగాని పొందవలసినదిగాని లేదు. అయినప్పటికీ లోకమునకు ఒక ఆదర్శమును నెలకొల్పేందుకే నేను సర్వదా కర్మను చేయుచున్నాను."[31] అని ధర్మరక్షణ అనే కర్తవ్యం తప్ప తనకు ఎటువంటి వాంఛలేదని కనుకనే ఫలితాలు తనను అంటవని శ్రీకృష్ణుడు చెప్పాడు. భారతంలో కృష్ణుని 'విష్ణువ'ని 'కల్యాణాత్ముడ'ని అనేకచోట్ల భీష్మ విదురాదులు స్తుతిస్తారు. అంతేకాక "సర్వము తనయందు సర్వమునందు తానుండునట్టి సర్వాత్మకుడ"ని

★ 31. భగ 3-22.

కూడా కృష్ణుని నుతించారు. భారతగాథకు సంబంధించి సిద్ధధర్మ స్వరూపుడు శ్రీకృష్ణుడు. ఇతడిని దైవంగా, ధర్మావతారుడుగా భావించి అనేకమంది అనేక విధాలుగా స్తుతించారు.

"సిద్ధ్యసిద్ధ్యోస్సమోభూత్వా సమత్వం యోగఉచ్యతే"[32] అని సిద్ధి, అసిద్ధులు రెంటియందు సమబుద్ధిని వహించేవారు యోగులని భగవద్గీత వివరించింది. ధర్మదృష్టి తప్ప మరేవిధమైన రాగద్వేషాలు లేని మహాయోగులు, మహర్షులు సాధ్యధర్మవర్తనులు. ధర్మ స్వరూపాన్ని గుర్తించి ద్వంద్వాతీతులై కఠోరమైన నియమాలతో ధర్మాచరణ ద్వారా మోక్షాన్ని పొందేవారు సాధ్యధర్మపరాయణులు. వీరు నిర్మోహులై, క్లిష్టపరిస్థితులలో ఆశ్రితులకు ధర్మప్రబోధం చేస్తుంటారు. వీరి ధ్యేయం లోకకల్యాణం. ధర్మానుసరణ, ధర్మప్రబోధాలే వీరి స్వభావం, ఇటువంటివారు సిద్ధధర్మస్వరూపునికి సన్నిహితులు, ప్రీతిపాత్రులు అయివుంటారు. వీరిని ధర్మతత్త్వజ్ఞులని కూడా వ్యవహరిస్తారు.

మూడవదైన సాధనధర్మమార్గం జనులందరికి ఆచరణీయమైనది. సత్త్వగుణంతో కూడిన సత్ప్రవర్తన ద్వారా సాధన ధర్మాన్ని అనుష్ఠించాలి. వారి వారి జన్మాదిస్థితిగతులను బట్టి దేశ కాలధర్మాలను అనుసరిస్తూ ఇహపర సాధనకై చేసే ప్రయత్నమే సాధనధర్మం. మనోవాక్కాయ సంబంధమైన సాత్త్వికలక్షణాలను భగవద్గీత ఇలా వివరించింది.

"శుచిత్వము, ఋజువర్తన, బ్రహ్మచర్యము, అహింసావృత్తి, శారీరకమైన తపస్సు; మృదువై అనుద్వేగకరమైన వాక్కు, సత్యవాక్పాలన, స్వాధ్యాయము వాక్సంబంధమైన తపస్సు; నిర్మలచిత్తం, సౌమ్యత్వం, వాఙ్నియమం, ఆత్మనిగ్రహం, అంతఃకరణ శుద్ధి మనస్సంబంధమైన తపస్సు.[33]

ఫలాకాంక్షరహితులై ఏకాగ్రచిత్తంతో ఈ మూడు రకములైన తపస్సులను అనుష్ఠించే వారు సత్త్వగుణసంపన్నులైన సాధన ధర్మ మార్గానుసారులు. సాధన ధర్మాన్ని అనుసరించటం వలన చిత్తం ఏకాగ్రతను పొందుతుంది. అప్పుడు సాధకులు సాధ్యధర్మస్థితికి చేరుకోగలుగుతారు. సాధ్యధర్మస్థితివలన యోగిత్వం సిద్ధిస్తుంది. తద్ద్వారా సిద్ధధర్మ స్వరూపుడైన పరమాత్మను దర్శించగలుగుతారు. కొన్ని సందర్భాలలో సాధనధర్మస్థాయిలో ఉన్నప్పటికీ నిశ్చలభక్తి ద్వారా సిద్ధ ధర్మ స్వరూపుడైన భగవంతుని సన్నిధికి చేరుకుంటారు. ఈ విధంగా భగవత్సాన్నిధ్యాన్ని పొందిన సాధకుడు ఆంజనేయుడు.

కనుకనే మానవులు మొదట సాధనధర్మాన్ని ఏకాగ్రతతో అనుష్ఠించాలని శ్రుతి స్మృతిపురాణేతిహాసాలు బోధిస్తున్నాయి.

**మహాభారతం** ధర్మం ద్వారానే ఇతర పురుషార్థాలు సమకూరగలవని స్పష్టంగా చెప్పింది.

★ 32. భగ 2-48
★ 33. భగ 17-14,15,16,17

## సామాన్య, విశేషధర్మాలు

ఇంతటి ప్రాముఖ్యంగల ధర్మం దేశ, కాల, పరిస్థితులను బట్టి రెండు రూపాలలో ఆచరణీయమైనది. ఆ రూపాలు సామాన్యధర్మం, విశేష ధర్మం. ఇవి సాధనధర్మానికి సంబంధించిన అంశాలు.

నాలుగు యుగాలలోను, సర్వకాల సర్వావస్థలలోను జనులందరికీ ఆచరణీయములైనవి, మానవుల మనుగడకు, సమాజశ్రేయస్సుకు ఆధార భూతములైనవి, ఎటువంటి మార్పులేక స్థిరంగా ఉండేవి సామాన్యధర్మాలు. వీనినే శాశ్వత ధర్మాలని కూడా వ్యవహరించారు. మహాభారతం శాశ్వతధర్మాలను వివరంగా వర్ణించింది. సత్యము, శౌచము, దానము, తపము, శమము, శాంతి, కీర్తి, పరిజ్ఞానయుక్తి, అహింస ఇవన్నీ శాశ్వత ధర్మాలని, ఇవే ధర్మదేవత లక్షణాలని పేర్కొన్నది. లౌకిక జీవితంలో ఎంతటి కష్టం వచ్చినా ఏ యుగంలోనైనా ఏ వ్యక్తి అయినా వీనిని ఉల్లంఘించరాదు. దృఢచిత్తంతో కష్టాలను భరిస్తూ కూడా శాశ్వత ధర్మాన్ని అనుసరించేవారిని ఉత్తమపురుషులని పురాణేతిహాసాలు చాటిచెప్పాయి. ఇక విశేష ధర్మాలు జన్మ, జాతి వయో భేదాలను బట్టి, స్త్రీ పురుష విచక్షణను బట్టి, వర్ణాశ్రమ భేదాలను బట్టి, దేశకాల పరిస్థితులను బట్టి, జన్మసంబంధమైన, సాంఘికమైన సంబంధ బాంధవ్యాలను బట్టి అనుసరించవలసినవి. దేశకాలపరిస్థితులను బట్టి కొన్నిసార్లు విశేషధర్మాలలో భేదంగాని మార్పులుగాని సంభవిస్తుంటాయి. కాలక్రమంలో కొన్ని విశేషధర్మాలు పూర్తిగా మారిపోవచ్చు లేదా నశించిపోవచ్చు. వీనినే ఆచారాలు అని పేర్కొన్నారు. ధర్మశాస్త్రవేత్తలు శాశ్వత విశేషధర్మాలను విపులంగా చర్చించారు. శాశ్వత ధర్మాలు వ్యక్తిలో సంస్కారాన్ని పెంచి ఉత్తమస్థితికి తీసుకుని వెళ్ళేవి అని, విశేషధర్మాలు సమాజనియతిని, కట్టుబాట్లను ఏర్పరచి సుస్థిరమైన సాంఘిక జీవనానికి తోడ్పడేవి అని ధర్మశాస్త్రగ్రంథాల వివరణల వలన స్పష్టమవుతున్నది.

## ధర్మ స్వరూపం

కృత, త్రేత, ద్వాపర కలియుగాలలో ధర్మం గోవు రూపంలో సంచరిస్తుంటుందని, ఆయా యుగాలలో సత్త్వరజస్తమో గుణాల ప్రాబల్యం వల్ల ధర్మధేనువు ఒక్కొక్క పాదాన్ని కోల్పోతుందని పురాణగాథ తెల్పుతున్నది. మానవుల ఆలోచనలలో, నడవడిలో కలిగే మార్పులను గుర్తించి ధర్మశాస్త్రవేత్తలు కాలానుగుణంగా ఆచరించవలసిన ధర్మాన్ని, ధర్మసూక్ష్మాన్ని ప్రత్యక్షంగాను పరోక్షంగాను ప్రస్తావించారు. వేదవాఙ్మయం ఆధారంగా ధర్మశాస్త్రవేత్తలు నిరూపించిన ధర్మస్వరూపం-- ధర్మతత్త్వం - అవ్యయము, శాశ్వతము నిర్ద్వంద్వము అయినది. ఇదే సిద్ధ ధర్మం.

ధర్మసూక్ష్మం - ధర్మతత్త్వాన్ని గ్రహించి తెలియదగినది సాధ్యధర్మవర్తనులు గుర్తించినది.

ధర్మం - మానవులందరు ఆచరించవలసిన సామాన్య విశేష ధర్మాలు - సాధన ధర్మం.

ధర్మతత్త్వం అత్యున్నతమైనది. సామాన్యులకు అగోచరమైనది. ధర్మం జనులందరు అనుసరించి ఆచరించవలసినది. ఈ రెండింటికీ మధ్యనగల ధర్మసూక్ష్మాన్ని ఏ విధంగా గ్రహించాలి. ధర్మసూక్ష్మం ప్రయోజనం ఏమిటి అని స్మృతికారులు చర్చలు చేశారు.

కొన్ని సందర్భాలలో మానవ జీవితంలో ధర్మనిర్ణయ విషయంలో సంకటపరిస్థితి సంభవిస్తుంది. సామాన్య విశేషధర్మాల మధ్యగాని ధర్మానుసరణంలో పక్షాంతరం వల్లగాని ఏ ధర్మం ఆచరణీయమనే సందిగ్ధత ఏర్పడుతుంది. సీతాపరిత్యాగం, జూదంలో భార్యను పణంగాపెట్టటం, హరిశ్చంద్రుడు భార్యాబిడ్డలను విక్రయించటం, యజ్ఞయాగాదులలో పశుహింస వంటివే కాక సత్యవాక్పాలన వంటి అంశాలలో కూడా ధర్మాధర్మ చర్చలు తలెత్తాయి. ఇటువంటి సందర్భాలలో ధర్మసూక్ష్మాన్ని ఏ విధంగా గుర్తించగలరు?

ధర్మనిర్ణయ విషయంలో శ్రుతి, స్మృతి, సదాచారం, ఆత్మకు ప్రియం కలిగించేది అనే నాలుగు మార్గాలను ధర్మశాస్త్రవేత్తలు నిర్దేశించారు. వీనిలో ఉత్తరోత్తరం బలీయం అన్నారు. ధర్మనిర్ణయంలో సందేహం కలిగితే ముందుగా ఈ విషయంలో వేదం ఏమిచెప్పింది అని చూడాలి. వేదంలో వివరణ లేకున్నా, సందిగ్ధంగా వున్నా స్మృతి చెప్పిన అంశాన్ని పరిశీలించాలి. అప్పటికీ స్పష్టంగా లేకుంటే లోకంలో సత్పురుషులవర్తనను లేక లోకాచారాన్ని బట్టి ధర్మనిర్ణయం చేయాలి. అదికూడా వీలుకాకుంటే ఆత్మకు ప్రియం కలిగించే విధంగా ప్రవర్తించమని వివరించారు. కాని ఆత్మకు ప్రియం కలిగించే విధం అనగానే ఎవరికి నచ్చిన మార్గం వారు అనుసరించవచ్చునని భావిస్తే అది పొరబాటని అన్నారు. నిష్పాక్షికంగా వ్యవహరించే ఆత్మజ్ఞానులను గుర్తించి వారి నిర్ణయాన్ని ధర్మంగా స్వీకరించాలని నిర్ధారించారు. ఆత్మజ్ఞానులను మహాభారతం

కం॥ **శ్రుతియుఁ బరిత్యాగము గల**

**మతిమంతుల నడుగు లోభమదమోహ సమా**

**వృత బుద్ధులుగాని సుమం**

**చిత చరితులవలనఁ దెలియు శీలనిరూఢా**[34]

అని వివరించి అట్టి వారివలన ధర్మసూక్ష్మాన్ని గ్రహించాలని చెప్పింది.

---

★ 34. ఆం. మ. భార - అను 5-412

ధర్మతత్త్వం: ధర్మసూక్ష్మాల తరువాత ధర్మాన్ని గురించి మరికొంత వివరంగా పరిశీలించ వలసివుంది. ఆచరణ స్థాయిలో ధర్మస్వరూపమే సాధన ధర్మం. సామాన్య విశేష ధర్మాలు సాధనధర్మ శాఖలు తిరిగి విశేషధర్మం మూడు విధాలుగా ఆచరణీయమైనది అవి వ్యక్తిధర్మం, సామాజిక ధర్మం, ఆధ్యాత్మిక ధర్మం.

వర్ణాశ్రమ ధర్మాలు, జాతిధర్మాలుగా మనిషి అనుసరించవలసిన మార్గం వ్యక్తి ధర్మం సంఘజీవి అయిన మనిషికి స్వజనులతోను కుటుంబంతోను వివిధవర్గ జనులతోను గల సంబంధబాంధవ్యాలను బట్టి నిర్వర్తించవలసిన విధులు సామాజికధర్మం. మూడవదైన ఆధ్యాత్మిక ధర్మం జీవాత్మ పరమాత్మల సంయోగానికి సంబంధించినది. మాయామోహితమైన జీవాత్మ మాయనుంచి విడివడి పరమాత్మను చేరేందుకు తోడ్పడే నియతి, మార్గం ఏదైతే వుందో అది అధ్యాత్మ ధర్మం. ఈ మూడు ధర్మమార్గాలు మానవులందరు అనుసరించవలసినవని ధర్మశాస్త్రకారులు ప్రబోధించారు.

మానవ జీవితంలో అతి ముఖ్యమైనదైన ఈ ధర్మం ఆంధ్రమహాభారతంలో నిరూపితమైన విధం, భారతంలో ప్రధానపాత్రల ధర్మానుసరణ, ధర్మనిర్ణయపరంగా సంఘర్షణ ఏర్పడిన సందర్భాలలో వారు అనుసరించిన ధర్మసూక్ష్మాలు ఎలాంటివని పరిశీలించి, ఆంధ్రమహాభారతం ప్రబోధించిన ధర్మతత్త్వాన్ని గురించి ముందుముందు ప్రకరణాలలో చర్చించుకుందాం.



# 4. సిద్ధధర్మ స్వరూపుడు - శ్రీకృష్ణుడు

సుమారుగా ఐదువేల సంవత్సరాలకు పూర్వం ఆర్య నాగరిక సమాజ ధర్మానికి గ్లానికలిగింది. ప్రకృతి స్వరూపిణి అయిన స్త్రీకి ఘోరమైన అవమానం సభామధ్యంలో జరిగింది. దాయ భాగ నిర్ణయంలో కుతంత్రాలు, ధర్మ వ్యతిరేకమార్గాలు చెలరేగాయి. అంధత్వం కారణంగా రాజ్యార్హత పోగొట్టుకున్నా, తమ్ముని ప్రతినిధిగా సింహాసనం అధిష్ఠించాడు ధృతరాష్ట్రుడు. అతని పుత్రులైన కౌరవులకు, రాజ్యాభిషిక్తుడైనా శాపకారణంగా భోగాలను విడచి వనజీవనం సాగించిన పాండురాజు పుత్రులు పాండవులకు మధ్య వారసత్వ కలహం రేగింది. రాజ్యప్రలోభం వలన కౌరవులు సామాజిక ధర్మానికి, కుటుంబధర్మానికి, వారసత్వపు హక్కుకు విఘాతం కల్పించారు. వారసత్వపు హక్కుగల పాండవులను, కపటమార్గాన్ననుసరించి రాజ్యభ్రష్టులను చేసి నిరాధారులుగా అడవులకు పంపారు. అప్పుడు ఈ ధర్మవ్యతిరేక కార్యాలను అరికట్టవలసిన అవసరం ఏర్పడింది.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయచదుష్కృతాం**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే** [35]

అని తన కర్తవ్యాన్ని వ్యక్తం చేసిన అవతారపురుషుడు భూమి మీదకు రావలసివచ్చింది. మహాభారతేతిహాసంలో ధర్మసంస్థాపన కార్యానికి సారధ్యం వహించి అధర్మాన్ని, దుష్ప్రవర్తకులను అణచిన వ్యక్తి శ్రీకృష్ణుడు. సమస్త ధర్మములను తెలిసి, తాను నిర్వర్తించే కర్మలపట్లగాని ఫలితాలయందుగాని ఆసక్తిలేక కేవలం ధర్మరక్షణయే తన లక్ష్యంగా వర్తించిన వాడైనందువలనే శ్రీకృష్ణుడు అవతారమూర్తిగా, ధర్మస్వరూపుడుగా భారతంలో ఆమూలాగ్రం నుతింపబడ్డాడు.

**"యుధిష్ఠిరో ధర్మమయో మహాద్రుమః**
**స్కంధోఽర్జునో భీమసేనోఽస్యశాఖాః**
**మాద్రీసుతౌ పుష్పఫలే సమృద్ధౌ**
**మూలం కృష్ణో బ్రహ్మబ్రహ్మణాశ్చ** [36]

---

★ 35 భగ - 4-8

★ 36. సం. మ. భార ఆది 1-115

యుధిష్ఠిర ధర్మద్రుమానికి మూలం కృష్ణుడని వ్యాసుడు వర్ణించగా, తిక్కన

ఆ. "ధర్మసుతుండు ధర్మతరువర్జునుండుఘన
స్కంధమనిలసుతుఁడు శాఖ కవలు
పుష్పఫలము లేను భూసురులునువేద
ములుఁదదీయమైన మూలచయము" [37]

అని యథాతథంగా వ్యాసాభిప్రాయాన్ని శ్రీకృష్ణునినోట పలికించాడు.

మానవ జీవితంలో అంతర్లీనమై, జీవనాధారమైన ధర్మం అనే వృక్షానికి భౌతికరూపం పాండవులని వ్యాసుడు వివరించాడు. మూలం బలంగాను స్థిరంగాను వున్నప్పుడే వృక్షం ఫల, పుష్ప భరితమై ఉంటుంది. యుధిష్ఠిరుడనే ధర్మద్రుమం సుస్థిరమైవర్ధిల్లి, రాజ్యస్థాపన చేసేందుకు మూలం శ్రీకృష్ణుడని భారతంలో చెప్పటంద్వారా ధర్మానికి మూలస్వరూపమైన శ్రీకృష్ణుడు భగవంతుడని వ్యాసుడు స్పష్టంచేశాడు. భగవత్స్వరూపునితో పాటుగా అతనిని ఎఱిగిన వేదచయము, ద్రష్టలైన బ్రాహ్మణులుకూడా ధర్మద్రుమానికి మూలములని భారతం వర్ణించింది. భగవద్గీతలో కృష్ణుడు సర్వవేదములు, వేదవేత్తకూడా తానేనని వివరించాడు. ధర్మమూలం, ధర్మరూపం కూడా శ్రీకృష్ణుడేనని భారతం, భగవద్గీతలు స్పష్టంగా ప్రకటించాయి. మూర్తీభవించిన ధర్మమే సిద్ధ ధర్మము. సిద్ధధర్మ స్వరూపుడైన అవతారపురుషునికి ధర్మసంస్థాపనమే కర్తవ్యం. మహాభారతంలో శ్రీకృష్ణుడు కర్తవ్యపాలన తప్ప మరేవిధమైన ఆశ, ఆకాంక్షలేనివాడై సమస్త భారాన్ని నిర్వహించాడు. జన్మించినది మొదలు ధర్మనిర్వహణ ఒక్కటే తనధ్యేయంగా వర్తించానని తానే స్వయంగా వివరించాడు. 'కంసుడు తండ్రిని ధిక్కరించి ధర్మాన్ని ధ్వంసం చేయగా వైద్యుడు దుర్మాంసమునుగోసి మిగిలిన శరీర భాగాన్ని రక్షించినట్లుగా అతడిని చంపి, అతని తండ్రిని వంశపురుషునిగా చేసితిని అదే విధంగా మీరు చేసిన మీకును అట్లే చేయుట తగినది కదా' అని కౌరవులనుద్దేశించి సభామధ్యంలో పలికి కృష్ణుడు తనలక్ష్యం ధర్మరక్షణమే అని ప్రకటించాడు.

మానవసమాజ నియతి అయిన ధర్మం మనిషి లౌకిక ఆధ్యాత్మిక జీవనాలకు, సమాజ పురోగమనానికి ఆధారంగా నిలుస్తుంది. ఆ నియతిని కాపాడి సమాజాన్ని రక్షించటం సిద్ధధర్మ స్వరూపుని లక్షణం. భారత కృష్ణుడు ఈ లక్షణాన్నే అడుగడుగునా వ్యక్తంచేశాడు. తన లక్ష్యసాధనలో కృష్ణుడు అద్వితీయమైన లోకజ్ఞతను, రాజనీతి చతురతను ప్రదర్శించాడు. కొన్ని సందర్భాలలో అతడి మార్గాన్ని విమర్శించినవారు కూడా అతడు చెప్పిన విషయానికిగాని చూపిన పరిష్కారానికిగాని ధర్మబద్ధమైన ప్రత్యామ్నాయం ఏదీ చూపించలేకపోయారు. శ్రీకృష్ణునికి ధర్మ రక్షణం తప్ప ఇతర

★ 37. ఆం. మ. భార ఉద్యోగ 1 - 356

వాంఛలుగాని, కర్మఫలములో ఆసక్తిగాని లేకపోవటమే, అతని నిర్మోహత్వమే, ధర్మదృష్టియే అతడిని సిద్ధధర్మ స్వరూపుడని చెప్పేందుకు నిదర్శనాలు.

'ఎక్కడ సత్యము ముందునడమనో, ఎక్కడ ధర్మంవుందో అక్కడ కృష్ణుడు ఉంటాడని' సంజయుడు కృష్ణుని గురించి ధృతరాష్ట్రునితో చెప్తాడు. 'ఏనుధర్మంబును నీతియును మున్నిడుకుని మనోవ్యాకృకారంబులేక రూపంబైన సత్యంబకాజెప్పితి' అని కృష్ణుడే స్వయంగా తన స్వభావం ఎటువంటిదో వివరించాడు.

పాండవులపట్ల కృష్ణునికిగల అభిమానం వారి ధర్మవర్తనయందుగల అభిమానమేకాని బంధుప్రీతికాదు. అదేవిధంగా కౌరవులయందు అతడికి వ్యక్తిగతమైన ద్వేషంలేదు. వారిక్షేమం కోరినవాడు కావటంవల్లనే ద్రుపదపురోహిత, సంజయుల రాయబారాల తరువాత కూడా ధర్మరాజు కోరిక మేరకు తాను సంధికి ప్రయత్నించాడు. సంధి పొసగదని తెలిసినా చివరి వరకూ ప్రయత్నలోపం జరుగరాదనే భావంతో, రాజనీతిని అనుసరించి భేదోపాయంవరకు అన్నిమార్గాలలోను ప్రయత్నించాడు. యుద్ధం తప్పదన్నప్పుడు అర్జున దుర్యోధనులిద్దరి కోరికలను మన్నించి ఇద్దరికీ సహాయాన్ని అందించాడు. పాండవుల ప్రతిపక్షంలో నిలిచి పోరాడినప్పటికీ భీష్ముని ధర్మవర్తనపట్ల అత్యంతాదరం చూపించాడు. దేవతలకైనా ఉపదేశింపగలవాడవు, ప్రవృత్తినివృత్తి ధర్మాలలో నీకు తెలియనిదివుందా అని భీష్ముని ధర్మనిరతిని, ధర్మగ్రహణ పారీణతను ప్రశంసించాడు. యుద్ధానంతరం ధర్మరాజుకు ధర్మబోధకై భీష్మునే నియమించాడు. శ్రీకృష్ణుని ధర్మపక్షపాతానికి ఇంతకుమించిన ఋజువు ఇంకెక్కడవుంటుంది! మహాభారతంలో వ్యాసాది మహర్షులు, భీష్మవిదురాది జ్ఞానులు శ్రీకృష్ణుని మూర్తీభవించిన ధర్మావతారుడని భగవత్స్వరూపుడని కీర్తించారు.

ధృతరాష్ట్రుని వరకు కౌరవవంశం ధర్మబద్ధులైన ప్రభువుల పాలనలో వర్ధిల్లింది. ధృతరాష్ట్రుడు జాత్యంధుడేకాక పుత్రవ్యామోహం వలన ధర్మాంధుడు కూడా అయ్యాడు. తండ్రి బలహీనతను ఆధారంచేసుకుని దుర్యోధనుడు, దాయాదులు, వారి తండ్రి రాజ్యభాగానికి వారసులు అయిన పాండవులను తొలగించి తానే సింహాసనాన్ని అధిష్ఠించాలని వాంఛించాడు. తన వాంఛితార్థం నెరవేర్చుకునేందుకు ధర్మవ్యతిరేక మార్గాన్ని ఎన్నుకున్నాడు. అధర్మవర్తనుడైన ప్రభువుపాలన అరిష్టదాయకమని కురువృద్ధులు, గురువులు, పెద్దలు నిరంతరం హెచ్చరించారు. కాని వారందరు ధర్మబద్ధులైన కారణంచేత ప్రభుధిక్కారం చేయలేకపోయారు. కురువంశ బంధువర్గమైన యాదవ వంశంలో జన్మించిన శ్రీకృష్ణుడు కౌరవుల ధర్మవ్యతిరేక మార్గాలను ప్రతిఘటించి, ధర్మవర్తనుడైన ప్రభువును కురుసింహాసనంమీద అధిష్ఠింపచేయవలసిన అవసరం వచ్చిందని గుర్తించాడు. ధర్మవర్తనుడైన యుధిష్ఠిరుని కురుసామ్రాజ్యానికి ప్రభువును చేసేందుకు పూనుకున్నాడు.

వేదవేదాంగవేత్త, సకల కళాప్రపూర్ణుడు, రాజనీతి చతురుడు, లోకజ్ఞుడు, సకల ధర్మాలను, ధర్మసూక్ష్మాలను తెలిసినవాడు అని నుతులందిన శ్రీకృష్ణుడు తాను సంకల్పించిన ధర్మరక్షణకు నిర్విరామంగా ప్రయత్నించాడు.

ధర్మసంస్థాపన లక్ష్యసాధనలో శ్రీకృష్ణునికి స్వపరభేదం లేదు. లక్ష్యసాధనలో మానవ జీవన ధర్మాన్ని పాటిస్తూ కృష్ణుడు ప్రవర్తించిన విధానం కొన్ని సందర్భాలలో విపరీతంగా కన్పిస్తుంది అయితే దానివెనుక అంతర్లీనంగావున్న ధర్మసూక్ష్మాన్ని గుర్తిస్తే అది శాశ్వత ధర్మరక్షణలో కృష్ణుడు అనుసరించిన ఆపద్ధర్మమేతప్ప అధర్మంగాని ధర్మభంగంకాని కాదని బోధపడుతుంది. కార్యసాధనకై కృష్ణుడు వ్యవహరించిన విధానంలో అతని రాజనీతి చతురత, శాశ్వత ధర్మస్థాపనలో పాటించిన ధర్మసూక్ష్మం, స్థూలంగా పరిశీలించినప్పుడే సిద్ధ ధర్మ స్వరూపుడైన శ్రీకృష్ణుడు భారతంలో ప్రబోధించిన ధర్మ స్వరూపం వ్యక్తమౌతుంది.

మహాభారతంలో ఆదిపర్వంలో ద్రౌపదీ స్వయంవర సందర్భంలో శ్రీకృష్ణుడు మొదటిసారిగా కన్పిస్తారు. స్వయంవర మండపంలో మత్స్యయంత్రాన్ని చూచేందుకై వచ్చిన బ్రాహ్మణ సమూహంలో "అవిరళ భస్మకణంబుల మధ్యమున అగ్నికణంబులవోలె'వున్న పాండవులను కృష్ణుడొక్కడే గుర్తిస్తారు. 'పార్థుండీయువతిని పరిగ్రహించగలడ'ని ఆనందిస్తారు. కౌరవుల లాక్షాగృహదహనంలో పాండవులు దగ్ధంకాకుండా విదురుడు ఆదుకొనివుంటాడని యాదవుల వారులు గ్రహించి ఉండవచ్చును. పాండవులు జీవించి ఉంటారనే కృష్ణుని నమ్మకం. అర్జునుని అల్లుడుగా పొందాలనే కోరికతో ద్రుపదుడు యజ్ఞంచేయగా హోమగుండం నుంచి ద్రౌపది జన్మించిందని ఆమె జన్మవృత్తాంతాన్ని భారతం వివరించింది. ఆమెకు భర్తకాగలిగినవాడు అర్జునుడే కనుక పాండవులు సజీవులై ఉండివుంటారని, అర్జునుడు తప్పక ద్రౌపదిని చేపడుతాడని కృష్ణుని విశ్వాసం. పాండవులను గుర్తించగానే యాదవవీరులెవరినీ స్వయంవరంలో పాల్గొనరాదని ఆదేశిస్తారు.

శకుని మంత్రాంగం సహాయంతో కౌరవులు చేస్తున్న చర్యలవలన పాండవులు రాజభోగాలను పోగొట్టుకుని ప్రాణాలు దక్కించుకుని అజ్ఞాతంగా తిరుగవలసిన స్థితి కలిగింది. ఈ పరిస్థితులలో పాండవులకు ఒక అండ, ఒక ఆధారం అవసరం. కురురాజ్యంతో సమానమైన బలపరాక్రమాలు, పేరుప్రతిష్ఠలుగలది పాంచాలరాజ్యం, పాంచాల ప్రభువైన ద్రుపదునితో బాంధవ్యం కుంతీపుత్రుల భవిష్యత్ప్రణాళికకు ఎంతో అవసరం. స్వయంవర సభామంటపంలో పాండవులను గుర్తించిన కృష్ణుడు వారు లక్ష్యభేదవానికి సంకల్పించివచ్చారని గ్రహించాడు. అర్జునుడు మత్స్యయంత్రాన్ని భేదించిన తరువాత బ్రాహ్మణునికి కన్యను ధారపోసి క్షత్రియులను అవమానించారని ద్రుపదునిమీద యుద్ధం ప్రకటించిన దుర్యోధనాదులను అర్జునుకున్నారు. 'ఐదు శరములతో మత్స్యయంత్రమును

కొట్టినవారికి కన్యనిచ్చెదమని ద్రుపదుడు ప్రకటించాడుగాని కేవలం క్షత్రియులే లక్ష్యభేదన చేయాలనే నియమాన్ని విధించలేదు. ఇతరులకు సాధ్యంకాని పనిని ఈ బ్రాహ్మణుడు సాధించి కన్యను పొందడంలో అధర్మం ఏమిటి? అని యుద్ధానికి సిద్ధపడినవారిని కృష్ణుడు సమాధానపరిచాడు. ద్రౌపది భీమార్జునులవెంట వెళ్ళేందుకు అవకాశం కల్పించాడు. అతడే అర్జునుడని తాను చెప్పటం కన్నా పాంచాల ప్రభువు స్వయంగా తెలుసుకొనటమే మేలని లోకజ్ఞుడైన కృష్ణుడు అప్పటికి మిన్నకున్నాడు. ఆ తరువాతనే మేనత్తను, బావలను వారి నివాసంలో బలరామసహితుడై వెళ్ళి కలుసుకున్నాడు. మహాభారతంలో పాండవులు సాధించిన తొలివిజయ సన్నివేశంలో కృష్ణుని ప్రవేశం జరిగింది. ఈ అంశం కృష్ణుని సామీప్యంవలన పాండవులకు మేలుకలిగి ఒక ప్రయోజనానికి మార్గం ఏర్పడుతుందని సూచిస్తున్నది.

రెండవ పర్యాయం అర్జునుని తీర్థయాత్ర సమయంలో ద్వారకలో కృష్ణుడు దర్శనమిస్తాడు. ఈ సందర్భంలోనే కృష్ణార్జునులు పూర్వ జన్మలో నరనారాయణులనే యోగివరులని, వారిది జన్మాంతర బంధమని వర్ణితమైనది. వారి మధ్యగల గాఢమైన స్నేహబంధం, పరస్పరానురాగం ఇక్కడే బహిర్గతమౌతుంది.

జన్మాంతర బంధంగల కృష్ణార్జునుల బాంధవ్యం సుభద్రాపరిణయంతో మరింత బలపడుతుంది. అర్జునుడు సుభద్రను పరిగ్రహించేందుకు బలరాముని అభ్యంతరానికి గల కారణం చెప్పకనే కృష్ణుడు వారి రహస్యవివాహానికి సహాయం చేస్తాడు. సుభద్రాసహితుడై అర్జునుడు బలరామునికి తెలియకుండా ద్వారకవిడిచివెళ్ళే ఏర్పాట్లు కూడా చేస్తాడు. ద్రౌపదితో వివాహం భావికాలంలో పాండవులకు రాజ్య ప్రాప్తిని కలిగించగా, సుభద్రార్జునుల పరిణయం కురువంశోద్ధరణకు మూలకారణమయినది. అయితే ద్రౌపదీ స్వయంవరానికన్నా ముందే భీమునికి హిడింబతో వివాహం, పుత్రలాభం కలిగాయి కదా అనే సందేహం కలుగవచ్చును. భీముని ఈ పెళ్ళి, ఘటోత్కచుని జననం ఆర్య నాగరికతకు, సంస్కృతికి భిన్నమైనవి, అగ్రజుని వివాహంకన్నా ముందుగా అనుజుని వివాహం జరగటం ఆర్యధర్మవిరుద్ధం, హిడింబాసురుని మరణానంతరం హిడింబ నిరాశ్రయురాలయింది. ఆమె వినయానికి, ఆమె చేసిన సహాయానికి సంతోషించి, కృతజ్ఞతాపూర్వకంగా కుంతీదేవి హిడింబ కోరికను మన్నించమని భీముని కోరింది. తల్లి ఆజ్ఞను పాటించి భీముడు హిడింబను పరిగ్రహిస్తాడు తల్లి ఆదేశించినట్టుగా పుత్రజననం వరకు ఆమెతో ఉండి, పుత్రుడు జన్మించాక హిడింబను వదలి పాంచాలదేశంవైపు ప్రయాణం కొనసాగిస్తున్న సోదరులను, తల్లిని కలుసుకుంటాడు.

ఇలాగే అర్జునుడు కూడా సుభద్రకన్నా ముందు, తీర్థయాత్రాకాలంలో మణిపుర రాజకన్య చిత్రాంగదను, నాగకన్య ఉలూపిని పరిణయమాడాడు. భీమార్జునుల ఈ వివాహాలకు,

కురువంశంలో ఉత్తరోత్తరా సంభవించిన పరిణామాలకు ఎటువంటి సంబంధమూ లేదు. ఆ వివాహాల ప్రభావం ఆయా స్త్రీల పుట్టినిళ్ళదగ్గరే నిలిచిపోయింది

శ్రీకృష్ణ దర్శనం లభించిన తొలి రెండు సందర్భాలలో మొదట పాండవులైదుగురికి తరువాత అర్జునుడికి స్త్రీ లాభం కలిగింది చతురాశ్రమాలలో గృహస్థాశ్రమం అతి ప్రధానమైనది, సర్వోత్కృష్టమైనది, సమాజానికి మూలాధారమైనది. పాండవులకు గృహస్థాశ్రమ ప్రాప్తి శ్రీకృష్ణుని సన్నిధిలోను, అతని సహకార ప్రోత్సాహాలతోను లభించింది. ఈ రెండు ఘట్టాలు కురువంశ చరిత్రలో అత్యంత ప్రధానమైనవి.

సుభద్రార్జునుల వివాహానంతరం ఇంద్రప్రస్థానికి వచ్చిన కృష్ణుడు ఖాండవవన దహనంలో అర్జునునకు తోడ్పడ్డాడు. ఆ సందర్భంలో వరుణుని వలన అర్జునునకు గాండీవం, అస్త్రలాభం; అగ్నిదేవుని వలన శ్రీకృష్ణునికి సుదర్శన చక్రం, గద లభిస్తాయి. అంతేకాక అగ్నివలన దగ్ధమౌతున్న ఖాండవవనం నుంచి కృష్ణార్జునులు దేవశిల్పి మయుని రక్షిస్తారు. కృతజ్ఞతాబద్ధుడైన మయుడు కృష్ణునినియోగంపైన ధర్మరాజుకోసం అపూర్వమైన సభాభవనం నిర్మించి ఇస్తాడు. ఈ దివ్య సభాభవనం దుర్యోధనుని ఈర్ష్యాగ్నికి ఆజ్యంపోసింది. అర్జునుని దివ్యాస్త్రలాభం భవిష్యత్తులో రానున్న మహాయుద్ధ విజయానికి పాండవులు సాధించిన మొట్టమొదటి అస్త్రలాభం అయింది.

మయసభను చూడవచ్చిన నారదాదిమునులు ధర్మరాజు రాజసూయ యాగం చేయాలని స్వర్గవాసియైన పాండురాజు కోరిక అని తెల్పుతారు. రాజసూయ యాగం నిర్విఘ్నంగా ముగిస్తే పదమూడు సంవత్సరాల తరువాత మహాయుద్ధం సంభవిస్తుందని లోకంలోని విశ్వాసం. అయినప్పటికీ కృష్ణుడు ధర్మరాజును ప్రోత్సహిస్తాడు. మత్సరగ్రస్తులైన కౌరవులు పాండవులను సుస్థిరంగా జీవించనీయరని లోకజ్ఞుడైన కృష్ణునికి తెలుసు. ధృతరాష్ట్రుడు తప్పనిసరియైన పరిస్థితిలో, అయిష్టంగానే పాండవులకు రాజ్యభాగం ఇచ్చాడన్న విషయం అందరికీ తెలిసినదే. కౌరవ పాండవ కలహం అనివార్యమైనవేళ పాండవులకు బలవంతులైన ప్రత్యర్థులు ఉండకూడదన్నది కృష్ణుని సంకల్పం. అందువలననే "ఏకలవ్య జరాసంధులను ఒక్కొక్కవిధంగా అణగింపజేశానని కౌరవపతి వారిని తన పక్షానికి తెచ్చుకున్నట్లయితే వారిని జయించటం అతికష్టమని అర్జునునికి ఒక సందర్భంలో వెల్లడిస్తాడు.[38]

కౌరవుల చిత్తవృత్తిని, రాజసూయ యాగ ఫలితాన్ని గుర్తించి పాండవుల మార్గాన్ని నిష్కంటకం చేయదలచిన కృష్ణుని రాజనీతి, ధర్మరక్షణ నిర్వహణాచాతుర్యం అసామాన్యమైనవి. కార్యసాధకుడైనవాడు లక్ష్యసిద్ధిని కోరినప్పుడు తనకు సాధ్యంకాని పనిని ఇతరులచేత చేయిస్తాడు.

---

★ 38. ఆం. మ. భార - ద్రోణ - 5-239.

'నిన్నుమించిన ధనుర్ధరుడు ఉండకుండా నీకు విలువిద్య నేర్పుతానని ద్రోణుడు అర్జునునకు మాటయిస్తాడు ఆమాట నిలుపుకునేందుకు ఏకలవ్యుని విలువిద్యానైపుణ్యానికి ఆశ్చర్యపడినప్పటికీ, అతడి ఆవేశాన్ని అణచాలనే ఉద్దేశంతో కుంభసంభవుడు గురుదక్షిణ కోరి ఏకలవ్యుని నిర్వీర్యుని చేస్తాడు.

కంసుని మామగారు జరాసంధుడు. కంసుని మరణంతో అతడు యాదవుల మీద ముఖ్యంగా కృష్ణునిమీద పగబూనాడు. యాదవులను తరిమి కొట్టగా వారు గత్యంతరంలేక సముద్రమధ్యంలో ద్వారకను నిర్మించుకోవలసి వచ్చింది. జరాసంధుడు అజేయుడు. అతడిని జయించటం భీమునికొక్కనికే సాధ్యం. మదమత్తుడైన జరాసంధుడు రుద్రప్రీతికై రాజపుత్రులను బంధించి బలియిస్తుంటాడు. ఈ అధర్మాన్ని అరికట్టేందుకు రాజసూయయాగ నిర్వహణలో భాగంగా తనకు సాధ్యంకాని పనిని కృష్ణుడు భీమునిద్వారా చేయిస్తాడు. యాదవ, పాండవ ప్రత్యర్థి, జరాసంధుని మిత్రుడు అయిన శిశుపాలుని, సభామర్యాదను ధిక్కరించి, భీష్మాది పెద్దలను దూషించినందుకు తానే స్వయంగా నిగ్రహిస్తాడు. పాండవులమార్గం సుగమం చేస్తాడు. ఈ కృత్యాలన్నీ తన సంకల్పంగానే వెల్లడిస్తాడు. భారతంలో భీష్ముడు వివరించిన రాజధర్మం శత్రువిమర్దనం గురించి ఇలా నిర్వచించింది. 'కాల విపర్యయ వేళలో ప్రభువు శత్రువులకు మొక్కి, వారినికలసి వారి ప్రవర్తనను గమనించి సమయంచూసి వారిని యమపురికి పంపాలి' కృష్ణుడు ఈ మార్గాన్నే అనుసరించాడు.

జూదసమయంలో తాను పాండవుల సమీపంలో లేనందువల్లనే అంతటి విపత్తు సంభవించిందని చెప్పటం తాను వారి రక్షకుడనని వెల్లడించటమే. ఇదే విషయాన్ని ధర్మరాజు 'తమను ఆపదలనుంచి గట్టెక్కించేవాడు కృష్ణుడేనని, కృష్ణుని రక్షకుడుగా తమ తండ్రియే చూపాడని' చెప్పి కృష్ణునిపట్ల తమకుగల భక్తి గౌరవాలను చాటుతాడు. అంతేగాక 'మనిద్దరికీ ఏకమైన నిష్ఠ ఉన్నది. నీకిష్టుడైనవాడు నాకు కూడా ఇష్టుడు. నీకు అనిష్టమైనవాడు నాకును అనిష్టుడు' అని కృష్ణుడు అర్జునునితో పలకటం నరనారాయణులైన తామిద్దరికీ గల ఏకనిష్ఠ ధర్మరక్షణమేనని సూచించటమే. పాండవుల దురవస్థలను తలచి కృష్ణుడు కోపించటానికి కారణం దుర్యోధనుని ధర్మభంగకరమైన, అవమానకరమైన కృత్యాలే. పాండవులయందుగల ప్రేమకన్నా ధర్మపక్షపాత బుద్ధియే కృష్ణుని ఆగ్రహానికి కారణమైంది. కుంతీ ద్రౌపదులను ఓదార్చటం, రాయబార నిర్వహణలోను, యుద్ధరంగంలోను పదేపదే కౌరవుల అకృత్యాలను ఎత్తిచూపి ప్రసంగించటం కృష్ణుని ధర్మపక్షపాత స్వభావాన్ని వ్యక్తం చేస్తుంది.

అజ్ఞాతవాసం ముగిసిన తరువాత, అభిమన్యు వివాహానంతరం పాండవబంధువులు, శ్రేయోభిలాషులు ఉపప్లావ్యనగరంలో సమావేశమౌతారు. 'పాండవకార్యార్థి' అయి కృష్ణుడు రాజలోకసముఖంలో భవిష్యత్కార్యక్రమాన్నిగురించి నిర్ణయించవలసిందిగా పెద్దలను కోరుతాడు.

పాండవులు ధర్మబద్ధులై ద్యూతసమయాన్ని నిర్వర్తించారు గనుక వారికి పితృధనమైన రాజ్యభాగం సంక్రమించవలసివుందని తన మనోగతభావాన్ని నిస్సంకోచంగా వెల్లడిస్తారు. మొదట సంధిప్రయత్నం చేయటం కర్తవ్యమని, సంధిపొసగని పక్షంలో బలాలను సమీకరించుకోవలసిన అవసరం కూడావుందని సూచిస్తారు. రెండు మార్గాలలో ఏ మార్గాన్నైనా అనుసరించేందుకు సిద్ధమైవుండాలనే హెచ్చరిక ఈ సూచనలో ధ్వనిస్తున్నది. కార్యసాధనలో సామదానభేద దండోపాయాలనే చతుర్విధ ఉపాయాలను అవలంబించాలనే కృష్ణుని రాజనీతి, లోకజ్ఞత అద్వితీయమైనవి. సామమార్గం సంధి ప్రయత్నం. దుర్యోధనుని విషయంలో దానం అసాధ్యం. ఇక దండోపాయం యుద్ధ ప్రయత్నం. సామ దండోపాయాల ప్రయత్నాలు జరగాలని రాజసభలో హెచ్చరించాడు. ఇంక మూడవదైన భేదోపాయాన్ని కర్ణుని పాండవులవైపు ఆకర్షించే ప్రయత్నంగా రహస్యంగా తానే నిర్వహించాడు.

సభానిర్ణయాన్ని ఆమోదించి ద్రుపద పురోహితుని కౌరవసభకు రాయబారిగా పంపుతారు. దానికి సమాధానంగా కౌరవ పక్షం నుంచి సంజయుడు రాయబారం తెస్తాడు. ఈ రెండూ విఫలమైనాక చివరి ప్రయత్నంగా ధర్మరాజు కోరికపై తానే కురుసభకు దూతగా బయలుదేరుతాడు, మానధనుడైన దుర్యోధనుడు పాండవులకు రాజ్యభాగం ఇవ్వడని, తాను దౌత్యం చేసినా సంధి పొసగదని తెలిసి కూడా హస్తినకు ప్రయాణమౌతాడు. తన ప్రయత్నం ఏదో ఒక విధంగా పాండవులకు లాభకారి కాగలదనే విశ్వాసం ప్రకటిస్తాడు. సంధి జరగకపోయినా పాండవులు యుద్ధోన్మాదులనే లోకాపవాదం తప్పించే ప్రయత్నంగా తన దౌత్యం ఫలిస్తుందని పలకటం కృష్ణుని దూరదృష్టికి చిహ్నం. ధర్మ నిర్వహణలో శాశ్వతధర్మస్థాపన ప్రయోజనాన్ని ఆశించినప్పుడు రక్తపాతం తప్పదని తెలిసినా పాండవులు రాజ్య ప్రలోభంలేనివారని, శాంతి కాముకులని లోకానికి వెల్లడించటం అవసరమని కృష్ణుడు భావించాడు.

ఇన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ, రాజనీతికి విరుద్ధంకాని మార్గాన ప్రవర్తించినప్పటికీ కృష్ణునికి విమర్శలు, నిందలు, శాపాలు తప్పలేదు. 'రెండు వర్గాలవారికి తగినవిధంగా బోధించి యుద్ధాన్ని వారించమని ఎంతచెప్పినా కృష్ణుడు వినలేదని, సంధితానే చెడగొట్టి వచ్చాడ'ని బలరాముడు నిందవేశాడు.

యుద్ధం ముగిసిన తరువాత గాంధారి స్వజనుల, పుత్రుల మృతదేహాలను చూచి దుఃఖితురాలై 'ఈర్ష్యతో యుద్ధానికి తలపడ్డ కౌరవపాండవులను సర్వసమర్థుడవైకూడా వారించకుండా ఉపేక్షించావు. రాజవంశాల నాశనాన్ని ఆపలేదు, ఇందుకు ఫలితాన్ని అనుభవించమని' దూషించి శ్రీకృష్ణుని శపించింది. వీరిద్దరే కాకుండా మునియైన ఉదంకుడు కూడా యుద్ధం నివారించి జననష్టాన్ని, వంశనాశనాన్ని ఆపనందుకు కృష్ణుని విమర్శించి శపించేందుకు సిద్ధపడ్డాడు.కౌరవుల

దుష్కృత్యాలే వారి నాశనానికి కారణమని, కాలనియతి ఆవిధంగా ఉందని ప్రసన్నవాక్కులతో కృష్ణుడు ఉదంకుణ్ణి అనునయిస్తాడు. ధర్మ ప్రతిష్ఠాపనలో కార్యవాది అయిన కృష్ణుడు దూషణభూషణలు రెండింటిని నిర్వికారంతో శిరసావహించాడు. ఫలితాన్ని గురించిన వ్యాకులతలేకుండా నిష్కామ కర్మయోగియై వర్తించాడు. ధర్మస్థాపన ప్రయత్నంలో సంఘర్షణ కలిగితే ఇరుపక్షాలలో ఎవరికీ నష్టం కలుగకుండా కార్యం నిర్వహించటం అసాధ్యం. అధర్మాన్ని అణచే ప్రయత్నంలో ధర్మవ్యతిరేక వర్తనులకు బాధకలిగించక తప్పదు. లోకజ్ఞుడైన శ్రీకృష్ణుడు వీలైనంతవరకు తనపైన దోషనిరూపణలేకుండా ఉండేందుకే ప్రయత్నించాడు. కృష్ణుని విమర్శించినవారంతా అతడు యుద్ధం ఆపలేదని నెపం వేశారే తప్ప కౌరవ పాండవుల సఖ్యతకు సామరస్యమార్గాన్ని సూచించలేకపోయారు.

అధర్మాన్ని విచ్ఛేదం చేసి ధర్మ సంస్థాపన చెయ్యాలనే కర్తవ్య నిష్ఠతో కృష్ణుడు తాను కేవలం సలహాదారుడై తండ్రి రాజ్యభాగంకోరి ధర్మబద్ధులై పోరాడుతున్న పాండవుల పక్షాన నిలిచాడు. "చోదనాలక్షణః ధర్మః"-నడిపించే లక్షణముగలది ధర్మము అనే నిర్వచనానికి నిదర్శనంగా పార్థుని రథసారథియై యుద్ధాన్ని నడిపించాడు.

శ్రీకృష్ణుని ధర్మనిర్వహణలోని రాజనీతి చాతుర్యం, ధర్మ సూక్ష్మ నిర్ణయపాండిత్యం ఉద్యోగపర్వంలోను, యుద్ధపంచకంలోను బహిర్గతమౌతాయి. " కర్మణ్యేవా2ధికారస్తే మాఫలేషు కదాచన" అని తాను ఉద్బోధించిన సూక్తికి తానే ఉదాహరణగా నిలిచాడు. సిద్ధధర్మ స్వరూపుడైన శ్రీకృషుడు తనకు ఏ కర్మఫలాలు అంటవని చెప్పి నిష్కామకర్మయోగ ప్రాముఖ్యాన్ని ఆచరణలో చూపించాడు. మానవ ధర్మాలైన వ్యక్తిధర్మ సామాజిక ధర్మాలను ఏ విధంగా నిర్వహించాలన్న విషయం తన వర్తన ద్వారా చూపించాడు.

యుద్ధం అనివార్యమని తెలిసే దూతగా వెళ్ళటం ప్రయత్నలోపం జరుగరాదనియే. దౌత్యానికి బయలుదేరుతూ భీమార్జునులను యుద్ధప్రయత్నాలకై ప్రేరేపించటం, ద్రౌపదిని ఓదార్చి 'కౌరవుల ఇల్లాళ్ళు నీవలె దుఃఖించేకాలం వచ్చిందని' ఆమెను అనునయించటం, హస్తినాపురంలో 'నీ కుమారుల సామ్రాజ్య ప్రాప్తిని త్వరలో కనులచూడగలవని మేనత్త కుంతీదేవికి ఉల్లాసాన్ని కలిగించేవిధంగా భవిష్యత్తును సూచించిటం కృష్ణుని బంధుధర్మ నిర్వహణకు, పరహృదయగత భావ గ్రహణపారీణతకు నిదర్శనాలు.

ఆశచూపి కర్ణుని ప్రలోభపెట్టటం సాధ్యంకాదని తెలిసినా కృష్ణుడు కర్ణునిమీద భేదోపాయాన్ని ప్రయోగించాడు. ఈ ప్రయత్నంలో కర్ణుని హృదయంలో పరేంగితజ్ఞుడైన కృష్ణుడు చంచలనం రేకెత్తించగలిగాడు. పాండవులు తన సోదరులని రూఢిగా తెలిసిన తరువాత కర్ణుని మానసిక స్థితి

తప్పకుండా బలహీనమౌతుందని కృష్ణునికి తెలుసు. కృష్ణుని మాటలకంటే ముందు వెదవెదయేను దొల్లి ఇది వింటి'నని తన జన్మగురించి కొంతకొంత విన్నానని కర్ణుడు ఒప్పుకుంటాడు. వెదవదవింటినన్న కర్ణుడికి పూర్తి వివరాలను ఇవ్వటమే కాక కృష్ణుడు కాంతాకనకాల ఆశకూడా చూపించాడు. అర్జునుని మించిన వీరుడని పేరు పొందాలనేదే కర్ణుని జీవిత లక్ష్యం. కనుక ఎప్పుడూ అర్జునునికి ప్రతిపక్షంలోనే అతడుంటాడు. ద్రౌపదీ స్వయంవరానికి వచ్చి కర్ణుడు విఫలయత్నుడయాడని కృష్ణుడు ఎఱుగును. ఈ విషయాలన్నింటిని దృష్టిలో పెట్టుకునే కర్ణునికి రాజ్యాన్ని, ద్రౌపదిని పొందే అవకాశం ఉంటుందని ఆశ చూపించాడు. ఈ సందర్భంలో ద్రౌపదిని కృష్ణుడు అవమానించాడని భావించటం పొరపాటే అవుతుంది. ద్వాదశవిధపుత్రులలో అనాటి సమాజంలో క్షేత్రజకానీనులకు యథోచితమైన స్థానంవుంది. పాండవులు క్షేత్రజులైతే, కన్యయైన కుంతికి జన్మించిన కర్ణుడు పాండురాజుకు కానీనపుత్రుడౌతాడు. అతడు పాండవుల పక్షాన చేరితే కుంతీపుత్రుడై పాండవుడే కాగలడు. మాతృవాక్యాన్ననుసరించి ద్రౌపది పాండవులందరికీ పత్ని అయింది. ఆ విధంగా జరగటం ధర్మ విరుద్ధం కాదని కర్ణుడికి తెలియజెప్పటంవరకే కృష్ణునిపని. సమాజధర్మ విరుద్ధం కాకపోయినా కర్ణుని విషయంలో అలా జరగడం అసాధ్యమని కృష్ణుడెఱుగును. అయినా కార్యసాధనలో ప్రయత్నలోపం ఉండకూడదనే భావంతోనే ఈ భేదోపాయాన్ని ప్రయోగించాడు.

కృష్ణుడు చూపిన ఆశకు ప్రలోభపడకపోయినా కర్ణుని మనసులో కృష్ణుడు వాంఛించిన సంచలనం పొడసూపింది. దుర్యోధనుని యందు తనకుగల కృతజ్ఞతను, తనపై దుర్యోధనునికి గల నమ్మకాన్ని వివరించి కృష్ణుని తిరస్కరించిపంపిన కర్ణుడు కుంతీదేవిని రిక్తహస్తాలతో పంపలేకపోయాడు. 'పాండవులు చేజిక్కితే అర్జునునిమీద నాకు కోపంగనుక వానిని వదలనని, మిగిలినవారిని వధించనని' నలుగురికి ప్రాణభిక్షను కల్పించాడు. అంతేకాక తాను కుంతీపుత్రుడనని అనిపించుకొనేందుకు అభ్యంతరం చెప్పలేదు. 'అయితే అర్జునుడితో ఐదుగురు, అతడు లేకుంటే నాతోకలిపి ఐదుగురు నీ కొడుకులు ఎప్పుడూ అయిదుగురే. ఆరుగురనే మాట విడువమని' కూడా పలికాడు. కర్ణుని చేతిలో పడకుండా మిగిలినవారు బైటపడితే అర్జునుని తాను కాపాడగలనన్న విశ్వాసం కృష్ణునిది. ఇది కృష్ణుడు పాండవుల బాంధవుడై ప్రయోగించిన అద్భుతమైన రాజనీతి.'

శ్రీ కృష్ణునిపట్ల ధర్మరాజుకు అచంచలమైన విశ్వాసం, బంధుప్రీతి. రాయబారానికి పంపుతూ 'సమయమిది మిత్రకార్యము చక్కజేయ' అని కృష్ణునితో అంటాడు. కృష్ణుని పాండవులు గురువుగా, మార్గదర్శకునిగా భావించారని అనేక సందర్భాలలో వారి మాటలవలన స్పష్టమౌతుంది. పాండుపుత్రులు ప్రియబాంధవులు, ఆత్మీయులేకాక ధర్మవర్తనులు కూడా అయివుండటంచేత ధర్మపక్షపాతి అయిన కృష్ణుడు పాండవుల పక్షాన నిలచాడు. కురుసభలో అతడు ధర్మరాజు

ధర్మనిరతిని పలుమారులు ప్రశంసించటం తాను పాండవులకే కాక ధర్మానికి ప్రతినిధిగా వచ్చానని సూచించటమే.

ఒక పనిని చేయతలపెట్టినప్పుడు లక్ష్యం ధార్మికమైనప్పుడు లక్ష్యసాధనలో సాధ్యాసాధ్యాల ప్రసక్తివదలి ప్రయత్నం కొనసాగించాలని యుద్ధరంగంలో కృష్ణుడు అనేకసార్లు నిరూపించాడు యుద్ధానికిముందు వినయాన్వితుడై ఎదుట నిలచిన యుధిష్ఠిరుని భీష్మద్రోణులు ఆశీర్వదిస్తారు తమను జయించేమార్గం చెప్పమని అతడు కోరగా ద్రోణునివలె భీష్ముడు ఆక్షణమే వెల్లడించలేదు. మరొక మార్గం ఏదీలేనప్పుడు మళ్ళీ రమ్మని ధర్మరాజును మరల్చి పంపుతాడు. పది దినముల యుద్ధం తరువాత భీష్ముని ధాటికి నిలువలేక కలవరపడిన ధర్మరాజుకు భీష్ముడుఇచ్చిన మాట జ్ఞప్తికి తెచ్చి, అతని వద్దకు వెళ్ళి 'నిజవధోపాయం' గ్రహించిరమ్మని కృష్ణుడు కర్తవ్యాన్ని బోధిస్తాడు. యుద్ధరంగంలో శత్రునిగ్రహమే కర్తవ్యమని అర్జునుని ప్రబోధించి శిఖండిని ముందుంచుకొని భీష్మునితో పోరాడేందుకు ప్రోత్సహిస్తాడు.

అధర్మాన్ని పరిహరించి ధర్మబద్ధమైన లక్ష్యం సాధించేందుకు అవసరమైతే ధర్మేతరమార్గాన్ని అనుసరించటం 'ఆపద్ధర్మం' అని కృష్ణుడు ఆచరణలో చూపించాడు. "ధర్మమధర్మము భంగి నధర్మము ధర్మంబు మాడ్కి" తోచినప్పుడు నిర్మలమతితో ధర్మసూక్ష్మాన్ని గ్రహించవలసివుందని కృష్ణుని చర్యలు నిరూపిస్తాయి. ధర్మరాజుచేత అసత్యం పలికించటం, విరథుడైన కర్ణుని వధింప చేయటంవంటి సందర్భాలలో కృష్ణుడు అధర్మం చేశాడన్నట్లుగా తోస్తుంది. కాని శాశ్వత ధర్మస్థాపనలో, కాలవిపర్యయంవలన సంభవించిన యుద్ధంలో ధర్మపక్షానికే విజయం లభించాలనే లక్ష్య సాధన కోసం శ్రీకృష్ణుడు ఆపద్ధర్మాన్ని అనుసరించాడు.

క్షత్రియులకు యుద్ధంకన్నా ధర్మం మరొకటిలేదని చెప్పిన కృష్ణుడు వ్యక్తిగతమైన ధర్మనియతికీ, యుద్ధనీతికీ సంఘర్షణ కలిగితే యుద్ధ రంగంలో యుద్ధనీతినే అనుసరించాలని ప్రబోధించాడు. యుద్ధరంగంలో శత్రునిగ్రహమే కర్తవ్యం. విజృంభించి ప్రవహించే నదిలాగపొంగి శత్రువును అణచటమే యుద్ధనీతి. ఈ నీతిని అనుసరించే ధర్మరాజును అసత్యం చెప్పమని, కర్ణుడు విరథుడైనప్పుడు అది అతని శాపమని చెప్పి అర్జునుని బాణప్రయోగం చేయమని ప్రోత్సహించాడు.

ఇదే విధంగా మరొక సందర్భంలోను కృష్ణుని రాజనీతి, యుద్ధనీతి వెల్లడౌతాయి. మడుగులోదాగిన దుర్యోధనుని మాటలతో నొప్పించి బయటకు రావించిన తరువాత ధర్మరాజు 'మాలో ఒకరిని ఎన్నుకో, వానిని నీవు జయించితే రాజ్యంనీది లేకున్న మాది' అని సమయం చేస్తాడు. వయసులో పెద్దవాడు, తనకు పూజనీయుడని, తాను అతడి ఆజ్ఞకు బద్ధుడనని ధర్మరాజును గూర్చి నిరంతరం పలికే కృష్ణుడు ఈమాటలు విని ధర్మరాజును మందలిస్తాడు.

భీముని తప్ప మరెవరిని దుర్యోధనుడు ఎన్నుకున్నా జూదంలో శకునికి సంపదలు కోల్పోయినట్టు కాగలదని హెచ్చరిస్తాడు. రాజసూయానికి ముందు జరాసంధుని వధించేందుకు బ్రాహ్మణరూపాలతో వెళ్ళినప్పుడు తమ ముగ్గురిలో ఒకరిని ఎన్నుకుని యుద్ధం చేయమని జరాసంధుని తానే అడిగిన కృష్ణుడు, దుర్యోధనుని విషయంలో ధర్మరాజును మందలించినందుకు తగిన కారణం వుంది. బలగర్వితుడైన జరాసంధుడు తనకు సమఉజ్జీగా భీముని ఎన్నుకుంటాడని, అతనితో తప్ప ఇతరులతో యుద్ధం చేసేందుకు అంగీకరించడని కృష్ణునికి తెలుసు. కాని దుర్యోధనుడు కుటిలవర్తనుడు. అతడి బుద్ధి ఏ మార్గాన వర్తిస్తుందోననే కృష్ణుని దూరదృష్టి ధర్మరాజును మందలించేటట్లు చేసింది.

గదాయుద్ధంలో దుర్యోధనుని తొడలు విరగగొట్టటం అధర్మమని బలరాముడు కోపోద్రిక్తుడుకాగా, కృష్ణుడు భీముని ప్రతిజ్ఞలను, కౌరవుల చేష్టలను వర్ణించి తన వచోనైపుణ్యంతో అన్నను శాంతపరుస్తాడు. అభిమన్యువధతో కౌరవులు యుద్ధనీతిని విడిచి అధర్మమార్గాన్ని అనుసరించారని అధర్మవర్తనులను శిక్షించడం రాజధర్మమని వివరిస్తాడు. మిత్రుల విజయానికి ఆనందించటం మిత్రలక్షణమని, మానవ ధర్మమని పలికి తన లోకజ్ఞతను, యుక్తాయుక్త వివేచనను చూపుతాడు. తమ కారణంగా జరిగిన బంధు నాశనానికి దుఃఖితుడైన ధర్మరాజును ఉత్సాహపరచేందుకు తానే పాంచజన్యాన్ని పూరించి విజయఘోష చేస్తాడు.

శాశ్వత ధర్మస్థాపనను కోరిన తాను లౌకికధర్మాన్ని నిర్వహిస్తున్నప్పటికీ కృష్ణుడు నిర్మోహంతో వర్తించాడు. తాను స్వయంగా నిష్కామకర్మను ఆచరణలో చూపాడు. అభిమన్యు ఘటోత్కచులు చిన్నవారైనప్పటికీ వారి మృత్యువులను విధి నిర్ణయంగా భావించాడు. అభిమన్యుడు మరణించినప్పుడు 'శూరులకు వీరమరణం గౌరవప్రదమైనదిగదా ఈ విధంగా దుఃఖించదగునా' అని అర్జునుని, 'రాజకుమారులకు రణములో మరణం సంభవించటం స్వర్గప్రాప్తిని కలిగిస్తుంది, కాలము తీరిన వెనుక ఎంతటివారైనను పోకతప్పదు. అవివేక జనాలవలె నీవేల శోకమున మునుగుతున్నావ'ని సుభద్రను తత్త్వబోధతో ఓదారుస్తాడు.

భీమపుత్రుడు ఘటోత్కచుడు కర్ణుని ఇంద్రశక్తికి బలై. మరణించగా, సింహనాదంచేసి శంఖం పూరించి ఆనందంతో అర్జునుని కౌగిలించుకుంటాడు. విస్మితుడైన అర్జునుడు ఇదేమని ప్రశ్నిస్తే 'ఘటోత్కచుడు కిమ్మీరబకహిడింబులవంటివాడు. ధర్మద్వేషమ్ము, రోషము కలవాడు. ఎప్పుడైనా కానిపనులను (అధర్మాన్ని) చేయవచ్చు. కనుక ఆ రాక్షసులవలె వీడు కూడా ఈ విధంగా మరణించటమే నాకు సంతోషమని స్పష్టంగా చెప్తాడు. ధర్మద్వేషులైన వారెవరైనా సరే వారి నాశనం తనకు ఆనందదాయకమని వెల్లడిస్తాడు.

'నీ భక్తులమైనమమ్ము నీవు కాపాడటం అరుదా' అని, 'మాయీవిజయానికి నీవే కారకుడవ' ని ధర్మరాజు స్తుతించినప్పుడు, నన్ను విశ్వసించి నేను చెప్పినమార్గాన్ని ఎటువంటి సంకోచములేకుండా అనుసరించి, ప్రయత్నలోపం లేకుండా మీరు పోరాడారని, నీ విజయానికి నేను నిమిత్తమాత్రుడనని, పలికి మానవ జీవితంలో కార్యకారణ సంబంధం బలీయమైనదని సూచిస్తాడు. ధర్మరాజు ప్రశంసలను, గాంధారి శాపాన్ని మరికొందరి విమర్శలను సమాన దృష్టితో స్వీకరించి, విధి నిర్ణయానికి తలవంచి తాను ధర్మబంధువును మాత్రమేనని స్పష్టం చేస్తాడు. కార్యసాధనలో మార్గదర్శకుడు లేదా దైవం యందు సంపూర్ణ విశ్వాసం, పురుష ప్రయత్నం రెండూ మానవుని విజయానికి తోడ్పడుతాయని లోకానికి చాటిచెప్పాడు.

**నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః**
**శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః**[39].

శరీరయాత్రను నడిపేందుకు మానవుడు కర్మను చేయకతప్పదని, ప్రతిజీవి నియతకర్మను చేయటం అవసరమని ప్రబోధించిన కృష్ణుడు స్వయంగా యుద్ధాన్ని ప్రోత్సహించాడు. సంధి ప్రయత్నాలు విఫలమై యుద్ధం అనివార్యమైనప్పుడు స్వధర్మమైన క్షత్రియధర్మాన్ని ఆచరించి, కర్మపరాయణులు కమ్మని పాండవులను హెచ్చరించాడు. స్వకీయ కర్మలను లేదా స్వధర్మాన్ని నిర్వహించినవారికి సత్ఫలసిద్ధి కలుగుతుందని, పాండవుల విజయానికి వారి స్వధర్మానుష్ఠానమే మూలకారణమని, ధర్మానుష్ఠానంవల్ల కలిగే ప్రయోజనాన్ని వివరించాడు. విహిత కర్మలను, నిషిద్ధకర్మలను ఎఱిగి కర్మస్వరూపాన్ని గ్రహించి వర్తించాలని, కర్మ నిర్వహణలో ఆసక్తిని, కర్మఫలాపేక్షను వదలి కర్తవ్యం నిర్వహించటం ఉత్తమమని బోధించాడు. అప్పుడే కర్మయోగం సిద్ధిస్తుందని స్పష్టంగా చెప్పాడు. ధర్మాచరణ తప్ప మానవ జీవితానికి మరొక ముక్తిమార్గంలేదు. అందువలన శరీర ప్రయోజనం ధర్మాచరణమేనని భగవద్గీతలో బోధనరూపంలోను, భారతయుద్ధంలో ఆచరణలోను చూపించాడు. ఫలాపేక్ష రహితమైన కర్మాచరణమే ధర్మమని చాటాడు

ధర్మం వేదమూలం. కర్మ వేదప్రబోధితం. ఈ రెండు శబ్దాలు పర్యాయములు. ప్రతిఫలాకాంక్షలేకుండా తాను ధర్మనిర్వహణ చేయటం, కర్మను అనుష్ఠించటం మానవులకు ధర్మస్వరూపాన్ని తెలియజేసేందుకేనని స్పష్టంగా చెప్పాడు. తాను మార్గదర్శకుడై ధర్మాన్ని ఆచరించి చూపకపోతే జనులు ధర్మవ్యతిరేకులైపోతారని, ఆ విధంగా జరిగితే సమాజ వినాశనం

★ 39. భ గ - 3-8

జరుగుతుందని. అందువలననే తనకు కర్మలు చేయవలసిన అవసరంలేకున్నా అనాసక్తితో జనులకోసం కర్మరూపంగా ధర్మాన్ని అనుష్ఠిస్తున్నానని భగవద్గీతలో వివరించాడు.

ధర్మావతారుడు. భగవత్స్వరూపుడు అని వ్యాస. భీష్మ, విదురాది ధర్మతత్త్వజ్ఞులు, పాండవాది బంధుజనులు శ్రీకృష్ణుని ప్రస్తుతించారు. ధర్మాచరణలో కర్మయోగాన్ని కృష్ణుడు తన ప్రవర్తన ద్వారా స్వయంగా నిరూపించి చూపించాడు. భౌతిక లేదా లౌకిక ధర్మ నిర్వహణలో సంఘర్షణ కలిగితే శాశ్వత ధర్మస్థాపనలో లోకశ్రేయస్సును కోరి ఆపద్ధర్మాన్ని అనుసరించవలసి వుంటుందని ప్రబోధించాడు. కర్తవ్య నిర్వహణలో ధర్మసాధనకు తప్ప రాగద్వేషాలకు, సుఃఖదుఃఖాలకు లోనుకారాదని హెచ్చరించాడు. ధర్మనిరూపణ, ధర్మస్థాపన కర్తవ్యాలుగా కురుక్షేత్రయుద్ధాన్ని నిర్వహించాడు.

ధర్మవర్తనుడైన ధర్మరాజును కురుసింహాసనంపై అధిష్ఠుని చేసిన తరువాత ఉత్తరగర్భస్థ మృత శిశువును కాపాడి కురువంశాన్ని నిలిపాడు. శాశ్వత ధర్మ ప్రతిష్ఠాపన కార్యాన్ని పాండవ వంశ విస్తరణ వరకు కొనసాగించాడు.

ఉత్తర గర్భాన మృతశిశువు జన్మించగా ఫలాపేక్షలేకుండా కర్మలను నిర్వహించేవానికి కర్మబంధాలు అంటవని నిరూపిస్తూ,

**తే॥ మహిత సత్యంబుఁ బరము ధర్మంబుఁ గాఢ**
**నిర్మల బ్రహ్మచర్యంబు నిత్యసుప్ర**
**తిష్ఠంబులై నా యందుఁ దేజరిల్లు**
**నేని నిబ్బాలకునకు జీవమిపుడువచ్చు॥**[40]

అని ఎలుగెత్తిచాటి బాలుని జీవితుని చేశాడు. తన యోగనిష్ఠను ప్రకటించి అభిమన్యుపుత్రుడు పరిక్షిత్తుకు ప్రాణదానం చేశాడు. సంగరహితకర్మ శ్రేయోదాయకమని చాటేందుకు తానే ఉదాహరణగా నిలచాడు.

వ్యాసమహర్షి మహాభారతం ద్వారా ప్రవచించదలచిన లౌకిక ఆధ్యాత్మిక ధర్మాలను శ్రీకృష్ణుడు ఆచరణలో చూపి లోకక్షేమ ప్రయత్నమే మానవధర్మమని ప్రబోధించాడు.

గీతాప్రవచనవేళ అర్జునుడు శ్రీకృష్ణుని

---

★ 40. ఆం. మ. భార - అశ్వమేధ 3-194

**త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్యవిశ్వస్య పరం నిధానమ్**

**త్వమవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా సనాతనస్త్వం పురోషోమతోమే॥**[41]

అని సనాతనుడు, అవ్యయుడు, ధర్మరక్షకుడు శ్రీకృష్ణుడని స్తుతించాడు

తిక్కన మహాభారతంలో

క॥ **సర్వమునందును దానున్**

**సర్వము దనయందు నుండు సంచారంబున్**

**సర్వము నకుఁ దనవలసిన**

**సర్వాత్మకు నట్టి వృష్ణిసత్తము దలతున్**[42]

అని వర్ణించి భగవద్గీతలో చెప్పిన లక్షణాలకు భౌతికరూపందాల్చిన సిద్ధ ధర్మస్వరూపుడని, ధర్మ ప్రతిష్ఠాపకుడని, సాక్షాత్తు భగవంతుడని నుతించాడు. భీష్ముని నోట శ్రీకృష్ణుని 'కలికాలచరిత ధర్మము నిలుపన్ గలయట్టి విష్ణుడ'ని పలికించాడు. వ్యాసాభిప్రాయాన్ని అనుసరించి తిక్కన కూడా శ్రీ కృష్ణుడు ధర్మావతారుడు, సిద్ధధర్మస్వరూపుడని అనేక సందర్భాలలో వర్ణించాడు.

భారతంలో శ్రీకృష్ణుడు ధర్మసాధనకే మానవజీవితం నిర్దేశింపబడిందని, ధర్మసాధన ఫలాకాంక్షరహితమైనప్పుడే కర్మబంధాలు నశించి ముక్తి లభిస్తుందని నిరూపించి, కర్మయోగాన్ని నిష్కామకర్మను ఆచరణలో చూపి సిద్ధధర్మస్వరూపుడై నిలచాడు. ★

★ 41. భగవద్గీత 11-18

★ 42. ఆం.మ. భార. శాంతి 2-39

# 5. సాధ్య ధర్మవర్తనులు - వ్యాసభీష్మవిదురసంజయులు

**ప్రజహాతి యదాకామాన్సర్వాన్పార్థ మనోగతాన్**
**ఆత్మన్యే వాత్మనాతుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే॥**[43]

(పార్థా! ఆత్మయందే ఆత్మచేత తృప్తుడై ఎప్పుడు మనసులోనుండు కోర్కెలనన్నింటిని విడుచునో అప్పుడు స్థితప్రజ్ఞుడని చెప్పబడుచున్నాడు.)

మహాభారతంలో ప్రధానకథతో సన్నిహిత సంబంధం కలిగి ఆద్యంతం ధర్మానుష్ఠానము, ధర్మతత్త్వ ప్రబోధము, ధర్మసూక్ష్మ వివరణ తమ కర్తవ్యంగా భావించిన స్థిత ప్రజ్ఞులు వ్యాసభీష్మవిదుర సంజయులు. కురువంశోద్ధరణ, కురువంశరక్షణ, కురువంశ క్షేమకాంక్షులై వీరు తమ తమ జీవితాలను ధారపోశారు. ఎటువంటి సందర్భంలోనైనా ధర్మచింతన, ధర్మవర్తనలను వీడక, ధర్మప్రబోధాన్ని నిర్వహించటమే తను ధ్యేయంగా భావించిన ధర్మతత్త్వజ్ఞులు వీరు నలుగురు.

**యశ్చతుర్గుణ సంపన్నం ధర్మం బ్రూయాత్స ధర్మవిత్**
**అహేరివహి ధర్మస్య పదం దుఃఖం గవేషితుమ్॥**[44]

(నాలుగు గుణములు గల ధర్మస్వరూపమును బోధింపగలవాడే ధర్మవేత్త. ఈ ధర్మము యొక్క గుర్తులు వెదకి గుర్తించుట చాలాకష్టము. పాము ప్రాకిపోయిన చోట దాని అడుగులను గుర్తింపలేము కదా! అట్లే ధర్మ స్వరూపమును ఇదమిత్థమని నిర్ణయించి చెప్పలేము)

ఈ నాలుగు గుణాలు సత్యము, జ్ఞానము, దయ, శౌచము అని భాగవత పురాణం వివరించింది. ఈ నాలుగు గుణాలు స్వభావలక్షణాలై, నియమనిష్ఠలతో ధర్మాచరణమే కర్తవ్యంగా భావించి మోక్షమార్గాన్ని అన్వేషించే మహాయోగులే సాధ్యధర్మవర్తనులు. వీరు ద్వంద్వాతీతులై, అరిషడ్వర్గాలను జయించినవారై, సమయాన్నెరిగి ఆశ్రితులకు ధర్మతత్త్వప్రబోధం కలిగిస్తుంటారు. సాధ్యధర్మవర్తనులైనవారు నిర్మోహులై సమస్తబంధాలకు అతీతులై కేవలం లోకకల్యాణార్థమే సాటివారితో వ్యవహరిస్తుంటారు. మహాభారతంలో సాధ్యధర్మప్రవర్తకులు, స్థితప్రజ్ఞులు అయిన వ్యాసభీష్మవిదురులు ముగ్గురూ మూడు ఆశ్రమాలకు చెందినవారు. నాల్గవ వ్యక్తి సంజయుడు నిర్లోభుడైన ధర్మవేత్త, కురువంశ హితైషి.

---

★ 43. భగవద్గీత 2-55

★ 44. సం॥ మ. భార శాంతి 132-20.

ఈ నలుగురు ధర్మతత్త్వజ్ఞులలో వ్యాసుడు ఎటువంటి సంసారబంధాలులేని మునివల్లభుడు. శుకుని తండ్రిగా వ్యాసునికి పితృస్థానం లభించినా అది సాంసారిక బంధం వలన ఏర్పడినదికాదు. శుకుడు వ్యాసుని ఆధ్యాత్మిక జ్ఞానమార్గానికి మాత్రమే వారసుడు తపోమార్గ నిష్ఠుడైన ధర్మవేత్త. ధర్మప్రబోధకుడు వ్యాసుడు

ఇక రాజాంతఃపురాలలో మసలినా, రాజభోగాలు అనుభవించినా నిరంతర ధార్మిక చింతనతో ధర్మబంధుత్వం తప్ప మరెటువంటి బంధాలకు, అనుబంధాలకు అవకాశం కల్పించకుండా జీవనం గడపిన బ్రహ్మచర్య దీక్షాపరుడు, త్యాగధనుడు భీష్ముడు.

సత్యవతి కోరికను తిరస్కరించి, ఆమె ఆజ్ఞను ఉల్లంఘించిన అంబిక చెయిదము, వ్యాసుని అనుగ్రహం, కారణాలు కాగా దాసీవనితకు జన్మించిన నీతివేత్త విదురుడు. కురువంశంతో నైతిక బాంధవ్యం కలిగిన విదురుడు గృహస్థాశ్రమవాసియై, రాజసేవలో జీవనంగడుపుతున్నా ధర్మమార్గంతప్పని వ్యక్తి. వ్యాసభీష్మవిదురులు ముగ్గురు సత్యవతీదేవి మూలంగా ధర్మబంధువులై కురువంశరక్షణకు, ధర్మరక్షణకు ప్రయత్నించారు. సిద్ధధర్మస్వరూపుడైన శ్రీకృష్ణుని భగవత్స్వరూపునిగా గుర్తించి అతడి ధర్మసంస్థాపన మహత్కార్యానికి భక్తిపూర్వకంగా సహకరించారు.

## మునిశ్రేష్ఠులలో శ్రేష్ఠుడు - వ్యాసుడు

"వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే" అని వ్యాసుని విష్ణుస్వరూపుడని మహర్షులు ప్రస్తుతించారు "మునీనా మప్యహం వ్యాసః" అని భగవద్గీతలో శ్రీకృష్ణుడు వేదార్థజ్ఞానులలో వ్యాసుడు తానేనని స్పష్టంగా చెప్పాడు. నారాయణుని అంశావతారమే సాత్యవతేయుడని మహాభారతం బోధిస్తున్నది.

"ఆదికాలంలో నారాయణుడు ప్రజాసృష్టినికోరి నిజనాభికమలము నుంచి బ్రహ్మను సృష్టించగా అతడి ముఖపద్మమునుంచి వేదములు వెలువడ్డాయి. ఆ వేదముల ప్రచారానికై పరమాత్ముడు అపాంతరతముడనే మానసపుత్రుని సృష్టించాడు. దృఢచిత్తంతో శ్రుతులను విని వానిని పూజనీయములైనవిగా ప్రచారం చేయమని ఆదేశించాడు. అపాంతరతముడు ఆ విధంగా వేదములను విభజించి విస్తరింపచేయగా నారాయణుడు ప్రేమతో వేదవ్యాసుడా అని సంబోధించాడు ఉత్తరకాలంలో కలిద్వాపర సంధియుగాన పరాశరాత్మజుడవై అధర్మపరులైన జనపతులు నాశనంపొందగా ధర్మప్రతిష్ఠాపనకు పూని ధర్మప్రబోధంగావించమని వాత్సల్యపూరితుడై పద్మనాభుడు అపాంతరతముని ఆదేశించాడు." అనే వ్యాసుని జన్మగాథను మహాభారతం వివరిస్తున్నది [45]

★ 45. ఆం.మ. భార శాంతి 6-520, 527

భాగవతం కూడా వ్యాసుడు భగవదంశసంభూతుడనే వర్ణిస్తున్నది. "ఇట్లు వేదంబులు సమగ్రంబులుగాఁ బఠియుగంబునను మహర్షులచే నభ్యసింపఁబడును. అట్టి వేదంబుల సమగ్రంబుగ బఠియింప నశక్తులగు వారలకు సహాయంబు సేయుటకై ద్వాపరయుగాదియందు భగవంతుడు సత్యవతీదేవియందుఁ బరాశర మహర్షికి సుతుఁడుగానవతరించి యావేద రాశింగ్రమమున ఋుగ్యజుస్సామ అధర్వణములను నాలుగువిధంబులుగ విభజించి పైల, వైశంపాయన, జైమిని, సుమంతులనియెడు శిష్యవరులకుఁ గ్రమంబున నా ఋుగాది వేదంబులనుపదేశించె"[46]

ధర్మప్రబోధధ్యేయంతో ధర్మస్వరూపుని అంశతో మత్స్యగంధి అయిన సత్యవతికి, పరాశర మహర్షికి జన్మించిన పరమయోగి వ్యాసుడు. కృష్ణద్వైపాయన నామంతో ప్రసిద్ధుడై కురువంశాభివృద్ధికి మూలపురుషుడైనాడు.

సత్యవతి కేవలం మత్స్యగంధి, దాశరాజపుత్రిక మాత్రమే కాదు. ఆమె జన్మ విశిష్టమైనది. చేదిభూనాయకుడైన ఉపరిచరవసు తపస్సంపదతో మహావిష్ణువును మెప్పించి భూలోకంలో ప్రతిష్ఠిచేందుకై ధర్మాన్ని వరంగా పొందాడు. అద్రిక అనే అప్సరస మీనరూపిణియైవుండి ఉపరిచరవసు వీర్య ప్రభావంతో ప్రసవించిన బాలికయే దాశరాజు దత్తపుత్రికయై సత్యవతిగా పెరిగింది. దేవమానవ సంయోగం వలన జన్మించిన సత్యవతికి, మునివరుడైన పరాశరమహర్షికి నారాయణాంశతో జన్మించిన మహాపురుషుడు కృష్ణద్వైపాయనవ్యాసుడు. సంకల్పబలంచేత జన్మించినవెంటనే కృష్ణాజినదండకమండలుడు, కపిల జటామండలుడు అయి తల్లి ఆజ్ఞనుపొంది కృష్ణద్వైపాయనుడు తపోవనానికి వెడలిపోయాడు. 'మీకు పనిగలయప్పుడు నన్నుందలంచునది యక్షణంబవత్తున'ని తల్లికిమ్రొక్కి మాతృభక్తిని చాటుకున్నాడు. అనంతర కాలంలో దాశరాజు కోరికననుసరించి సత్యవతీశంతనుల పుత్రులు కురు సింహాసనాన్ని అధిష్ఠించారు. భీష్ముడు శంతనుని జ్యేష్ఠపుత్రుడైనా ప్రతిజ్ఞాబద్ధుడై రాజ్యాన్ని త్యజించాడు. అల్పాయుష్కులై చిత్రాంగద విచిత్రవీర్యులు మృతి చెందగా కురువంశం రూపుమాసిపోయే ప్రమాదం యేర్పడింది. వంశ విచ్ఛేదం కాకుండా కాపాడవలసిన అవసరం సత్యవతీదేవికి కలిగింది. ఆమె వ్యాసుని తలచి రప్పించి నియోగవిధిన, దేవరన్యాయాన్ని అనుసరించి విచిత్రవీర్య పత్నులైన అంబిక అంబాలికలకు పుత్రదానం చేయమని ఆదేశించింది.

విచిత్రవీర్యక్షేత్రజులైన ధృతరాష్ట్ర పాండురాజులతో పాటుగా దాసీపుత్రుడై, మహాజ్ఞానిగా ప్రసిద్ధిపొందిన విదురుని జన్మకు కూడా వ్యాసుడు మూలమైనాడు కురువంశవృద్ధిని, వినాశనాన్ని

★ 46. శ్రీమదాంధ్రమహాభాగవతం 12-6-30

పునరుజ్జీవనాన్ని కేవలం ద్రష్టగా నిర్మోహత్వంతో వ్యాసుడు దర్శించాడు. ధర్మభంగం వలన కలిగే అనర్థాలను, ధర్మాచరణ మూలంగా లభించే శాశ్వతకీర్తిని లోకానికి చాటాలని, ఇతిహాసరూపంలో ధర్మప్రబోధం చేయాలనే సంకల్పంతో జయకావ్యాన్ని నిర్మించాడు. మహాభారత ఇతిహాస రచనద్వారా వ్యాసమహర్షి వాంఛించిన మూలధ్యేయం ధర్మరక్షణ. సంస్కృత మహాభారతం స్వర్గారోహణ పర్వం చివరలో 'భారతసావిత్రి' పేరుతో "ఊర్ధ్వబాహుర్విరౌమ్యేష" మొదలైన నాలుగు శ్లోకాలలో మహాభారత రచన ఉద్దేశ్యం ధర్మ ప్రబోధము, ప్రచారమేనని వ్యాసుడు చెప్పినట్లుగా కన్పిస్తున్నది.

లౌకికమైన యశస్సుకుగాని, ఆత్మజ్ఞానసిద్ధికిగాని, శాశ్వతమైన బ్రహ్మానందస్థితికిగాని, ధర్మానుసరణమే మార్గమని మహాభారతంలోని వ్యాసోపదేశం. ధర్మముతో కూడిన అర్థకామములే మానవలోకానికి శ్రేయోదాయకాలని వ్యాసుడు వివరించాడు.

ధర్మరక్షణ, కర్తవ్యంగా, ధర్మపాలన ధ్యేయంగా, కురు వంశీయులు హస్తినాపురం రాజధానిగా పరిపాలించారు. అటువంటి సామ్రాజ్యానికి జ్యేష్ఠుడైనా అంధత్వం కారణంగా ధృతరాష్ట్రుడు రాజ్యార్హుడు కాలేకపోయాడు. అతని తమ్ముడు పాండురాజు పట్టాభిషిక్తుడై కురుసామ్రాజ్యాధిపతి అయినప్పటికీ భ్రాతృగౌరవంతో అగ్రజుని సింహాసనాధీశుని చేసి తాను పరిపాలించాడు. దిగ్విజయాలతోను, మృగయావినోదాలతోను తన పరాక్రమాన్ని దశదిశలా చాటి కురుసామ్రాజ్యానికి బలాన్నీ, రక్షణనూ కల్పించాడు. అంగవికలుడైనవానిని సింహాసనం మీద నిలిపినప్పుడు త్రికాలవేదియైన వ్యాసుడు రానున్న ఫలితాలను గ్రహించినప్పటికీ పాండురాజు సహృదయతను గుర్తించినందువల్లా, ప్రభువుగా అతని నిర్ణయంలో ఇతరుల ప్రమేయంగాని, సంప్రదింపుగాని లేనందువల్లా మౌనం వహించాడు. కాలక్రమాన వృద్ధిపొందిన ధృతరాష్ట్రుని పుత్రవ్యామోహాన్ని, దుర్యోధనుని దుశ్చేష్టలను గ్రహించి సమయం వచ్చినప్పుడల్లా వారిని ధర్మమార్గంలోకి మళ్ళించాలని ప్రయత్నించాడు.

పాండురాజు మరణానంతరం పాండవులు హస్తినాపురం చేరినప్పుడు కుంతికి, పుత్రులకు దుఃఖోపశమనం కలిగించిన వ్యాసుడు కురువంశంలో సంభవించబోయే విపరీతాలను దర్శించాడు. భవిష్యత్తులో రానున్న దారుణాలు చూడకముందే సత్యవతి, కోడళ్ళు అంబిక అంబాలికలతో కలసి తపోవనాలకు తరలివెళ్ళటం మంచిదని ఉపదేశిస్తాడు. భగవద్గీతలో వర్ణించిన "దుఃఖమునకు చలించని వాడు, సుఖమునందు స్పృహలేనివాడు, రాగభయ క్రోధములు లేనివాడు, స్థిరమైన బుద్ధిగలవాడు ముని"[47] అనే లక్షణాలకు నిదర్శనం వ్యాసుడు.

---

★ 47.భగవద్గీత 2-56

లక్కయింటి నించి బైటపడి దేశదిమ్మరులై మారు రూపాలతో తిరుగుతున్న పాండవులను కలసి వారిని పాంచాల దేశానికి వెళ్ళమని వ్యాసుడు మార్గోపదేశం చేస్తాడు. అక్కడ ద్రౌపది స్వయంవరానంతరం తల్లిమాటను పాటించి ద్రౌపదిని ఐదుగురు వివాహమాడినా లేక అర్జునుడొక్కడే వివాహమాడినా ధర్మభంగం కలుగుతుందనే సంకటపరిస్థితి కుంతీదేవికి, పాండవులకు ఏర్పడింది.

తల్లి మాట ప్రకారం ద్రౌపదిని ఐదుగురు స్వీకరిస్తే అది లోకాచారానికి విరుద్ధం. లోకాచారాన్ని అనుసరిస్తే వీర్యశుల్క అయిన ద్రౌపదిని మత్స్యయంత్రభేదనం చేసిన అర్జునుడు వివాహమాడాలి. అగ్రజునికన్నా ముందు అనుజుని వివాహం ఆర్యసంస్కృతికి, లోకాచారానికి కూడా భంగం కలిగిస్తుంది. ఈ ధర్మసందేహాన్ని నివృత్తి చేసేందుకు పరాశరాత్మజుడు వారినిచేరి ద్రౌపది పూర్వజన్మను వివరించి ఆజన్మలో ఆమె పొందిన వరం ఈ జన్మలో సిద్ధిస్తున్నదని కనుక ద్రౌపదిని పాండవులైదుగురు వివాహమాడవలసిందిగా ఆదేశిస్తాడు. అయినప్పటికీ ఒక స్త్రీకి బహుభర్తలు వుండటం ధర్మవిరుద్ధమని ద్రుపదుడు సందేహించగా ఈ పాండవులు భిన్నరూపాలుధరించిన అమరేంద్రుని అంశలని, వారి జన్మకు భూలోకంలో ఒక ప్రయోజనం వున్నదని తెలుపుతాడు. భూభార నిర్మూలనమనే ప్రయోజనాన్ని సాధించవలసిన ఇంద్రతేజాన్ని, అందుకు కారణరూపమైన ద్రౌపదిని, ఇంద్రతేజానికి తోడైన విష్ణుస్వరూపాన్ని ఎఱిగిన త్రికాలవేది కృష్ణద్వైపాయనుడు. పాండవులకు, ద్రుపదునికి ధర్మతత్వాన్ని వివరించి జన్మాంతర కర్మలు, నాటి వాసనలు మానవులకు భోగింపవలసివుంటుందనే సత్యాన్ని లోకానికి చాటి చెప్పాడు.

పాంచాల రాజ్యంలో జరిగిన స్వయంవర విశేషాలు, పాండవులు ద్రౌపదిని వివాహమాడిన విషయం విన్నాక ధృతరాష్ట్రుడు భీష్మాదుల బోధలువిని, లోకభీతివలన పాండవులను హస్తినాపురానికి పిలిపిస్తాడు. విదురుడు, ఇతర గురుజనుల ప్రబోధాలను కాదనలేని పరిస్థితిలో పాండవులకు రాజ్యభాగం ఇచ్చేందుకు అంగీకరించి ఖాండవప్రస్థాన్ని పిత్రధనంగా వారికి పంచుతాడు. ఇంద్రప్రస్థనగరాన్ని నిర్మించుకుని ధర్మరాజు రాజ్యాభిషిక్తుడైవుండగా, తమ్ములు నలుగురు దిగ్విజయ యాత్రలు చేసి రాజ్యాన్ని సర్వసంపన్నం చేస్తారు. తండ్రి కోరికమేరకు, పెద్దలప్రోత్సాహంతో, కృష్ణుని సహకారంతో ధర్మరాజు రాజసూయ యాగం జయప్రదంగా పూర్తిచేస్తాడు. మత్సరగ్రస్థుడైన దుర్యోధనుడు ధర్మరాజు వైభవాన్ని చూచి ఓర్వలేక పాండవుల సంపదను, యశస్సును కుటిలోపాయంతో అపహరిస్తాడు.

'పాండవులవలన ఎట్టి కీడును లేదని' 'నీ కొడుకులు సామ్రాజ్యకాంక్షతో వారిరాజ్యాన్ని అపహరించి వారిని తండ్రి రాజ్యభాగాన్ని అనుభవించనీయలేదని' వ్యాసుడు ధృతరాష్ట్రుని నిరంతరం హెచ్చరిస్తూనే వుంటాడు. ధర్మవర్తనులని పాండవులను సమర్థించి వారికి కార్యసిద్ధి మార్గాలను ఉపదేశించటం వ్యాసుని ధర్మదృష్టికి చిహ్నం. పాండవుల అరణ్యవాసకాలంలో వారి

యోగక్షేమ విచారణకు వచ్చి ఏకాంతంలో ధర్మరాజుకు 'ప్రతిస్మృతి' అనే విద్యను ఉపదేశిస్తాడు. ఆ విద్యను అర్జునునకు ఉపదేశించి అతడిని అస్త్రవిద్యాప్రాప్తినికోరి తపస్సుచేయుటకు పంపమని ధర్మరాజును ఆదేశిస్తాడు. ధర్మ తత్త్వజ్ఞుడైన వ్యాసుడు ధర్మవర్తనుడైన ధర్మరాజుకు మంత్రోపదేశం చేసి, పితృస్థానం వహించి అర్జునునికి ఉపదేశించమని ఆదేశించటంలో ఒక అంతరార్థం ఉంది. అస్త్ర ప్రాప్తి అర్జునునిదైనా ఆ లబ్ధివలన ధర్మరాజు ద్వారా ధర్మపాలన కొనసాగాలని తెలిపిన వ్యాసుడు ముందుగా ధర్మరాజుకు ఉపదేశంచేసి ధర్మవిజయానికి మొదటినుంచి తోడ్పడ్డాడు

"ఏనిదియంతయు నెఱుగుదు" నని దుఃఖార్తుడైన ధృతరాష్ట్రునితో అన్నప్పటికీ, కురుక్షేత్రయుద్ధం 'దేవకృతంబని, ప్రాప్తకాలం బై వచ్చిన భూప్రజాక్షయంబని' తెలిసినప్పటికీ మానవ ప్రయత్నాన్ని వ్యాసుడు ఎన్నడూ ఉపేక్షించలేదు. యుద్ధానికి ముందే శ్రీకృష్ణుని ప్రభావాన్ని అతడి ధర్మరక్షణ ప్రయత్నాన్ని వివరించి ధార్మికులైన పాండవులకు దైవసహాయం వుంటుందని కౌరవులను హెచ్చరిస్తాడు. ధృతరాష్ట్రుని మనసులోని ఆలోచనలను గ్రహించి జ్ఞాని, ఉభయ పక్షాలకు మిత్రుడు, శ్రేయోభిలాషి అయిన సంజయుని ధర్మరాజువద్దకు దూతగా పంపమని కర్తవ్యాన్ని బోధిస్తాడు. అన్నీ తెలిసినవాడు చేసిన ప్రయత్నం పైకి వృథాప్రయాసగా కన్పించినా ఫలితాన్ని గురించిన ఉద్వేగం విడిచి మానవప్రయత్నాన్ని కొనసాగించాలనే నిశ్చలబుద్ధిని వ్యాసుడు ప్రదర్శించాడు.

యుద్ధం ఇకతప్పదని తెలిసిన తరువాత కృష్ణద్వైపాయనుడు రాగల ఫలితాన్ని ఎదుర్కొనేందుకు సిద్ధంగావుండమని ధృతరాష్ట్రుని హెచ్చరిస్తాడు. 'యుద్ధవిశేషాలను ప్రత్యక్షంగా చూడదలచావా' అని అతనిని ప్రశ్నిస్తాడు. ఈ భయంకర యుద్ధాన్ని చూచే సామర్థ్యం తనకు లేదని, కానీ విశేషాలను వివరంగా వినదలచానని అటువంటి అవకాశాన్ని అనుగ్రహించమని ధృతరాష్ట్రుడు ప్రార్థిస్తాడు. అప్పుడు వ్యాసుడు ధృతరాష్ట్రునికి ప్రియమిత్రుడు, పరమధార్మికుడు అయిన సంజయునికి దూరదృష్టి, దూరశ్రవణాదిశక్తులను అనుగ్రహిస్తాడు. ప్రత్యక్షంగాను, పరోక్షంగాను జరిగిన సంఘటనలను, యుద్ధవీరుల హృదయగత భావాలను స్పష్టంగా తెలుసుకోగలిగిన సామర్థ్యాన్ని సంజయునికి ప్రసాదిస్తాడు. సూక్ష్మరూపియై యుద్ధభూమిలో చరించి శీఘ్రగమనం ద్వారా ధృతరాష్ట్రుని చేరి ఏదినం వార్తలు ఆదినం అతనికి తెలియజేయమని ఆదేశిస్తాడు

విషయ వివరణలో యథాతథంగా జరిగిన విషయం తెలుసుకొనటమేతప్ప ఏ పక్షం వహించవలసిన అవసరం లేదు. ధర్మవేత్త అయిన వ్యాసుని ఆదేశంలోని అంతరార్థాన్ని ధార్మికుడైన సంజయుడు గ్రహించాడు. యుద్ధరంగంలోని అనర్థాలనువిని ధృతరాష్ట్రుడు శోకించినప్పుడల్లా 'అతని పుత్రవ్యామోహఫలితమే ఇది' అని సంజయుడు అనుక్షణం జ్ఞప్తిచేస్తాడు.

అతిసులభంగా భీష్మవిదురులను పాండవపక్షపాతులని విమర్శించిన దుర్యోధనుడు వ్యాసుని సమక్షంలో మాత్రం తన దర్పాన్ని ప్రదర్శించడు. శ్రీకృష్ణుని కూడా ఎదిరించగల ధర్మవ్యతిరేకి అయిన దుర్యోధనుడు వ్యాసుని ఎదుట అధర్మవర్తనకు, పరుష భాషలకు సంకోచించేవాడు. తమ వంశవర్ధనుడని ఆ మహర్షియందు కురువంశీయులకు గల గౌరవమే దుర్యోధనుని ప్రవర్తనకు కారణం

యుద్ధానంతరం పుత్రశోకార్తి అయిన గాంధారి తనకు నమస్కరింపవచ్చిన ధర్మరాజును శపింపబోయింది. ఆమెలోని మాతృత్వం, స్త్రీ సహజమైన దుఃఖోద్వేగం తాత్కాలికంగా ఆమె ధార్మిక బుద్ధిని మరుగుపరచాయి. వ్యాసుడు గాంధారిని ఓదార్చి పాండవాగ్రజునిపై అలుకమానమని ఆమెను శాపప్రయత్నం నుంచి మరలింపజేస్తాడు. అంతేకాక నీ కుమారుడు యుద్ధానికి బయలుదేరుతూ "తల్లీ దీవించమని" రాగా, "కుమారా ఎక్కడ ధర్మంవుంటుందో అక్కడే జయం కలుగుతుందని" పలికిన నీ ధర్మబుద్ధి సాటిలేనిదని ఆమెను ప్రశంసిస్తాడు. ధర్మపరులైన పాండుపుత్రులను అసూయలేని బుద్ధితో చూడమని చెప్పి మున్ముందు పాండవులే మీకు ఆధారం కాగలరని అన్యాపదేశంగా హెచ్చరిస్తాడు. 'నీ దీవెన ఫలించింది. నీ వాక్కు సత్యవాక్కు' అని పలికి ఆమెను శాంతింపజేస్తాడు. ధర్మరాజు విషయంలో ఇంతచేసిన వ్యాసుడు గాంధారి శ్రీకృష్ణుని శపించినప్పుడు మాత్రం మారుమాట్లాడడు. యుద్ధం ఆపనందుకు, జనక్షయం అరికట్టనందుకు గాంధారి కృష్ణునిదే బాధ్యత అని ఆగ్రహించి యాదవవంశం కూడా ఈ విధంగానే పరస్పరకలహం కారణంగా వాశనమౌతుందని శపిస్తుంది. మునుల శాపకారణంగా యాదవ వంశం నిర్మూలం కానున్నదనే విషయాన్ని ముందే ఎఱిగిన త్రికాలవేది సాత్యవతేయుడు. విధి నిర్ణయాన్ని గుర్తించిన ధర్మవేత్తవ్యాసుడు, ధర్మ స్వరూపుడు కృష్ణుడు, ఇద్దరూ గాంధారి శాపాన్ని ఆపేందుకు ప్రయత్నించలేదు. శ్రీకృష్ణుడు మాత్రం ఆమెతో 'నీ శాపం చర్విత చరణమే అయింద'ని అంటాడు.

భౌతిక దృష్టితో చూచినప్పుడు వ్యాసుడు మానవ స్వభావాన్ని సంపూర్ణంగా ఎఱిగిన ప్రతిభాశాలిగా కన్పిస్తాడు. దుఃఖోద్వేగంతో దురపిల్లుతున్న గాంధారి దుఃఖాన్ని బహిర్గతం చేయవలసిన అవసరంవుందని అతడు గ్రహించాడు. కురువంశ రాజ్యరక్షకుడు కావలసిన ధర్మరాజుమీద ఆమె క్రోధం ప్రసరించకుండా అడ్డుకున్నాడు. అది కృష్ణుని పరంగా బయటపడిన తరువాత ఆమె ఉద్వేగం తగ్గుతుందని గుర్తించాడు. తగ్గటం కూడా గమనించాడు. కృష్ణుని శపించిన తరువాత ఆమె ఆవేశం చల్లారి శాంతించినందువలననే పాండవులను చేరదీయగలిగింది. ఆ తరువాత ద్రౌపదిని చూడగానే ఆమెకూ తనకూ ఒకే విధంగా గర్భశోకం కలిగిందని తన దుఃఖాన్ని ఆమెతో పంచుకుంది.

ధర్మపరులైన పాండవులవలన ఒక్కకీడును లేదని కౌరవుల దురాశయే ఈ ప్రజాక్షయానికి కారణమైందని' పలికిన సత్యవాక్పాలకుడు సాత్యవతేయుడు. ధార్మికదృష్టితప్ప కురువంశాభి వృద్ధికిగాని, కురువంశ నాశనానికిగాని ఎలాంటి వ్యామోహత్వాన్ని పొందనివాడు. సమయానుకూలంగా కురువంశాన్ని కాపాడి వారిని ధర్మపరులుగా ప్రబోధించటం మాత్రమే తన కర్తవ్యంగా భావించిన మునిశ్రేష్ఠుడు.

భీష్ముని మరణానంతరం కృష్ణునితో కలసి ధర్మరాజును ఓదార్చి అతడి అనుమతితో తపోనిష్ఠుడై హిమవత్పర్వతానికి తరలిపోవటంతో కృష్ణద్వైపాయనుని ధర్మప్రబోధ కర్తవ్యం నెరవేరింది. ఆ తరువాత అశ్వత్థామ పాండవ వంశంపై అస్త్రప్రయోగం చేయగా అర్జున అశ్వత్థామల యుద్ధాన్ని నివారించి వారిని శాంతింపజేస్తాడు. అశ్వత్థామ శిరోభూషణాన్ని గ్రహించి అతడిని నిర్వీర్యుని చేయటమే తగిన పరాభవం అని అర్జునునికి మార్గోపదేశం చేస్తాడు. ఆ పిమ్మట ధర్మరాజుచేత అశ్వమేధయాగాన్ని నిర్వహింపజేసి అతడి ఆధిపత్యాన్ని ప్రతిష్ఠింపజేస్తాడు. ఇంతటితో కురువంశానికి సంబంధించి ధర్మస్వరూపుడైన శ్రీకృష్ణునికి, ధర్మతత్త్వవేత్త అయిన వ్యాసునికి ధర్మప్రతిష్ఠాపన కార్యం లేదా కర్తవ్య పాలన పూర్తిగా నెఱవేరింది.

అనంతరం వ్యాసుడు వానప్రస్థాశ్రమవాసులైన గాంధారీ ధృతరాష్ట్రులను, కుంతీదేవిని చూచేందుకై ఒక పర్యాయం అరణ్యానికి వస్తాడు. అక్కడ వారి శారీరక, మానసిక స్థితులను గురించి పరామర్శిస్తాడు. మానవసహజమైన వైరబుద్ధి నిర్మూలింపదగినదని, కారణాంతరాలవలన తలెత్తిన వైరాన్ని, క్రోధాన్ని విసర్జించి మనస్సును వాక్కును ఏకీకృతం చేసినప్పుడే పరమోత్కృష్టమైన ధర్మసాధన కాగలదని ధర్మసాధనమార్గాన్ని అత్యంతసులభంగా బోధించిన మహామనీషి వ్యాసమహర్షి. విదురుని దేహవిసర్జనను గ్రహించి విదురతేజం ధర్మరాజులో లీనమైనదని, వారిద్దరు ధర్మదేవత అంశలని ధృతరాష్ట్రాదులకు తెలిపిన ద్రష్ట.

జయకావ్యం ద్వారా ధర్మప్రబోధానికి పూనుకొనిన వ్యాసుని ధర్మప్రచార కార్యం అభిమన్యుపౌత్రుడైన జనమేజయుని సత్రయాగ కాలంనాటికి సంపూర్ణమైంది. జయకావ్యంలో జయం పాండవులకుగాని, శ్రీకృష్ణునకుగాని సంబంధించినదికాదని కేవలం ధర్మవిజయమే జయమనే సత్యాన్ని ఎలుగెత్తిచాటాడు విష్వంశసంభూతుడై స్థితప్రజ్ఞుడైన దేహధారిగా సత్యవతిగర్భాన జన్మించిన వేదవ్యాసముని ధర్మతత్త్వాన్ని ప్రబోధించి ధర్మాన్ని నెలకొల్పేందుకు పూనుకొనిన సాధ్యధర్మవర్తనులలో మహామహిమాన్వితుడు.

## ధర్మప్రతిజ్ఞా బద్ధకంకణుడు భీష్ముడు

సర్వవేదాంతవేత్త, ధనుర్విద్యా విశారదుడు, సకల ధర్మవేత్త, ధర్మసూక్ష్మ విచక్షణాశాలి భీష్ముడని మహాభారతంలో ఆమూలాగ్రం వెల్లడౌతుంది. సాక్షాత్తు శ్రీ కృష్ణుడే భీష్ముని 'గంగాగర్భాన జన్మించినవాడు, పరశురాముని ప్రియశిష్యుడు, అంబకారణంగా గురువుతోనే ఇరవైమూడు రోజులు వెనుదీయక యుద్ధంచేసినవాడు, కాశీకన్యలకారణంగా అనేకమంది రాజులను పోరులో జయించినవాడు' అని ప్రస్తుతించాడు. అటువంటి భీష్ముడు 'నన్ను ఆత్మయందు స్వీకరించినందువలన నా మనసు అతని పరమైనది' అని కృష్ణుడు, 'నీ వెవరిని గురించి ధ్యానిస్తున్నావని' అడిగిన ధర్మరాజుకు సమాధానం చెప్తారు. ధర్మస్వరూపుడైన కృష్ణుడు, ధర్మవేత్త అయిన భీష్ముడు - ఈ ఇద్దరి ఆత్మలు ఏకమైనిష్ఠమై నిశ్చల సమాధిని పొందినట్లుగా కృష్ణుని మాటలు ఋజువుచేస్తున్నాయి.

అష్టవసువులలో ఒకడైన ప్రభాసుడు వశిష్ఠుని శాపకారణంగా మర్త్యలోకంలో చిరకాలం జీవించవలసిన స్థితి కలిగింది. ప్రభాసుని భార్య ప్రేరణవలన అష్టవసువులుఏకమై వశిష్ఠుని హోమధేనువును అపహరించగా వారిని మర్త్యయోనియందు జన్మించమని వశిష్ఠుడు శపిస్తాడు. వారు శాపానికి భయపడి ప్రార్థించగా, భార్య కోర్కెతీర్చేందుకు మిగిలిన వారిని ప్రేరేపించిన ప్రభాసుడు మాత్రం చిరకాలం భూలోకవాసియై, స్త్రీ సాంగత్యానికి దూరమై జీవించాలని, వశిష్ఠుడు నిర్దేశిస్తాడు. మిగిలిన వారు జన్మించిన వెంటనే దేహత్యాగంచేసి యథాస్థానాన్ని పొందగలరని అనుగ్రహిస్తాడు. ఆ అష్టమవసువు ప్రభాసుడే గంగాశంతనుల అష్టమ పుత్రుడై దేవవ్రతనామంతో వర్థిల్లిన భీష్ముడు. మిగిలిన ఏడుగురు గంగాశంతనుల గర్భాన జన్మించి గంగచేత నీటిపాలైన శిశువులు. దేవవ్రతుడు పరశురాముని ప్రియశిష్యుడై ధనుర్విద్యావిశారదుడై తండ్రినిచేరి యౌవరాజ్య పట్టాభిషిక్తుడౌతాడు. తండ్రి సుఖంకోరి తాను రాజ్యాన్ని త్యజించి బ్రహ్మచర్యదీక్షను స్వీకరిస్తాడు. దాశరాజు కోరికమేరకు తాను సింహాసనాన్ని వదులుకుంటానని, భవిష్యత్తులో తన సంతతికూడా రాజ్యాన్ని ఆశించకుండా ఉండేందుకు తాను అవివాహితుడుగా ఉండిపోతానని ప్రతిజ్ఞ చేస్తాడు. సత్యవతీ పుత్రులకే సామ్రాజ్యాధికారం సంక్రమించేందుకు తన జీవితాన్ని సమర్పించగలనని చేసిన ప్రతిజ్ఞలకు బద్ధుడై కురుసామ్రాజ్యరక్షణకే జీవితమంతా పాటుపడ్డాడు యువకుడైన దేవవ్రతుని పితృభక్తికి, త్యాగబుద్ధికి సంతోషించిన 'సకలభువనాలు అతడిని భీషణప్రతిజ్ఞాబద్ధుడైన భీష్మునిగా ప్రస్తుతించాయి. నాటినుంచి దేవవ్రతుడు భీష్మనామంతోనే ప్రసిద్ధుడైనాడు. ఆజన్మాంతం కురువంశ రక్షణకోసం ప్రయత్నించిన కర్తవ్యపరాయణుడు. తాను చేసిన ప్రతిజ్ఞాబంధం తప్ప 'స్వ'(నాది) అనే మాటలేని త్యాగధనుడు భీష్ముడు.

శంతనుని మరణానంతరం భీష్ముడు సత్యవతీ పుత్రులైన చిత్రాంగద విచిత్రవీర్యులను ఒకరివెనుక ఒకరిని పట్టాభిషిక్తులను చేస్తాడు. కాని విధివశాత్తు చిత్రాంగదుడు వివాహం కాకముందు, విచిత్రవీర్యుడు కాశీరాజు పుత్రికలైన అంబిక, అంబాలికలను వివాహమాడిన తరువాత అకాలమరణం పాలౌతారు. పుత్రుల మరణానంతరం సత్యవతీదేవి కురురాజ్యాన్ని అనాథగా వదలవద్దని వంశాన్ని నిర్వంశం కానీయవద్దని భీష్ముని కోరుతుంది. అతడు చేసిన ప్రతిజ్ఞలు తమ్ముల మరణంతో నిష్ప్రయోజనమయ్యాయని కనుక వాటిని వదలినా అతడికి ప్రతిజ్ఞాభంగం జరగదని అనేక విధాల నచ్చజెప్పచూస్తుంది. ప్రతిజ్ఞాబద్ధుడైన భీష్ముడు తాను పంచభూతాల సాక్షిగా పలికిన వాక్కులు అసత్యాలు కానేరవని తల్లికోరికను సభక్తిపూర్వకంగా తిరస్కరిస్తాడు. కాని సత్యవతి అంతటితో ఊరుకోలేదు. రాజ్యభారం వహించకపోయినా అనాటి సంఘ మర్యాదననుసరించి దేవరన్యాయంవలన విచిత్రవీర్యుని భార్యలకు సంతాన ప్రాప్తిని కలిగించమని అర్థిస్తుంది. బ్రహ్మచర్యదీక్ష ప్రతిజ్ఞ కారణంగా తల్లికోరిన ఈ కోరికను కూడా తిరస్కరించిన ధర్మతత్త్వవేత్త భీష్ముడు. ఆ తరువాత వ్యాసమహర్షి కటాక్షంవలన జన్మించిన ధృతరాష్ట్రపాండురాజుల పోషకుడుగాను, కురువంశ సామ్రాజ్య రక్షకుడుగాను మాత్రమే వ్యవహరించిన కర్తవ్యదీక్షా పరాయణుడు.

సుఖదుఃఖరాగద్వేషాది ద్వంద్వాలకు అతీతమైనవాడే స్థితప్రజ్ఞుడని భగవద్గీత వర్ణించింది. ఈ స్థిత ప్రజ్ఞత్వం భీష్మునిలో సహజలక్షణంగా భాసించింది. ఆత్మానంద ఆత్మజ్ఞానాలను నిర్మోహత్వం వలన, ధార్మికవర్తన చేత మాత్రమే పొందగలరు. ఆత్మను ఆత్మయందే లయింపచేయటం అంటే జీవాత్మను పరమాత్మయందు లగ్నంచేసి వుంచటం. ఆవిధంగా ఆత్మను ఆత్మయందే నిలిపి సంతుష్టాంతరంగుడైన స్థితప్రజ్ఞుడు భీష్ముడు. మనోగతములైన సమస్త కోరికలను, భావాలను త్యజింపగలిగిన భీష్మునికి తండ్రి శంతనుడు ఇచ్ఛామరణ వరాన్ని ప్రసాదిస్తాడు. అతడి నిస్సంగత్వం అతనిని అసామాన్య కర్తవ్య పరాయణునిగా నిలిపింది. 'సత్యము, తపము, దానము ధనుర్వేదాది సకలవిద్యలలో ప్రజ్ఞ, వీనినిమించిన ధర్మపరాయణత్వం ధర్మసూక్ష్మగ్రహణ పారీణత భీష్ముడు మానవలోకంలో అశేషమైన యశస్సును ఆర్జించేందుకు తోడ్పడిన సహజగుణాలని, భీష్మునివంటి వ్యక్తి ఈ లోకంలో మళ్ళీ జన్మించడని సాక్షాత్తు శ్రీకృష్ణుడే అతనిని కొనియాడాడు.

కాశీరాజ పుత్రి అంబ కారణంగా తన ప్రతిజ్ఞకు భంగంవాటిల్లే ప్రమాదం వచ్చినప్పుడు భీష్ముడు తన గురువైన భార్గవరామునే ఎదిరించి పోరాడిన ధీశాలి. పాండురాజు భ్రాతృగౌరవంతో ధృతరాష్ట్రుని సింహాసనం మీద నిలిపితే విదురుని మంత్రాంగం తోడుగా అంధరాజును, రాజ్యాన్ని సంరక్షించిన పరాక్రమశాలి, కురువృద్ధుగా, ధర్మవేత్తగా పాండవులపట్ల కౌరవుల దురన్యాయాలను నిరసించి ధర్మసాధనలోనే జీవితాన్ని వినియోగించిన మహానుభావుడు.

పాండురాజు మరణానంతరం హస్తినాపురం చేరిన పాండవులను చేరదీసి వారికి ధర్మబద్ధమైన రాజ్యభాగం పంచవలసినదని ధృతరాష్ట్రుని నిరంతరం హెచ్చరించిన ధర్మ పరాయణుడు. దుర్యోధనుడు చేస్తున్న అధర్మాలను భీష్మవిదురులు ఎప్పటికప్పుడు గుర్తిస్తూనే వచ్చారు కౌరవ సామ్రాజ్యాధీశుని కుమారుడుగా సర్వాధికారాలను అనుభవిస్తున్న దుర్యోధనునికి, తనకన్నా పెద్దవాడు, ధర్మబద్ధంగా రాజ్యాభిషిక్తుడైన పాండురాజు వారసుడు అయిన ధర్మరాజు సామ్రాజ్యానికి ఉత్తరాధికారి కాగలడనే ఆలోచనే దుస్సహమైంది. భీష్మ విదురులు ధర్మపక్షపాతులని కూడా అతడెఱుగును. గాంధారీపుత్రుల ద్వారా వంశనాశనం జరిగే ప్రమాదం పొంచివుందని తెలిసినప్పటికీ విదురునితో కలసి భీష్ముడు అటువంటి ప్రళయం జరుగకుండా ఉండేందుకు చివరివరకు శాయశక్తులా పాటుపడ్డాడు.

జరుగుతున్న సంఘటనలన్నింటిని నిర్వికారంగా చూస్తున్నప్పటికీ కుటుంబసభ్యుడు, వంశానికి పెద్దవాడు అయినందువల్ల భీష్ముని ధర్మమార్గంలో అనేక సంఘర్షణలు, సందిగ్ధ పరిస్థితులు ఎదురయ్యాయి. శాశ్వత ధర్మ సాధనకు, విశేషధర్మమైన కర్తవ్య నిర్వహణకు మధ్య భీష్ముడు నలిగిపోవలసి వచ్చింది. అటువంటి పరిస్థితులలో ధర్మతత్వాన్ని గుర్తించి, ధర్మసూక్ష్మాన్ని గ్రహించి సమయానుకూలంగా ప్రవర్తించాడు. సామాన్య దృష్టికి ధర్మం అధర్మంగాను అధర్మం ధర్మంగాను కన్పించినప్పటికీ సాధ్యధర్మానువర్తి అయిన భీష్ముడు ధర్మసూక్ష్మాన్ని వితర్కించి శాశ్వతపథానికి చేర్చేధర్మాన్ని మాత్రమే అనుసరించాడు. కనుకనే పట్టాభిషిక్తుడైన ధర్మరాజును ధర్మస్వరూపం తెలుసుకునేందుకు భీష్ముని ఆశ్రయించమని కృష్ణుడు నిర్దేశించాడు. భీష్ముని ధార్మికబుద్ధిపట్ల, ధర్మనిర్ణయ విచక్షణలో కృష్ణునికి గల అభిమానం, గౌరవం, విశ్వాసం నిరూపించే సన్నివేశం ఇది. అర్జునునకు తానే స్వయంగా భగవద్గీతను బోధించిన శ్రీకృష్ణుడు సాక్షాత్తు ధర్ముని అంశ అయిన ధర్మరాజుకు ధర్మతత్వ ప్రబోధం తానే చేయకపోవటానికి కారణాలు రెండు. ఒకటి లౌకికమైనది రెండవది అలౌకికము పరమోత్కృష్టము అయినది.

లౌకికమైన కారణం చూచినప్పుడు - వయస్సులో ధర్మరాజు కన్నా కృష్ణుడు చిన్నవాడు. చిన్నవారు పెద్దవారికి అందులోనూ సామ్రాజ్యాధీశుడైన ప్రభువుకు ధర్మబోధచేయటం సమంజసంకాదు. కృష్ణుడు ఎన్నడూ అనుచితమైన పనిచేయడు. అంతేకాక అనేక పర్యాయాలు కృష్ణుడు ధర్మమార్గవర్తనుడైన యుధిష్ఠిరుని ఆజ్ఞకు బద్ధుడనై వుండటం నా వ్రతమని తానే స్వయంగా చెప్పుకున్నాడు. కురు వంశ వృద్ధుడు, సకల ధర్మాధర్మ విచక్షణ వేత్త అయిన భీష్ముడు మనుమనికి ధర్మబోధ చేయటం యుక్తమని కృష్ణుడు భావించాడు. భీష్మ ప్రబోధిత ధర్మం ఇహపరసాధనమని కృష్ణుడు వెల్లడించటం భీష్ముని ధార్మికతకు గొప్ప తార్కాణం.

ఇక రెండవ కారణం లౌకికధర్మానికన్నా అతీతమైనది. సిద్ధసాధ్యధర్మాలలో సిద్ధస్వరూపుడు శ్రీకృష్ణుడు. ధర్మసాధన మార్గంలో ఉత్తమ సాధకుడు ధర్మరాజుకాగా సాధ్యధర్మవేత్త భీష్ముడు. కఠోరమైన నియమనిష్ఠలతో ధర్మాచరణ ద్వారా మోక్షమార్గాన్ని అన్వేషించేవారు తాము ద్వంద్వాతీతులై ఆశ్రితులకు ధర్మబోధ చేసేవారు సాధ్యధర్మపరాయణులు. వీరు సిద్ధధర్మ స్వరూపుడైన అవతార పురుషునకు సన్నిహితులై, ద్రష్టలై లోకాన్ని పరిశీలిస్తుంటారు. అటువంటి ఉత్తమ సాధ్యధర్మవర్తనుడు భీష్ముడని, ధర్మబోధకు కృష్ణుడు భీష్ముని నియోగించాడు.

మహాభారతంలో సకలధర్మ వివరణలు విశ్లేషణలతో కూడివున్నది శాంతిపర్వం. మహాభారతం ద్వారా వ్యాసమహర్షి మానవాళికి బోధించదలచిన శాశ్వత విశేషధర్మాలన్నిటినీ ధర్మతత్త్వవేత్త అయిన భీష్ముని ద్వారా ధర్మరాజుకు బోధించాడు. ఈ ధర్మబోధ యుధిష్ఠిరున కొక్కనికి మాత్రమే సంబంధించినదికాదు. సమస్తమానవ సమాజానికీ క్షేమకరమైన, శ్రేయోదాయకమైన భౌతిక, ఆధ్యాత్మిక ధర్మ వివరణ భీష్ముని మూలంగా కృష్ణద్వైపాయనుడు ప్రవచించాడు. సకల ధర్మాలను తెలిసిన ఉత్తమ సాధ్యధర్మమార్గానుసారి, భోగంలో త్యాగాన్ని, త్యాగంలో ఔన్నత్యాన్ని తన జీవితం ద్వారా నిరూపించిన వ్యక్తి, మహాపరాక్రమశాలి అయిన భీష్ముడే ధర్మబోధకు అర్హుడు. 'భూత భవిష్యద్వర్తమానవేది సర్వవిద్యాధారభూతుండు' అని భీష్ముని శ్రీకృష్ణుడు ప్రస్తుతించాడు.

పాండురాజు సౌజన్యం, భ్రాతృగౌరవంవలన వారి తరంలో రాజసింహాసనం ఎవరు అధిష్ఠించాలనే ప్రశ్నగాని, ఎటువంటి వైషమ్యాలుగాని తలెత్తలేదు. తరువాత తరంలో జ్ఞాతివైరం రేగింది. భీష్ముని ధర్మపాలనలో సంఘర్షణ తలెత్తింది. కురురాజ్యానికి పాండవులు ధర్మబద్ధులైన వారసులు. కనీసం తండ్రి భాగంగా కొంత రాజ్యభాగమైనా వారికిచ్చేందుకు దుర్యోధనుడు అంగీకరించలేదు. భీష్ముని ధర్మానుసరణలో ఈ జ్ఞాతివైరంవలన రెండు మార్గాలలో ఏది శ్రేయోదాయకం అనే ప్రశ్న బయలుదేరింది. కురు సామ్రాజ్య రక్షణా? లేక ధార్మికులైన పాండవుల మార్గాన్ని అనుసరించుటా? అనే రెండు భిన్న మార్గాలు భీష్ముని సంఘర్షణకు కారణమైనాయి.

'ధ్రియతేవా జనైరితి' - జనులను నడిపించునది ధర్మం - పాండవులను ఆ ధర్మమే నడిపించగలదని, ధర్మవ్యతిరేక మార్గంలో సాగిపోదలచిన కౌరవులను ధర్మమార్గంలోకి తేవలసిన కర్తవ్యం తనమీద ఉన్నదని భీష్ముడు భావించాడు అదీగాక సకలచరాచర సృష్టి సాక్షిగా కురుసామ్రాజ్యాన్ని రక్షిస్తానని ప్రతిజ్ఞ చేసినందువలన కూడా భీష్ముడు కౌరవుల పక్షంలోనే ఉండవలసి వచ్చింది.

మహాభారతంలో రెండు ప్రధాన ఘట్టాలలో భీష్ముని ధర్మసూక్ష్మగ్రహణపారీణత వెల్లడౌతుంది. మొదటిది సభాపర్వంలో - జూదంలో ఒడ్డిన పాండవ పత్ని ద్రౌపదిని పరాభవించినప్పుడు భీష్ముని

మౌనం ధర్మమా? రెండవది - యుద్ధరంగంలో ధర్మరాజుకు తనను పడగొట్టేమార్గం ఎతిగించటం భావ్యమా? ఈ రెండు సందర్భాలలోనూ భీష్ముడు ధర్మంతప్పి ప్రవర్తించాడనే విమర్శవుంది. ద్రౌపదీ మానభంగ సమయంలో కులవృద్ధుగా ఆ సభలో జరుగుతున్న అధర్మాన్ని ఎదిరించలేకపోవటానికి కారణం ధృతరాష్ట్రుడు తనను బహిష్కరించగలడేమోననే సందేహం అని కొందరు వాదిస్తారు. రెండవ సందర్భంలో భీష్ముడు పాండవ పక్షపాతి కావటం చేతనే పాండవులకు జయం కలగాలనే కోరికతో ధర్మరాజుకు తనను జయించేమార్గం చెప్పి యుద్ధధర్మాన్ని ఉల్లంఘించాడని, ప్రభుద్రోహం చేశాడని మరికొందరు అభిప్రాయపడ్డారు.

సకల ధర్మతత్త్వవేత్త అయిన భీష్ముడు అధర్మానికి పూనుకున్నాడనిగాని, ప్రభువుల అధికారానికి భయపడి అధర్మాన్ని సహించాడనిగాని భావించటం సమంజసంకాదు. అటువంటి వాదాలు సత్యదూరాలు, ధర్మసూక్ష్మాన్ని గ్రహించినందువల్లనే ఈ రెండు సందర్భాలలోను భీష్ముడు ధర్మమార్గంలోనే వర్తించాడని సంస్కృతమహాభారతం స్పష్టంగా చెప్పింది.

**ఆంధ్రమహాభారతం** - ద్రౌపదిని పణంగా పెట్టినప్పుడూ, కురుసభలో ఆమెకు అవమానం జరగినప్పుడూ ద్రోణాచార్యకృప భీష్ములు ఉద్వేగులై చెమటలుకారగా వృద్ధులైనతాము నిశ్శబ్దంగా ముఖాలు దించుకునివున్నారని వర్ణించింది. పాంచాలి తాను ధర్మవిజితనా, అధర్మవిజితనా అని ప్రశ్నించినప్పుడు ధర్మసందేహంతీర్చని సజ్జనులైన సభ్యులకు అసత్యదోషం అంటుకుంటుందని ఉపాఖ్యానసహితంగా విదురుడు చెప్పినట్లు వివరించింది. **సంస్కృత మహాభారతం** ఈ ఘట్టాన్ని మరింత విపులంగా చర్చించి భీష్ముని ధర్మసూక్ష్మగ్రహణ పాండిత్యాన్ని స్పష్టంగా చూపించింది.

**సంస్కృత మహాభారతం** - సభాపర్వంలో ద్రౌపదితాను ధర్మవిజితనా అధర్మవిజితనా అని ప్రశ్నించినప్పుడు భీష్ముడు "అమ్మాయీ! ధర్మం బహు సూక్ష్మమయినది. ధర్మనిర్ణయంలో మహామహా మేధావులే భయపడుతుంటారు. అయితే ప్రస్తుతం బలవంతుల ఆచరణే ధర్మంగా పరిణమిస్తున్నది. బలహీనుడు ధర్మనిర్ణయం చేసినా చెల్లదు. బలవంతులు దాన్నిత్రోసిపారేయగలరు. వారిబలం ధర్మాన్ని నిర్లక్ష్యం చేయడానికి ఎంతమాత్రం సంకోచించదు. ధర్మస్వరూపమే సూక్ష్మమైనది, రహస్యమైనది. కనుకనే ధర్మనిర్ణయం సామాన్యం కాదు. అందువల్లనే నీ ప్రశ్నకు జవాబు ఇవ్వలేకపోతున్నాను"[48] అని అప్పుడు ఆ సభలో కౌరవబలమే రాజ్యం చేస్తున్నదని అక్కడ ధర్మవిచక్షణకు తావులేదని స్పష్టంగా చెప్పారు.

**ఆంధ్రమహాభారతంలో** నన్నయ ఈ ఘట్టంలో 'అవ్వా నీ ప్రశ్నకు సమాధానం ఆ యుధిష్ఠిరుడు చెప్పవలెను. అట్లుకానినాడు ధర్మసూక్ష్మతనెఱుగుట ఎవరికీ సాధ్యంకాదు. దీని ఫలాన్ని వేగంగానే

---

★ 48. సం.మ. భార సభా 69-15,16 - వ్యాఖ్యానం పురాణపండ రామ్మూర్తి

ఈ కురుకుల దుష్టులు అనుభవింతురని ధర్మసూక్ష్మవివరణ అతి క్లిష్టమైనదని చెప్పినట్లుమాత్రం వర్ణించారు. బలవంతులదే ధర్మమని చెప్పిన సంస్కృతవాక్యాన్ని గూఢార్థంతో యుధిష్ఠిరుడు మాత్రమే ధర్మసూక్ష్మాన్ని ఎఱుగునని చెప్పటంలో ప్రస్తుతం ధనబలంముందు ధర్మం బలహీనమయిందనే వ్యాసహృదయాన్ని నన్నయ స్ఫురింపచేశాడు. ఇంతేకాక శాంతిపర్వంలో భీష్ముడు ధర్మరాజుకు ధర్మబోధచేస్తున్న సమయంలో 'భోగములు అనుభవించేవారికి సుఖములు వశములో ఉన్నట్లే బలవంతుల వశములోనే ధర్మముండును. ధర్మమిది అని బలవంతులు సమర్థించగలరు. వారికేదియును అసాధ్యంకాదు. వారు చేసిన ప్రతిపనీ మంచిదే' అని బలవంతులు ధర్మాన్ని (తాత్కాలికంగానైనా) తమకు అనుగుణంగా మార్చుకోగలరని అంటాడు.

ఇదేగాక కౌరవసభలో బలగర్వితుడైన దుర్యోధనుని సమక్షంలో ధర్మనిర్ణయంచేసి నగుబాటుకావటం ఇష్టంలేక వివేకవంతుడైన భీష్ముడు మిన్నకున్నాడు. ప్రభువైన ధృతరాష్ట్రుని సన్నిధిలో కేవలం సామ్రాజ్యరక్షకుడైన భీష్ముడు ధర్మనిర్ణయం చేస్తే లోకధర్మాన్ని బట్టి అది ప్రభుధిక్కారం కాగలదు.

ఈ కారణాలమూలంగా భీష్ముడు ద్రౌపది ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పకుండా ధర్మసూక్ష్మాన్ని మాత్రం వివరించి ఊరుకున్నాడు. ఆంధ్ర మహాభారతంలో నన్నయ పాలితధర్మాన్ని అనుసరించి సభామర్యాదను మన్నించి భీష్ముడు మౌనం వహించినట్లు, ధృతరాష్ట్రునికి మంత్రి, సహచరుడు అయిన విదురుడు మాత్రమే సుదీర్ఘమైన ఉపన్యాసం చేసినట్లు వర్ణించాడు. బలవంతుల సమక్షంలో అధర్మాన్ని ఎదిరించినా, ధర్మనిర్ణయం చేసినా అది చెల్లుబాటుకాదు సరికదా అవమానం ఎదురౌతుందని ఆ సభలోనే, వికర్ణుడిపరంగా ఋజువైంది.

ఇక రెండవ సందర్భం అప్రసన్యాసరహస్యాన్ని ధర్మరాజుకు వివరించటంలోని అంతరార్థం - ఇక్కడ పాండవులపట్ల పక్షపాతబుద్ధి అనటం న్యాయంకాదు. అధర్మవర్తనుల సేవలో విసిగి వేసారిన ధర్మపరుని మానసికస్థితిని గుర్తించటం ముఖ్యం. యుద్ధానికి ముందు రెండుపక్షాలవారు చేసిన ప్రయత్నాలు విఫలం కాగానే దుర్యోధనుడు సంధికి అంగీకరించడని స్పష్టమైపోయింది. పాలిత ధర్మానికి బద్ధుడై భీష్ముడు దుర్యోధనుడు చేసిన అకృత్యాలను భరించాడు. యుద్ధం అనివార్యమని తేలగానే 'సంసారం మొదలంటా చూసి దరిచేరుకున్నవారం మేము. నీకోసమే యుద్ధానికి సిద్ధపడుతున్నాం. ఇంకేమైనా కానీ, అని ద్రోణునితో కలిసి ఆ ప్రదేశాన్ని వదలి వెడలిపోతాడు. ఇక్కడ దుర్యోధనుని మూర్ఖత్వానికి విసిగిపోయిన వారి మానసిన పరిస్థితి తెలుస్తున్నది. జీవిత చరమదశకు చేరుకున్న తాము రారాజు క్షేమంకోరి, గాంధారీపుత్రుల సౌఖ్యం కోసం మాత్రమే సంధి కోరుతున్నాము తప్ప ప్రాణభీతితోకాదని నిష్కర్షగా చెప్పాడు.

యుద్ధం ప్రారంభించేముందు వినయాన్వితుడై చేతులు జోడించి ధర్మరాజు పెద్దల ఆశీస్సులను కోరి వచ్చినప్పుడు భీష్మద్రోణుల చిత్తవృత్తుల మధ్యగల తారతమ్యం స్పష్టంగా తెలుస్తుంది. 'జయంబశాసింపు'మని ధర్మరాజువచ్చి నమస్కరించినప్పుడు ద్రోణుడు 'ధర్మం ఏ పక్షానగలదో అక్కడ కృష్ణుడు ఉంటాడు కృష్ణుడువున్న పక్షానికే జయంకలుగుతుంద'ని అంటాడు. అంతేకాక ధర్మరాజు నిజవధోపాయాన్ని చెప్పమని కోరినవెంటనే 'నమ్మదగినవ్యక్తి సహింపలేని కీడుమాట పలికితే ప్రాయోపవేశం చేసి అస్త్రసన్యాసం చేయగలవాడనని, అప్పుడు తనను వధించుట సాధ్యమ'ని గుట్టు వెల్లడిస్తాడు. కాని భీష్ముడు ఇందుకు పూర్తిగా భిన్నంగా ప్రవర్తించాడు. ధర్మానికే జయంకలుగుతుందని, ధర్మస్వరూపుడైన కృష్ణుడు పాండవసేనకు అండగా ఉన్నందున జయం వారికే దక్కవచ్చునని తెలిసినా తన కర్తవ్యాన్ని మాత్రం విస్మరించలేదు. 'చుట్టరికం పేరుతో నామనసు కరిగించి నన్ను ప్రార్థించినంతమాత్రాన నేను కరిగిపోయి, ధైర్యంవదలి, యుద్ధ ప్రయత్నం మాని, నీకు నేను నన్ను ఓడించే మార్గం ఇప్పుడే చెప్పన'ని నాచేతిలో ఆయుధం ఉన్నంతవరకు నన్నెవరు జయించలేరని, మరొకమాట పలుకక ఇప్పటికి యుద్ధసన్నద్ధుడవ కమ్మ'ని చెప్పి ధర్మరాజును మరలించిపంపుతాడు. అంతేకాక 'పెద్దవాడవు నీదీవెనలు అందుకున్న తరువాతనే మిమ్మల్ని ఎదిరించి యుద్ధంచేసి శత్రువులను గెలవాల'ని వచ్చానని ధర్మరాజు చెప్పినప్పుడు 'నీవీవిధంగా రానట్లైతే శాపమిచ్చి ఉండేవాడనని ఈ రాకడమేల'ని సమాధానం ఇస్తాడు. శత్రువులను నిర్జింపుమని దీవించి 'నీపక్షాన యుద్ధంచేయమని తప్ప మరేదైనా వరం కోరుకొమ్మ'ని మనుమడిని అనుగ్రహిస్తాడు. నీవు రారాజు పక్షాన యుద్ధంచేసినా మాకు మేలుకలిగేటట్లుగా నిన్ను పడగొట్టే మార్గం చెప్పమని ధర్మరాజు ప్రార్థిస్తాడు. ఆ విషయం చెప్పే సమయం ఇదికాదని, వేరే దారి లేనప్పుడు తిరిగి మరొకసారి రమ్మని చెప్పి పంపివేస్తాడు. పదిరోజుల యుద్ధం అనంతరం భీష్ముని ధాటికి ఓర్వలేక మరొకమార్గం తోచక ధర్మరాజు శ్రీకృష్ణుని వెంటబెట్టుకుని పితామహుని సన్నిధికి వెళ్ళి ఉపాయాన్ని తెలుపమని అర్థిస్తాడు. పదిరోజుల యుద్ధం తరువాత తాను కర్తవ్యనిర్వహణలో విఫలుడు కాలేదన్న విశ్వాసంతో, ఏ విధంగానైనా ధర్మరక్షణ జరగాలనే భావంతో తనను పడగొట్టే మార్గాన్ని తెలియజేస్తాడు తాను వైదొలగితేగాని పాండవులకు మార్గం సుగమంకాదు ధర్మరక్షణ, ధర్మపాలన ధర్మరాజు ద్వారానే జరుగవలసివున్నదని భీష్మునికి తెలుసు కురువంశాన్ని, రాజ్యాన్ని రక్షించి తద్వారా ధర్మరక్షణచేయాలనే తన జీవితలక్ష్యం నెఱవేరాలంటే తాను యుద్ధంనించి తొలగటం ఒకటే మార్గం. ఇక్కడ ధర్మబుద్ధియే ప్రధానంతప్ప వ్యక్తిగతమైన పాండవపక్షపాతంగాని దుర్యోధనునిపట్ల ద్రోహచింతనగాని లేవు. రాజును సంతృప్తి పరచటం ఆశ్రితుల కర్తవ్యం. తాను పదిరోజులు ఆ కర్తవ్యాన్ని సమర్థవంతంగా నిర్వహించాడు. వ్యక్తిధర్మానికి శాశ్వతధర్మానికి సంఘర్షణ తలెత్తినప్పుడు పరిస్థితులనుబట్టి ఏది ఆచరణీయం అని వితర్కించి ధర్మసూక్ష్మాన్ని గుర్తించి ప్రవర్తించాడు.

శాశ్వత ధర్మాన్ని కాపాడేందుకే నిరంతరం ప్రయత్నించారు. ద్రౌపదీ పరాభవ సందర్భంలో పరిస్థితులను గ్రహించి వ్యక్తిధర్మాన్ని అనుసరించి మౌనం వహించారు. యుద్ధరంగంలో వ్యక్తిధర్మాన్ని తగినంతవరకూ అనుసరించి, శాశ్వత ధర్మస్థాపన ప్రయోజనంకోరి వ్యక్తిధర్మాన్ని అధిగమించారు. తన భుజబలాన్ని కౌరవులకు, తన ధార్మికతను, బుద్ధిబలాన్ని యుధిష్ఠిరుని సామ్రాజ్య నిర్వహణకు సహాయకారిగాను భీష్ముడు వినియోగించారు. ప్రతిజ్ఞాబద్ధుడైనప్పటికీ ఏబంధానికీ లోనుకాకుండా తన సమస్త భౌతిక, ధార్మిక బలాలను కురుసామ్రాజ్య రక్షణకే వినియోగించారు. సత్యవాక్పాలన పరమోత్కృష్టమైన ధర్మమని తన జీవితం ఉదాహరణగా భీష్ముడు నిరూపించారు.

సర్వకాల సర్వావస్థలలోను ధర్మాన్ని ధర్మసూక్ష్మాన్ని గ్రహించి ప్రవర్తించిన ధర్మతత్త్వవేత్త, సాధ్యధర్మ మార్గానుసారి శాంతనవుడు. ధర్మరాజుకు సమస్తధర్మాలను ఉపదేశించిన పిమ్మట ధర్మాచరణం వల్లనే ధర్మతత్త్వం తెలిసి ధర్మసూక్ష్మాన్ని గ్రహించగల జ్ఞానం లభిస్తుందని ధర్మాచరణంవలన కలిగే ప్రయోజనాన్ని వివరించారు. ధర్మతత్త్వాన్ని, ధర్మసూక్ష్మాన్ని, ధర్మాచరణ ప్రయోజనాన్ని సంపూర్ణంగా గుర్తించి ప్రబోధించిన సాధ్యధర్మపరాయణుడు భీష్ముడు.

## ధర్మావతారుడు - విదురుడు

మాండవ్య మహర్షి శాపంకారణంగా మానవలోకంలో దాసీవనితకు జన్మించిన యమధర్మరాజు అంశయే విదురుడు గృహస్థుడై నిరంతరం రాజసేవాపరాయణుడైనప్పటికీ ధర్మాచరణ తప్ప మరొక మార్గాన్ని తలచని సాధ్యధర్మమూర్తి. ఇతడి జీవితమంతా ధర్మవ్యతిరేక వర్తనులైన ధృతరాష్ట్ర దుర్యోధనాదుల సాహచర్యంతోనే గడిచిపోయింది. భీష్మునివలెనె విదురుడు కూడా ధృతరాష్ట్రుని, అతని పుత్రులను అధర్మవర్తననుంచి మళ్ళించాలని, పుత్రవ్యామోహంనుంచి ధృతరాష్ట్రుని రక్షించి అతడిలో ధర్మవిచారాన్ని సుస్థిరం చేయాలని ఎన్నో ప్రయత్నాలు చేశాడు. ఒక విధంగా చూస్తే మంత్రి, ఆత్మీయుడు అయినందువల్ల భీష్ముని కన్నా ఎక్కువగా విదురుడు నిరంతరం ధృతరాష్ట్రునికి ధర్మబోధ చేస్తూనే ఉన్నాడు.

విచిత్రవీర్యుని భార్య అంబికకు అంధుడైన కొడుకు పుట్టినప్పుడు సత్యవతీదేవి చింతించింది. గుడ్డివాడైన పుత్రునితో అంబిక నిరాశ చెందుతుందనే భావంతో ఆమెను వ్యాసుని అనుగ్రహంతో మరొక బిడ్డను పొందమని తిరిగి నియోగిస్తుంది. వ్యాసుని తేజోరూపాన్ని భరించలేని అంబిక తనకు మారుగా తన దాసీని వ్యాసుని వద్దకు పంపుతుంది. ఆ దాసీవనిత భక్తిశ్రద్ధలతో వ్యాసుని సేవించి అతని వలన పుత్రుని పొందుతుంది. ఆ పుత్రుడే విదురుడు. ధృతరాష్ట్ర పాండురాజులతో సమానంగా భీష్ముని రక్షణలో పెరిగి పెద్దవాడై విద్యాబుద్ధులు పొందాడు. వ్యాసభీష్ములవలెనె విదురుడు కూడా కురువంశ రక్షణ బాధ్యతను నిర్వహించాడు. ధర్మరక్షణ, ధర్మదృష్టి తప్ప

ఎటువంటి రాగద్వేషాలులేని విదురునిలో సమవర్తియందుండే ధర్మయోగమే ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. ఒక యోగంవలె ధర్మాన్ని అనుష్ఠించినందువల్లనే విదురుడు యోగీశ్వరుడై శరీరాన్ని విసర్జించాడు. ధర్మరక్షణకు పూనుకున్న యుధిష్ఠిరులో విదురుని అంశలీనమై ధర్మసంయోగం జరిగింది.

భగవద్గీతలో 'ఎవడు దేనివిషయమునైనను హర్షింపడో, ద్వేషింపడో, శోకింపడో, కాంక్షింపడో, ఎవడు సమస్త కర్మలయొక్క శుభాశుభఫలములను త్యజించినాడో అట్టి భక్తియుక్తుడగు పురుషుడు నాకు ఇష్టుడు'[49] అని శ్రీకృష్ణుడు వివరించిన మహాయోగి లక్షణాలన్నీ విదురునిలో మూర్తీభవించినందువల్లనే విదురుడు శ్రీకృష్ణునకు ప్రీతిపాత్రుడైనాడు భీష్ముని భుజబలానికి విదురుని బుద్ధిబలంతోడై ధృతరాష్ట్రునిపాలన కొనసాగింది

ధృతరాష్ట్రునిలోని స్వార్థపూరితమైన ప్రేమ, దుర్యోధనుని మాత్సర్యం ఏ మార్గాన చరిస్తున్నాయో విదురుడు అనుక్షణం గ్రహిస్తూనే ఉన్నాడు. పాండవులను లక్కయింటిలో ఉంచి రూపుమాపేందుకు దుర్యోధనుడు చేసిన ప్రయత్నాన్ని విఫలంచేసి పాండవులను రక్షించటంతో విదురుని ధర్మరక్షణ ప్రారంభమైంది. లౌకిక, రాజకీయ, ధార్మికమైన విషయాలలో ఎప్పటికప్పుడు ధృతరాష్ట్రునికి ధర్మబోధచేయటంలోకాని, అతడిని హెచ్చరించటంలోకాని విదురుడు ఎప్పుడూ వెనుదీయలేదు, సంకోచించలేదు. అయినప్పటికీ కౌరవుల మాత్సర్యానికి అవధులు లేనందువల్ల పాండవుల రక్షణ తన కర్తవ్యంగా స్వీకరించాడు.

మాయాజూదంలో పాండవులరాజ్యాన్ని అపహరించినప్పుడు, ద్రౌపదిని పరాభవించినప్పుడు, అధర్మాన్ని వారించమని ధృతరాష్ట్రుని చెవినిల్లుగట్టుకుని బోధించాడు. వనవాసగతులైన పాండవులను రప్పించి, వారి రాజ్యం వారికిచ్చి ధర్మాన్ని నిలిపి కీర్తిమంతుడవుగమ్మని, అది నీకూ నీ పుత్రులకూ మేలని ఎన్నోవిధాల వివరిస్తాడు. విదురుని బోధలోని సత్యాన్ని గుర్తించలేని ధృతరాష్ట్రుడు ' ఆ పాండవులవద్దకే పొమ్మ'ని అతనిని విదిలిస్తాడు. ఆ మాటనే ఆజ్ఞగా భావించి ధర్మరాజు సన్నిధికి చేరుకుంటాడు కాని 'ధృతిహీనుడైన ధృతరాష్ట్రుడు తన హృదయంబును, దృష్టియు' అయిన విదురుడులేక నిముషమైనా నిర్వహింపలేక అతనిని వెనుకకు రప్పించుకుంటాడు ప్రభువు పొమ్మంటే బాధపడలేదు, రమ్మంటే ఆనందపడలేదు. కర్తవ్యం ఒకటే లక్ష్యంగా భావించి తిరిగిరాగానే మళ్ళీ 'నీవు నీ పుత్రుడు విచక్షణలేకుండా మాట్లాడినా మీకు మేలుకలిగే విధంగానే నేను చెప్పాలి' అంటూ తన ధర్మపరాయణతను చాటాడు. శ్రీకృష్ణ సంజయులతో కలిసి యుద్ధం నివారించేందుకు మార్గాలను ప్రతి నిముషం అన్వేషించాడు, చర్చించాడు. భీష్మునివలెనె విదురునికి కూడా పాండవులపైన గల అభిమానం వారు తండ్రిలేని బిడ్డలని మాత్రమేకాదు. పాండవుల ధర్మవర్తనవలన, సాత్త్వికగుణం వలన ఆ అభిమానం, వాత్సల్యం పెంపొందాయి.

★ 49. భగవద్గీత 12-15

శ్రీకృష్ణుడు సంధికొరివచ్చినప్పుడు 'నాకు ప్రియమైన వాడని చెప్పి విదురునియింట విడిదిచేస్తాడు. సంధి పొసగదని గ్రహించిన తరువాత విదురుడు కుంతీదేవి దగ్గర తన విషాదాన్ని, మనసులోని భావాలను బయటకు వెల్లడిస్తాడు. ఇది ఒక విశేష సన్నివేశం. సర్వం తెలిసిన శ్రీకృష్ణునితో జరిపిన సంభాషణ రాజనీతి పరమైనటువంటిది. ధృతరాష్ట్రుని దగ్గర చెప్పిన మాటలు, ధర్మబోధ వంశక్షేమాన్ని కోరినటువంటివి. కుంతీదేవి దగ్గర మాత్రం అతడు అప్పటి పరిస్థితికి, ధర్మాధర్మాలమధ్య చెలరేగుతున్న సంగ్రామానికి విచలితుడై, దారితెన్నూ తోచని తన స్థితిని వెల్లడిస్తాడు. వంశవినాశనాన్ని ఆపాలంటే ధర్మాన్ని వదులుకోవాలి. ధర్మాన్ని కాపాడాలంటే దుర్యోధనాదులకు ఆపద తప్పదు. ఇటువంటి స్థితిలోకూడా విదురుడు యుద్ధంలో జయాపజయాలు దైవాధీనాలనిగాని, జననష్టాన్ని తలచిగాని దుఃఖితుడు కాలేదు. ధర్మరక్షణ చేయలేని తన వైఫల్యాన్ని ప్రకటించి విషాదాంతరంగుడైనాడు. అతడిలోని అత్యున్నతమైన నిర్మోహత్వం శీఘ్రంగానే అతడు ఈ పరిస్థితిని విధికృతంగా భావించి, జరిగేదానిని కేవలం చూస్తూవుండగలస్థితికి తీసుకొనివెళ్ళింది.

యుద్ధానంతరం పుత్రుల, బంధువుల మరణానికి దుఃఖిస్తున్న గాంధారీధృతరాష్ట్రులను ఓదార్చేవేళకూడా ఈ అనర్థం స్వయంకృతమేనని చెప్పగలిగిన ధీశాలి విదురుడు. ధర్మరాజు సింహాసనాధీశుడైన తరువాత కుంతి, గాంధారి, ధృతరాష్ట్రులతో కలిసి వానప్రస్థానికి తరలిపోయిన విరాగి. వికల మనస్కులైన గాంధారీ ధృతరాష్ట్రులకు జన్మసిద్ధాంతం, జన్మకారణం, మృత్యువిలాసాలను వివరించిన మహాజ్ఞాని.

ధర్మరాజు పరివారంతోకలిసి కుంతినీ, గాంధారీ ధృతరాష్ట్రులను చూచేందుకు వన భూమికి వెళ్ళినప్పుడు విదురుడు పరమహంసయై శూన్యాటవిలో సంచరిస్తున్నాడని తెలుసుకుంటాడు. అతనిని వెదుకుతూ అడవి గాలించి కనుగొంటాడు. మనిషిని చూచి పారిపోతున్న విదురుని 'విదురా నిలువుమని అరచి తానెవరో ఎఱిగించగా విదురుడు కొద్దిదూరంలో నిలిచి యుధిష్ఠిరుని మీదనే దృష్టినిలిపి యోగమార్గాన ప్రాణత్యాగం చేస్తాడు. తేజోరూపుడై ధర్మపుత్రుని దేహంలో ప్రవేశించగా అతడు విభ్రాంతుడై నిలిచిపోతాడు. కొంతసేపటికి తేరుకుని విదురుని శరీరానికి దహనసంస్కారం చేయాలని ప్రయత్నించగా 'యతిత్వ గౌరవోజ్జ్వలుడైనవానికి' అగ్నిసంస్కారం అర్హంకాదనే ఆకాశవాణి పలుకు వినబడుతుంది. అప్పటికా ప్రయత్నాన్ని వదలి మరలివస్తాడు. మహాభారతంలో మానవదేహందాల్చిన దైవాంశ సంభూతులని చెప్పినవారిలో యోగీశ్వరుడై యోగమార్గాన శరీరాన్ని వదలిన పరమహంస విదురుడొక్కడే.

విదురుడు కూడా భీష్ముని వలెనె పాండవపక్షపాతి అని దుర్యోధనుడు విమర్శించినా అతడు ప్రధానంగా ధర్మపక్షపాతి. ధర్మం వినా మరొక విషయాన్ని దర్శించలేదు, అనుసరించలేదు,

సమర్ధించలేదు. విదురుడు ధర్మాన్ని, కర్మను సంపూర్ణంగా నిర్వహించిన మహాయోగి. 'సమస్త ధర్మపరిశోధకుడావిదురుడు' అని అర్జునుడు ప్రస్తుతించగా శ్రీకృష్ణుడు మన్నించిన ధర్మతత్త్వవేత్త

శాపకారణంగా మానవదేహం ధరించిన యముని అంశతో జన్మించిన విదురుడు. సాధ్యధర్మమూర్తులైన వ్యాస భీష్ములతో సరిసమాన స్థాయిలో నిలువదగినవాడు. ధృతరాష్ట్రునితో నిరంతర సాహచర్యం కలిగివుంటూనే, అనుక్షణం అధర్మ ప్రయత్నాలను ప్రతిఘటిస్తూ ధర్మోద్ధరణకూ, ధర్మరక్షణకూ పాటుపడిన ధర్మప్రవర్తకుడు

## ధర్మ,జ్ఞాన సంయోగం - సంజయుడు

మహాభారతంలో కన్పించే ప్రముఖ ధర్మతత్త్వవేత్తలలో సంజయుడు చెప్పదగిన వ్యక్తి. ఇతను మొట్టమొదటిసారిగా ఉద్యోగపర్వంలో కన్పిస్తాడు. ఈ సంజయుడు సూతవంశీయుడైన గావల్గణుని కుమారుడు. ఇతడు ధృతరాష్ట్రుని దగ్గరవుండి అతనిని సేవిస్తూ భూమండలప్రభావాన్ని భారతవర్ష విశేషాలను వివరిస్తుంటాడు. ఇతడు ఎప్పుడూ ధృతరాష్ట్ర దుర్యోధనుల కార్యకలాపాలను గురించి ప్రస్తావించటంగాని, విమర్శించటంగాని చేయడు. నిస్సంగత్వంతో వారి చేష్టలను గమనిస్తూవుంటాడు. ధృతరాష్ట్రుడు కౌరవ పాండవుల విషయం ప్రస్తావించినపుడు మాత్రం నిస్సంకోచంగా వారివారి ప్రవర్తనలలోని ధర్మాధర్మాలను విశ్లేషించి వెల్లడించేవాడు. సూతవంశంలో జన్మించిన సంజయుడు నిష్ఠాగరిష్ఠుడై ధర్మవేత్త అని ప్రశంసలుపొంది ధృతరాష్ట్రునికి, పాండవులకూ, కూడా ఆత్మీయుడైనాడు. ఉపప్లావ్యంలో ధృతరాష్ట్రుని దూతగా పాండవులను దర్శించినపుడు అర్జునుడు సంజయుని ధార్మికబుద్ధిని ఎంతగానో ప్రశంసిస్తాడు.

జూదమాడేందుకు ధర్మరాజును ఆహ్వానించమని విదురుని పంపిన ధృతరాష్ట్రుడు అజ్ఞాతవాసం పూర్తిచేసుకుని వచ్చిన పాండవులదగ్గరకు సంజయుని రాయబారిగా పంపడానికి తగిన కారణం వుంది. విదురుడు మంత్రి, కుటుంబ సంబంధీకుడు. ధృతరాష్ట్రుని ఆలోచనలను గురించి అతడు చర్చించే అవకాశంఉంది. స్వార్థపూరితుడైన ప్రభువు ఆలోచనలను ధార్మికుడైనమంత్రి వ్యతిరేకించవచ్చును కూడా. ధృతరాష్ట్రునికి ఈ అనుమానం మనసులోవుంది. కౌరవ పాండవుల మధ్య ద్యూతక్రీడను వ్యతిరేకించిన మొదటి వ్యక్తి విదురుడు. సంజయుడైనట్లైతే ఎదురుచెప్పే అవకాశం లేదు. అంతేకాక అతడు ఇరుపక్షాలవారికీ మిత్రుడు అందువలన వృద్ధరాజు 'నీవు ధర్మజునివద్దకు వెళ్ళి అతడు సభలో వుండగా అతని బంధువులకు, సోదరులకు ఇంపుకలిగే విధంగా స్నేహాన్ని ప్రదర్శిస్తూ కడు తీయగాపలకమని, 'యుద్ధం అనే ఆలోచనను ధర్మరాజు మానుకునే విధంగా మాట్లాడమని' చెప్పిమరీ పంపుతాడు. సంజయుని సంయమనాన్ని, వాక్చాతుర్యాన్ని, ధర్మపారీణతను విశ్వసించి ధృతరాష్ట్రుడు సంజయుని దూతగా పంపాడు.

ధృతరాష్ట్రుని ఆదేశాన్ని తలదాల్చి సంజయుడు దౌత్యం నిర్వహిస్తారు. ధర్మరాజును ప్రస్తుతిస్తూనే "నీబలంకన్నా కౌరవులబలం పెద్దదని చెప్పటం, యుద్ధం బంధునాశనానికి ఏ విధంగా కారణ మవుతుందో వర్ణించటం సంజయుని వాక్చాతుర్యానికి నిదర్శనాలు. సంజయుని నోట వినవచ్చిన మాటలు ధృతరాష్ట్రుని మనసులోని ఆలోచనలే అని గ్రహించిన ధర్మరాజులో వెడవెడ అలుకపొడమింది. పరమశాంతమూర్తిగా పేరొందిన అజాతశత్రువు హృదయాన్నే కలవరపరచి తాను నిర్వికారంగా నిలువగలిగిన స్థిరచిత్తుడు సంజయుడు. 'యుద్ధం అనేమాట నానోట వచ్చిందా' అని, 'రాజులకు యుద్ధం ధర్మంకాదని నీవే చెప్పమ'ని ధర్మరాజు మనసువిప్పి అడిగినప్పటికీ చలించకుండా 'నేను వచ్చిన పని సఫలమైనది పోయివచ్చెదనని' పలుకగలిగిన ధీరుడు. కార్యనిర్వహణ తప్ప మరొక దృష్టిలేని మనీషి. ధర్మరాజతనిని 'సద్గురుండవ'ని 'నీవాండెవిదురుడౌండె' అని విదురునితో సమానమైన ధర్మజ్ఞుడని ప్రస్తుతిస్తారు. సంజయుని వాక్చాతుర్యం, ధార్మికత, శాంతవర్తనం, శ్రీకృష్ణుని కూడా చకితుణ్ణిచేసిన విశేషగుణాలు. ఏ పక్షం వహించకుండా కేవలం నిమిత్తమాత్రుడై కార్యం నిర్వహించటం, ఎదుటివారి హృదయాన్నెఱిగి సంభాషించటం, తాను తెచ్చిన రాయబారాన్ని అంతరార్థం బోధపడేవిధంగా ప్రసంగించటం సంజయ రాయబారంలోని విశేషాంశాలు. ధర్మరాజుకు మీరు రాజ్యంకోరవద్దు అని చెప్తూనే నేర్పుగా ధర్మాధర్మాలను గురించి ప్రసంగిస్తారు. 'నీవంటి శాంతమూర్తికి, ధార్మికుడికి రక్తపుకూడు ఎందుక'ని ప్రశ్నించి, 'ఇంతకన్నా భిక్షాటనం మేలుకాదా' అని అడుగుతారు. ఈ మాటలకు ధర్మరాజులో చిరుకోపం పొడసూపినప్పటికీ దూతముందు హృదయగత భావాన్ని ప్రదర్శించటం రాజనీతికాదు గనుక అతడాకోపాన్ని నిగ్రహించుకోవలసి వచ్చింది.

రాయబారం ద్వారా పాండవులకు ధృతరాష్ట్రుని భావాన్ని తెలిపిన విధంగానే ధర్మరాజు ఉద్దేశ్యాన్ని ఏకాంతంలో ధృతరాష్ట్రునికి చెప్పవలసిన విధంగాను, కురుసభలో వెల్లడించవలసిన విషయాలను విచక్షణతోను ప్రసంగిస్తారు. తనకు ధృతరాష్ట్రుని దగ్గరగల చనవును బట్టి ఒంటరిగా ఉన్నప్పుడు ధృతరాష్ట్రునితో ధర్మరాజు అంతరంగాన్ని, ఆలోచనలను విడమరచి చెప్తారు. ధర్మరాజును గురించి 'విను సాధువైనవాడు చెలరేగితే తల యుద్ధరంగంలో కాని నిలువద'ని, 'ధర్మపుత్రుడు మెత్తనిపులి, అందరూ తప్పునీయందే ఉంద'ని అనేవిధంగా ప్రవర్తిస్తాడని, అంతవరకూ ఏదీ వినడు కనడని, అప్పుడు ఆతనిని మరల్చటం నీకు నాకూ కూడా సాధ్యంకాద'ని హెచ్చరిస్తారు. ఈ రెండు వాక్యాలలో ధర్మరాజు ఉద్దేశ్యాన్ని, నిర్ణయాన్ని కూడా తెలియజేస్తారు. కేవలం క్లుప్తంగా జరిగిన సంభాషణ వల్లనె ఎదుటివారి హృదయాన్ని గ్రహించగలిగిన పరేంగిత జ్ఞాని, ప్రతిభాశీలుడు సంజయుడు. ధర్మరాజు ఏ పని చేసినా ధర్మభంగం కలగని విధంగా చేస్తాడని, పాపుణ్యాలను నీకే వదలి, భారం నీమీద పెట్టి నీ నిర్ణయాన్ని అనుసరించి వర్తించేందుకు సిద్ధంగా ఉన్నారని పరిస్థితిని వివరిస్తారు. ఒక విధంగా రేపటి సభలో నీవు చేసే నిర్ణయంపైన నీ కుమారుల, ఇతర రాజుల

క్షేమం ఆధారపడివుందని చెప్పి, పాండవులకు రాజ్యంలో భాగం ఇవ్వకపోయినా వారు కోరిన ఐదూళ్ళైనా వారికీయటం క్షేమమని కర్తవ్యబోధ చేస్తాడు. సంజయుని మాటలలోని సత్యాన్ని గుర్తించిన ధృతరాష్ట్రుడు విచలిత హృదయుడై విదురుని పిలిపించి నా సంతాపం ఉపశమించే విధంగా ఏదైనా మాట్లాడమని వేడుకుంటాడు. సంజయుని వాక్కులకు అంతటి ప్రభావంవుంది.

మరునాడు సభామధ్యంలో అధికారికంగా రాయబార విశేషాలను వివరిస్తాడు. తాను ఉపప్లావ్య నగరం చేరగానే అక్కడ వాసుదేవుని, అర్జునుని ముందుగా దర్శించానని వారిని చూడగానే తనలో హర్షాశ్రువులు, భయము కలిగాయని పలుకుతాడు. నరనారాయణులైన కృష్ణార్జునులను చూడగానే వారి పరస్పర స్నేహాన్ని, ఆత్మీయతను గుర్తించినందువల్ల హర్షాశ్రువులు రాలగా, మదించిన రెండు ఏనుగులవలె ఉన్న వారి రూపాలు పరాక్రమ చిహ్నాలతో నిండివుండగా చూచిన తనలో భయం కలిగిందని పలుకుతాడు. ఈ ఇద్దరూ ధర్మరాజు నోటివెంట వెలువడిన మాటను ఆజ్ఞవలె శిరసావహించగలరని కనుక ధర్మరాజును ఎదిరించటం యమునితోవైరం వంటిదేనని అంటాడు. ఈ మాటలన్నీ పాండవులు యుద్ధానికి వెనుదీయటంలేదని, వారితో యుద్ధం క్షేమంకాదని అన్యాపదేశంగా చేసిన హెచ్చరికలే. అంతేకాక ఉభయ పక్షాలలోని బలాలను గురించి, వీరులను గురించి చర్చించిన తరువాత ధృతరాష్ట్రుడు ఎవరి శక్తియుక్తులు ఎక్కువని ప్రశ్నిస్తే 'ఆసేనలో వాసుదేవుడున్నాడు. అతనికి సరియైన వానిని నీ సేనలో నాకు చూపమని' ఎదురుగా నిలిచి ప్రశ్నించిన సత్యవాక్పరాయణుడు. ఎక్కడ సత్యం పర్ఢిల్లుతుందో ఎక్కడ ధర్మం నిలబడుతుందో అక్కడ కృష్ణుడుంటాడని, కృష్ణుడున్నచోట జయం తథ్యమని ధృతరాష్ట్రునికి నిష్కర్షగా వెల్లడిస్తాడు. ఇటువంటి వాక్చాతుర్యము, సంయమనము, ధర్మనిరతి నిస్సంగబుద్ధిగలవాడు కనుకనే సంజయునికి యుద్ధరంగ విశేషాలను సమగ్రంగా దర్శించగల దివ్యదృష్టిని వ్యాసుడు ప్రసాదించాడు.

ధృతరాష్ట్రుడు తాను యుద్ధం చూడలేనని కేవలం వార్తలను వినదలచానని వ్యాసుని ప్రార్థిస్తాడు. అప్పుడు సూక్ష్మరూపంలో యుద్ధరంగంలో అదృశ్యుడై చరింపగలిగినట్లు, ఉభయసేనలవారి రహస్య ప్రకార సంభాషణలను, ఆలోచనలను గ్రహింపగలిగే శక్తిని శీఘ్రగమనంపొందే వరాన్ని సంజయునికి వ్యాసుడు ప్రసాదిస్తాడు. నిర్మోహుడైన సంజయుడు ఎటువంటి ఉద్వేగాన్ని పొందకుండా నిశ్చలహృదయంతో యుద్ధవిశేషాలను ఒక వార్తాహరుడివలెనే ధృతరాష్ట్రునికి వివరిస్తాడు. 'రాజులు ఎందుకు కలహించుకుంటార'ని దుఃఖితుడైన ధృతరాష్ట్రుడు అడిగితే, భూపరిమాణం, కాలప్రభావం, విధివిలాసం ఎటువంటివో ధృతరాష్ట్రునికి వివరించి ఇంతటి విశాలము, సుసంపన్నము అయిన భూమికోసమే రాజులు పరస్పరం యుద్ధాలు చేస్తుంటారని చెప్పి ఈ యుద్ధం వ్యామోహానికి, లోభానికి ఫలితం అని నిస్సంకోచంగా హెచ్చరిస్తాడు.

అంతేకాక 'కీడు చేసిన వానికి కీడు జరగటం అరుదా' అని. ప్రభువు ఉపేక్షాధోరణికి ఇదే ఫలితం అని ఎత్తిచూపుతాడు. ఈ మాటలన్నిటినీవిన్న వృద్ధరాజులో తాత్కాలికమైన ప్రబోధం కలిగి నా అవినీతియే ఈ మహాపదకు మూలమని. దుర్వినీతులైన కుమారులను సమర్థించి ఇంతకు తెచ్చుకున్నా'నని అతడు వాపోతే ఈ పశ్చాత్తాపం స్థిరమైనదికాదని గ్రహించి ఎలాంటి సానుభూతివాక్యాలు పలుకకుండా మౌనంగా ఉండిపోతాడు.

ఇంతటి ధర్మజ్ఞుడు. నిస్సంగుడు అయిన సంజయుని ముఖత: భగవద్వాక్యమైన భగవద్గీతను గ్రహించే అవకాశం ధృతరాష్ట్రునికి, లోకానికి లభించింది. భారతీయ ఆధ్యాత్మిక తత్వానికి పరాకాష్ఠ అని ప్రపంచ ప్రఖ్యాతిపొందిన భగవద్గీతను శ్రీకృష్ణుడు అర్జునునికి "ఈవిధంగా బోధించాడు" అని సంజయుడు ధృతరాష్ట్రునికి వివరిస్తాడు.

ఒక్కొక్క మహావీరుడు యుద్ధంలో మరణించాడని విన్నప్పుడల్లా ధృతరాష్ట్రుడు విలపిస్తే ఇది స్వయంకృతమని హెచ్చరిస్తూనే వారి విధివిధానం ఇది అని ఉపశమనవాక్యాలు పలికి దు:ఖోపశమనం కలిగిస్తాడు.

యుద్ధానంతరం పాండవుల అండలోవున్న వృద్ధదంపతులను వెంటనంటివుండి సేవిస్తాడు. వారు కుంతీ విదురసహితులై వానప్రస్థానికి తరలిపోయినప్పుడు కూడా సంజయుడు వారివెంట అరణ్యానికి వెళ్ళి అక్కడ ఆఖరిక్షణంవరకు ధృతరాష్ట్రుని సన్నిధిని వదలకుండా తన సేవకధర్మాన్ని నిర్వహిస్తాడు. కుంతీ గాంధారీ ధృతరాష్ట్రులు అరణ్యంలో దావానలంలో చిక్కుకుని నడవలేక తప్పించుకోలేక పోయినప్పుడు వారిని రక్షించేందుకు ప్రయత్నిస్తాడు. వృద్ధులైనవారిని ఆపదలో విడిచి వెళ్ళటం ధర్మంకాదని వారిని కాపాడటం తన కర్తవ్యమని వాదిస్తాడు. అయితే ధృతరాష్ట్రుడు వనవాసగతులైనవారికి ఇటువంటి మరణం సహజమని, ఏవిధంగా ప్రయత్నించినా వృద్ధులైన తాము ముగ్గురూ ఈ అగ్ని జ్వాలలనుంచి బయటపడటం సాధ్యంకాదని చెప్పి ప్రాణరక్షణ జీవధర్మమని సంజయుని ప్రబోధిస్తాడు. శక్తివున్నప్పుడు ప్రాణరక్షణ ధర్మాన్ని పాటించకపోవటం అధర్మమని వాదించి పరిపరివిధాల జీవధర్మాలను వివరిస్తాడు. అంతగా చెప్పిన తరువాత సంజయుడు ధృతరాష్ట్రుని వాక్కు అతడి ఆజ్ఞగా భావించి వారిని విడిచి హిమాలయాలకు తరలిపోతాడు.

మహాభారతంలో విదురునితో సమానమైన ధర్మమూర్తిగాను, మహాజ్ఞానిగాను, ధర్మతత్వాన్ని గుర్తించిన ధర్మవేత్తగాను మన్ననలందిన స్థితప్రజ్ఞుడు, సాధ్యధర్మవర్తనుడు సంజయుడు.



# 6. సాధన ధర్మవర్తనులు - కుంతీదేవి; యుధిష్ఠిరుడు

కలి ద్వాపర యుగసంధిలో ధర్మాన్ని గురించిన అనేక ప్రశ్నలు, సందేహాలు చెలరేగాయి అరిషడ్వర్గాల ప్రకోపం పెరిగి సమాజనియతికి, స్థిరమైన జీవన విధానానికి విఘాతం ఏర్పడింది అటువంటి సమయంలో అకృత్యాలను, అధర్మాలను రూపుమాపేందుకు అవతారపురుషుడు జన్మించవలసివచ్చింది. లోకజ్ఞుడు, రాజనీతివేత్త, మహాజ్ఞాని అయిన వాసుదేవుడు ధర్మరక్షకుడని భగవందంశ సంభూతుడని మహాభారతం వర్ణించింది. శ్రీకృష్ణుని ధర్మస్వరూపుడని, భగవంతుడని విశ్వసించినవారెందరో భారతంలో కన్పిస్తారు. అటువంటి వారిలో ధర్మస్వరూపాన్ని, ధర్మతత్వాన్ని తెలుసుకొని ధర్మసూక్ష్మాన్ని గ్రహించి జీవించిన సాధ్యధర్మ పరాయణులను గురించి ఇంతకుముందే తెలుసుకున్నాము. వారి సాహచర్యంలో లౌకిక, అధ్యాత్మిక కర్మమార్గాన్ని అనుసరిస్తూ నిష్కామబుద్ధితో సుస్థిరమైన ధర్మాన్ని ఆచరణలో చూపిన ఉత్తమ ధర్మసాధన వర్తనులు కుంతీదేవి, యుధిష్ఠిరుడు ధర్మ సాధకులందరకు వీరి జీవితాలు మార్గదర్శకాలు. యుధిష్ఠిరుడు ధర్మమనే మహావృక్షమని వ్యాసుడు వర్ణించాడు. అటువంటి ధర్మపరాయణునకు జన్మ ఇచ్చిన పరమ ధార్మికురాలు కుంతీదేవి.

## నిష్కామధర్మ సాధకురాలు - కుంతీదేవి

"పృథివిఁబోనిదాని పృథయను కన్యక" అని కుంతీదేవి క్షమాగుణాన్ని, ఓరిమిని ఒక్కవాక్యంలో నన్నయ వర్ణించాడు. అచంచలమైన దీక్ష, కర్తవ్య నిర్వహణ, నిస్వార్థ గుణం, ధార్మికవర్తన కలగలుపుకుని స్త్రీరూపం దాల్చగా కుంతీదేవి కాగలదని మహాభారతం నిరూపిస్తుంది.

యాదవ వంశంలో వసుదేవుని సోదరిగా జన్మించిన పృథ కుంతిభోజుని దత్తపుత్రికయై కుంతీదేవిగా ప్రసిద్ధిపొందింది. కుంతి అసాంతకష్టజీవి, ఎదురైన కష్టాలను మారుమాటలేక శిరసావహించటం, ఎంతటి కష్టసమయంలోనైనా ధర్మం ఒక్కదానినే ఆధారంచేసుకుని జీవించటం మాత్రమే ఎఱిగిన వనిత. పుత్రికగా, భార్యగా, తల్లిగా, బంధువుగా ఒక స్త్రీ నిర్వహించవలసిన అన్ని బాధ్యతలలోను ధర్మనిర్వహణ తప్పని ఉత్తమ సాధకురాలు. ఆమె సుదీర్ఘజీవితంలో నాకిది ప్రీతి, లేదా కావాలి అని ఆమె కోరిన కోరిక ఒక్కటే 'రాచపుట్టుక పుట్టినందుకు వీరమాతను అనిపించుకోవాలన్నదే నా కోరిక' అని, 'మీరు చేయవలసిన పనికి సమయం వచ్చింది ఇప్పుడు మీరు అలసించిన జనులు మిమ్ములను పురుషులని అనరు' అని సంధికై హస్తినాపురానికి వచ్చిన కృష్ణునిముందు తన మనసులోని భావాన్ని బహిర్గతం చేస్తుంది ఇది తనమాటగా పాండవులకు చెప్పమని కృష్ణుని కోరుతుంది. ఈ ఒక్క ఆశతప్ప కుంతికోరిన కోరిక ఇది అని చెప్పేందుకు మరొక సందర్భంగాని సంఘటనగాని భారతంలో ఎక్కడా కన్పించదు.

కన్యగా కుంతిభోజునియింట తండ్రి ఆజ్ఞమేరకు దుర్వాసమునిని అత్యంత భక్తిశ్రద్ధలతో వినయాన్వితురాలై సేవించగా ముని సంప్రీతుడై ఆమె కొక మంత్రాన్ని ఉపదేశిస్తాడు త్రికాలజ్ఞుడైనముని భవిష్యత్తు నెఱిగి ఆమెకు ఆ మంత్రాన్ని ఇచ్చిఉండవచ్చు. ఏ దేవతను ఉద్దేశించి మంత్రం జపిస్తే ఆదేవత అనుగ్రహించి ఆమెకు సంతానం ప్రసాదిస్తాడని పవిత్ర భావంతో జపించి దేవతను ఆహ్వానించాలని చెప్పి దుర్వాసుడు వెడలిపోతాడు. బాల్యచాపల్యంవలన, స్త్రీ సహజమైన ఉత్సాహంతో మునియిచ్చిన వరం నిజంగా ప్రభావంకలదా అని పరీక్షించాలని ప్రయత్నించింది. ఈ చాపల్యమే ఆమె జీవితంలో వ్యధకు మూలకారణమైంది కన్య అయిన కుంతి సూర్యుని ఉద్దేశించి మంత్రం జపిస్తుంది. ఆనాడు 'ఎల్లధర్మంబులలోను కులంబునిలుపుటయె మిక్కిలి ధర్మంబు' అన్నది సామాజిక ధర్మమైనప్పటికి 'కన్యామాతృత్వం సాంఘికమర్యాదకు భంగమని అధర్మమని' తన యెదుట ప్రత్యక్షమైన భాస్కరుని మరలిపొమ్మని వేడుకుంటుంది. అయినప్పటికీ మునివాక్కు, మంత్రప్రభావం అనుల్లంఘనీయమైనవని సూర్యుడు ఆమె కన్యాత్వం దూషితం కాకుండా వరమిచ్చి పుత్రుని ప్రసాదించి మరలిపోతాడు. లోకాపవాదానికి వెఱచిన ఆ అవివాహితమాత ఆ బిడ్డను రహస్యంగా గంగమడుగులో విడిచిపెడుతుంది. అయితే ఆ బిడ్డ పెరిగి పెద్దవాడై భావికాలంలో మహావీరుడైనప్పటికీ ఆత్మన్యూనతాభావంతో రగిలిపోయి, ఈర్ష్యాద్వేషాలవలన ఒక మహాయుద్ధానికి దోహదకారికాగలడని ఆమె ఊహించలేదు.

అనంతరం మహావీరుడైన కురువంశ ప్రభువు పాండురాజు స్వయంవరంలో కుంతీదేవిని అగ్రమహిషిగా పరిగ్రహిస్తాడు. కుంతి భోజునియింట కుమార్తెగా ధర్మనిర్వహణచేత తండ్రిని, సపర్యల చేత మహర్షిని మెప్పించిన కుంతీదేవి పాండురాజు ఇల్లాలుగా పత్నీధర్మనిర్వహణలో లోకాన్నే మెప్పించగలిగింది. విధివశాత్తు మృగయావ్యసనం కారణంగా పాండురాజు శాపగ్రస్తుడై సర్వ భోగాలను వదలి వనవాసానికి తరలిపోగా, కుంతీదేవి అతనివెంట వెళ్ళింది. భర్త రక్షణ, సేవ తన కర్తవ్యంగా భావించి, సపత్ని మాద్రితో కలసి వానప్రస్థధర్మాన్ని అవలంబించింది. ఉత్తర కురుభూములలో హిమాలయ పర్వతసానువులలో తానొక మహారాణిననే సంగతి విస్మరించి భర్తసేవలో మునివృత్తితో జీవించింది. సంతాన హీనులైన వారికి స్వర్గ ప్రవేశంలేదని తెలుసుకున్న పాండురాజు తనను పున్నామనరకం నుంచి రక్షించమని, అనపత్యతకు ఓర్వలేనని దుఃఖితుడైనప్పుడు అతనిని ఓదార్చింది. తనకు ఉత్తమగతులు కల్పించేందుకు తోడ్పడమని, క్షేత్రజ సంతానాన్ని ప్రసాదించమని పాండురాజు కోరిక వ్యక్తం చేస్తాడు. ఆనాటి సామాజికధర్మం క్షేత్రజ సంతానాన్ని అనుమతించినప్పటికీ పాండురాజువంటి వానికి భార్యయైన తాను పరపురుషగమనం చేయటం భావ్యంకాదని తిరస్కరించింది. ఆనాటి సాంఘిక మర్యాదలో ఔరసుని తరువాత స్థానం క్షేత్రజుడైన పుత్రునిది. అంతేకాక కురువంశోద్ధరణకోసం తమ జన్మలు కూడా దేవర న్యాయం వలన సంభవించినవైనందువల్ల కూడా పాండురాజు క్షేత్రజ సంతానాన్ని కోరాడు. సంస్కృత

మహాభారతంలో భర్తే సజీవుడై ఎదుటనుండగా ఇతరులవలన సంతానాన్ని పొందటానికి, కుంతి అభ్యంతరం చెప్తుంది. అప్పుడు పాండురాజు శ్వేతకేతు వృత్తాంతం వివరించి, ఉద్దాలక మునిపుత్రుడైన శ్వేతకేతు స్త్రీలకు పరపురుషగమనం పాపమని చేసిన కట్టడి ఉత్తర కురుభూములలో వర్తించదని వివరిస్తాడు.

ఆంధ్రమహాభారతంలో నన్నయ ఈ సందర్భంలో కుంతీదేవి శ్వేతకేతు వృత్తాంతం విన్న తరువాత కూడా సందేహించగా పాండురాజు భర్త ఆజ్ఞను అనుసరించటం సతిలక్షణమని చెప్పి ఆమెను అంగీకరింపచేసినట్లు వర్ణించాడు. ఆనాటి సమాజ ధర్మాన్ననుసరించి, భర్తకోరిక ధార్మికమైన దైనందువలన, సతీధర్మపాలన కర్తవ్యంగా పాలించి కుంతీదేవి పుత్ర సంతానాన్ని పొందేందుకు అంగీకరిస్తుంది

తెలిసీ తెలియని ముగ్ధగా తాను, పెద్దలచాటుగా వరప్రభావం వలన పుత్రవతి అయినప్పటి సందర్భాన్ని, ఫలితాన్ని కుంతీదేవి చవిచూచింది. ఆ కారణంగా భర్తలోని ఈ సంతానకాంక్ష తాత్కాలికమైనదా దృఢమైనదా అని గ్రహించేవరకూ ఆమె సుముఖతను వెల్లడించలేదు. వయసుతోపాటు ఆమెలో లోకజ్ఞానం, విచక్షణ, ఓరిమి పెరిగాయి కనుకనే నిశ్చలచిత్తంతో భర్తకోరికలోని తీవ్రత పూర్తిగా బహిర్గతమయ్యేంతవరకు వేచివుంది. ఆ తరువాతనే బాల్యకాలంలో కుంతిభోజుని యింట దుర్వాసముని ప్రసాదించిన వరప్రభావాన్ని గురించి భర్తకు తెలుపుతుంది. భర్తకోరిన వేల్పులను ప్రార్థించి ముగ్గురు పుత్రులను పొందుతుంది. ఇంతకుమించి ఆశిస్తే అది కాముకత్వము, అధర్మము కాగలదని సంస్కృత భారతంలోని కుంతీదేవి భర్తను హెచ్చరిస్తుంది. ఆ తరువాత భర్తకోరినందువల్ల మాద్రికి కూడా మంత్రోపదేశంచేసి ఆమెకు కూడా మాతృత్వ భాగ్యం కల్పిస్తుంది.

కాలగతిలో కిందముని శాపంకారణంగా పాండురాజు మరణించగా మాద్రి అతనితో సహగమనం చేస్తుంది. ఐదుగురు పుత్రుల బాధ్యత వహించి కుంతి హస్తినాపురం చేరుకుంటుంది మత్సరగ్రస్తులైన ధృతరాష్ట్ర కుమారుల దుశ్చేష్టలను ఓర్మితో భరించింది. కుంతి అంతటి ఓర్పును, సహనాన్ని చూపటానికి కారణాలు రెండు. తనబిడ్డలైదుగురు క్షత్రియకులోచిత సంస్కారాలతో, మర్యాదలతో పెరగాలన్న సంకల్పం ఒకటి. దైవాంశ సంభూతులైన తన కుమారులు ధర్మపరాయణులైన భీష్మవిదురాది పెద్దల అండలో ఉండి తండ్రివలె రాజ్యాధికారులు కావాలనే ఆశ రెండవది. ఉద్యోగపర్వంలో శ్రీకృష్ణుని ముందు కుంతి వెలిబుచ్చిన కోరిక ఆమెలో అంతర్లీనంగా ఈ ఆశ ఉండివుంటుందని చెప్పేందుకు అవకాశం కల్పిస్తోంది.

ధర్మపక్షపాతంగల ధర్మవేత్తలు భీష్మవిదురులు. వ్యక్తి ధర్మాన్ని అనుసరించి వారు ప్రభువైన ధృతరాష్ట్రుని, అతని పుత్రులను వ్యతిరేకించకపోయినా తన పుత్రులను వారు కాపాడగలరనే నమ్మకం ఆమెకు ఉంది లోకజ్ఞుడు, రాజనీతి చతురుడు అయిన తన మేనల్లుడు పాండవుల రక్షకుడన్న విశ్వాసం కుంతీదేవిలో మొదటినుంచీ కన్పిస్తుంది. వారణావతంలో లక్కయింటి సంఘటన తరువాత విదురుడు ఆపదలను కనిపెట్టి హెచ్చరించి తన పుత్రులకు తరణోపాయం చూపగలడనే విశ్వాసం, ధైర్యం ఆమెలో బలపడ్డాయి. కనుకనే తను శ్రేయోభిలాషి, ధర్మతత్త్వవేత్త అయిన విదురునియింటిలో ఆమె పదమూడు సంవత్సరాలు గడపగలిగింది.

ద్రౌపదీ స్వయంవరానంతరం కొడుకులు భిక్షతెచ్చామని చెప్పగా "మీరైదుగురు వినియోగింపుడ"ని పలికినందుకు నిజం తెలుసుకున్నాక సిగ్గుపడింది. "నానోట అనృతం వెలువడదు. మీరెప్పుడును నామాట అతిక్రమించి చరింపరు" అని అధర్మభీతచిత్తయై ధర్మరాజు ముందు చింతాక్రాంతురాలైంది. మనోవాక్కాయ కర్మలు మూడింటిలో ఏ మార్గానగాని ధర్మభంగానికి ఓర్వలేని ధర్మపరాయణురాలు. వ్యాసుడు వచ్చి ఇది విధి నిర్ణయమని స్వయంగా వివరించేవరకు అధర్మానికి వెఱచి కుంతి భయభీతురాలై తల్లడిల్లింది.

కుంతీదేవి జీవితంలో కష్టాలు, సంఘర్షణలకు అంతులేదు. లోకాపవాద భీతితో తన తొలిచూలు సంతానాన్ని విసర్జించవలసి వచ్చినప్పటికీ కుంతి స్వపరభేదం లేని నిష్కల్మషమైన మాతృమూర్తి. పాండవులు వనవాసానికి తరలి వెళ్ళినప్పుడు, తాను వృద్ధులైన గాంధారీ ధృతరాష్ట్రులతో వారి సేవకై అడవికి వెళ్ళే సమయంలోను ఆమె కడగొట్టు బిడ్డడైన సహదేవుని గురించి ఎక్కువగా చింతించింది. అతడిని జాగ్రత్తగా కనిపెట్టి సేవించమని ద్రౌపదిని హెచ్చరించింది. యుద్ధ సమయంలో నకుల సహదేవులను గూడా వధింపనని కర్ణుని నుంచి రక్షణ పొందింది. ఈ సందర్భంలో కుంతీదేవి గొప్ప ధర్మసంకట పరిస్థితిని, మానసికమైన సంఘర్షణను ఎదుర్కొనవలసి వచ్చింది. ఒక ప్రక్క తన తొలిసంతానం మహావీరుడు. మరొకవైపు తాను పెంచిన కవలలు, తనకు ప్రేమ పాత్రులైనవారు. పాండవుల పక్షంలో చేరమన్న ఆమె ప్రార్థనను కర్ణుడు మన్నించలేదు. అప్పుడామె పాండవులను వధించవద్దని అర్థించింది. అర్జునుని తప్ప మిగిలినవారు చేతచిక్కినా చంపనని అర్జునుని మాత్రం విడువనని కర్ణుడు మాట యిస్తాడు. అర్జునుడు పుట్టినప్పుడు అతడు త్రిలోకవిజేత కాగలడని దేవతలు దీవించారు. అంతేగాక అతనికి కృష్ణుని అండవున్నది. కనుక ఆమె అర్జునుని గురించి దైన్యపడలేదు.

దుర్యోధనుని ఆశ్రయించిఉండి అధర్మద్యూతానికి, కులస్త్రీ పరాభవానికి దోహదంచేసిన కర్ణుడు జన్మచేత మాత్రమే ఆమె కుమారుడు. పెంచినందువలన, ధర్మవర్తన చేత కవలలు ఆమెకు కర్ణుని కన్నా ఎక్కువైన పుత్రులు. అంతేగాక తొలిసంతానాన్ని త్యజించిన గర్భశోకం ఆమె

చిరకాలంనుంచి అనుభవిస్తున్నదే కర్ణుడు పాండవపక్షాన చేరితే ఆమెకు సంతోషమే. చేరకపోయినా ఆమెకు కొత్తగా కలిగే దుఃఖం ఏదీలేదు తన ఐదుగురు కొడుకులలో ఏ ఒక్కరినైనా సరే పోగొట్టుకుని తిరిగి గర్భ శోకం అనుభవించేందుకు ఆమె సిద్ధంగాలేదు

కర్ణుడు మిత్రధర్మాన్ని పాటించాడని, తనను నమ్మిన రారాజును విడిచివచ్చేందుకు అతడు అంగీకరించలేదని అంటారు ఈ విషయం పాక్షికమైన సత్యం మాత్రమే కర్ణుని మిత్రధర్మం కూడా సమస్థాయిలోకాక అంగరాజ్యప్రదానంవలన కృతజ్ఞతాభావంతో కలసి కొంత దాస్యలక్షణాన్ని సంతరించుకొనివుంది. కుంతీదేవి అనుసరించినది సుస్థిరమైన మాతృధర్మం కర్ణుని విషయంలో ఆమె సమాజ నియతికి వ్యతిరేకంగా వర్తించినందువలన ఆమె కన్యామాతృత్వం అధర్మమైంది. ఆ కారణంగా ఆమె మాతృధర్మాన్ని అప్పుడే విసర్జించవలసివచ్చింది ఏ ధర్మం ఆచరణీయం, బలీయం అన్న సంఘర్షణ ఏర్పడినప్పుడు కుంతీదేవి శాశ్వత ధర్మమార్గాన్నే ఎన్నుకుంది సమాజ ధర్మ నిర్వహణ కోసం, వ్యక్తి ధర్మమైన మాతృత్వాన్ని ఆమె విడిచిపెట్టక తప్పలేదు

యుద్ధరంగంలో అశ్వత్థామ విషయంలో ధర్మరాజు అసత్యం చెప్పకతప్పని పరిస్థితివంటిదే కుంతీదేవి కర్ణుని జననకాలంలో ఎదుర్కొన్నది. వ్యక్తి ధర్మం కన్నా సమష్టిక్షేమం, సమాజనియతి బలవత్తరమైనవని కుంతీధర్మరాజులు తమ సాధనలో నిరూపించి చూపించారు. ఏ కారణంవల్లనైనాగాని వ్యక్తిధర్మాన్ని తాత్కాలికంగానైనా విడిచినందుకు ఇద్దరూ దుర్భరమైన మానసికవేదనను అనుభవించారు. కర్ణుని జన్మరహస్యం వెల్లడైన తరువాతనే కుంతి తన దుఃఖాన్ని బయటపెట్టగలిగింది. అగ్రజుని మృతికి కారణభూతుడనైనాననే దుఃఖంతో ధర్మరాజు సకలస్త్రీలోకానికి రహస్యగోపనం లేకుండా శపించాడు. ఆ శాపం తన పాపానికి పరిహారమనిగాని, దుఃఖానికి ఉపశమనమనిగాని కుంతి భావించలేకపోయింది. అందువలననే గాంధారీ ధృతరాష్ట్రులవెంట అడవులకు తరలిపోతూ ధర్మరాజుతో 'సహదేవుని ఏమీ అనకుండా ఏమరకుండా చూడమని దేవతాసముడైన కర్ణుని మనసులోనైనా తలుస్తూ ఉండమని, నేను అతడి జన్మరహస్యాన్ని దాచి మోసంచేశాన"ని వాపోయింది. అంతేకాక ఈ పాపం తన మనసునెప్పుడూ కలతపెడుతుందని, పాప పరిహార నిమిత్తం దానధర్మాలు చేయమని పుత్రుని కోరుతుంది. సమాజపు కట్టుబాట్లకు తలవొగ్గిన స్త్రీహృదయం కుంతిలో స్పష్టంగా కనిపిస్తుంది. ధర్మరాజును దానధర్మాలు చేయమని అర్థించటంలో మరొక భావం కూడా ఒదివుంది. తల్లిదండ్రుల పాపాలు బిడ్డలకు శోకుతాయని ఒక విశ్వాసం ఉంది. అందువలన తల్లియైన తను చేసిన పాపం, దానితోపాటుగా భ్రాతృవధవలన ధర్మరాజుకు శోకినపాపం రెండింటి నివారణ కోసం కూడా అతడిని 'సత్పాత్రములు' సద్భావనతో దానములు' చేయవలసిందిగా ప్రబోధించింది.

ఆశ్రమవాసిగా ఉన్నప్పుడు వ్యాసుడు వారిని చూడవచ్చిన సమయంలో 'దేవతలకే పూజనీయుడవయిన నిన్ను మామగా పొంది నీ కరుణ చూరగొన్నానని" అతడికి, తనకుగల బాంధవ్యాన్ని స్మరించి వ్యాసుని ముందు తన హృదయావేదనను వెల్లడించింది. ఏ పరిస్థితిలో తాను కర్ణునికి జన్మనియవలసివచ్చిందో, లోకాపవాదానికి వెరచి ఏ విధంగా ఆ పుత్రుని విసర్జించిందో తానే స్వయంగా చెప్తుకుంది. ఆనాటి పాపానికి నేటికీ మనసులో కుములుతుంటానని దుఃఖించింది నా పాపభీతిని దయతో పోగొట్టమని వేడుకుంది. సుదీర్ఘమైన ఆమె జీవితంలో నిత్యవ్యవహారంలో నిరంతరం పుత్రులక్షేమాన్ని కోరుతూ, వారు ఎదుర్కొంటున్న అవమానాలను, దైన్యాలను సహిస్తూ వేదనతో కాలం గడిపింది. అయినప్పటికీ కుంతి హృదయాంతరాళంలో బాల్య కాలంనాటి సంఘభీతి, పాపభీతి ఆమెను జీవితమంతా వెన్నంటుతూనే ఉన్నాయని ఆమె వ్యాసునితో చెప్పిన మాటల వలన తెలుస్తుంది.

వ్యాసుడు ఆమెను అనేకవిధాల ఓదార్చి విధివిధానం ఆ విధంగా ఉందని, సూర్యుని వరంవలన నీలో అపవిత్రతలేదని, నీ సచ్చరిత్రవలన నీవు కులంలోనే అగ్రగణ్యవని పేరుపొందావని, ఈ విషయాన్ని, నీ మనసును నేనెఱుగుదును దుఃఖపడవద్దని అనునయిస్తాడు. వ్యాసుని నుండి తత్త్వబోధతో కలసిన ఓదార్పు లభించినా, వ్యాసానుగ్రహంచేత గంగాజలాలలో కర్ణాదిమృతవీరులను చూసినా కుంతి హృదయావేదన పూర్తిగా ఉపశమించిందా లేదా అనే విషయం భారతంలో ఎక్కడా ప్రస్తావనకు రాదు. ధృఢచిత్తురాలైన క్షత్రియకాంత కావటంచేత, ధర్మసాధనలో జీవితాన్ని కఠోరమైన నియమనిష్ఠలతో గడిపినందువలన మాత్రమే కుంతీదేవి తనకు, తన పుత్రులకు సంభవించిన కష్టనష్టాలను భరించగలిగింది.

కర్తవ్యపాలన తప్ప మరొక ధర్మాన్ని ఎఱుగని కుంతీదేవి తన కుమారుల విజయోత్సాహానికిగాని, రాజ్యప్రాప్తికిగాని ఉప్పొంగిపోలేదు. వారు క్షాత్రధర్మాన్ని నిర్వహించారని సంతృప్తిపొందింది. పుత్రుల రాజ్యలాభంవలన తన కష్టాలుతీరి తనకు తిరిగి రాజభోగాలు, వైభవం, రాజమాతగా గౌరవం లభిస్తాయనే భావంగాని, ఆశ ఆనందాలుగాని ఆమెలో లేశమాత్రమైనా ఉత్పన్నంకాలేదు. పుత్రశోకంతో దుఃఖితులైన గాంధారీ ధృతరాష్ట్రులను కనిపెట్టివుండి, వారి దుఃఖాన్ని మరపింపచేయటం తన విధిగా భావించింది. వారిని సేవిస్తూ వారితో వానప్రస్థానికి తరలివెళ్ళటమే తన పరమధర్మంగా తలచింది. తనను వారించిన ధర్మరాజుతో ఈ వృద్ధులు తనకు అత్తమామలని, వీరిని అనుసరించటమే తనకు ఇష్టమని పలుకుతుంది. అంతేకాక 'వీరిని సేవించవలసిన దానను నేనే. మీరు వీరితో అడవులకు రాగలరా? నిస్సహాయులైన వీరు రాజగృహాన్ని విడిచి వెడితే ఇంటవుండేందుకు నా మనసు నిలుస్తుందా' అని అతడినే ప్రశ్నిస్తుంది. ఆమె మాటలలో వృద్ధులను సేవించాలనే భారతీయ కుటుంబధర్మం స్పష్టంగా కనిపిస్తుంది. పాండురాజు

జీవితకాలంలో అతడితోను, తరువాత పుత్రులదగ్గర భోగాలను అనుభవించినప్పుడు, భోగాలను విసర్జించవలసినప్పుడు కూడా కుంతీదేవి ధర్మమార్గాన్ని గురించి ఆలోచించిందేతప్ప వైభవాలను, యశస్సును గురించి తలచలేదు. కౌరవుల కారణంగా పాండవులు రాజ్యభ్రష్టులైతే ఆ కౌరవులయింట ఉండనని విదురుని ఇంట పదమూడు సంవత్సరాలు తలదాచుకున్న సాధ్వి కుంతీదేవి

ఎటువంటి పరిస్థితులలోనైనా కుంతిలో ధర్మనిర్వహణ, ధార్మికదృష్టితప్ప మరొక ఆలోచన కలుగలేదు. గాంధారీ ధృతరాష్ట్రులతోకలసి వనవాసానికి తరలిపోతూ, తల్లిగా ధర్మరాజును ఊరడించి తమ్ములను, ప్రజలను సంతృప్తిపఱచమని కోరుతూ, ఎట్టి పరిస్థితులలోను ధర్మాన్ని మాత్రం మరువవద్దని ప్రబోధిస్తుంది. ఎంతటి సంకటపరిస్థితి ఎదురైనా ధర్మబద్ధమైన కర్తవ్యాన్ని విడువరాదనే దృఢనిశ్చయంగల ధర్మసాధకులు ఈ మాతాపుత్రులు. కుంతీదేవి కర్తవ్యపాలనను, గురుజనసేవలో ఆమె చూపించే అనన్యసామాన్యమైన శ్రద్ధను వ్యాసధర్మరాజులు తమను చూడవచ్చినప్పుడు ధృతరాష్ట్రుడు ఎంతగానో శ్లాఘించాడు. వనంలో దావానలంలో చిక్కుకున్నప్పుడు కూడా కుంతి గాంధారీ ధృతరాష్ట్రులను విడువకుండా వారివెంట వుంది. మృత్యుముఖంలో ఉన్నప్పుడు కూడా కర్తవ్యపాలన నుంచి చలించని ధీరురాలు. ఇది కుంతీదేవి నిర్మోహత్వానికి ధర్మసాధనకు పరాకాష్ఠ. మహాప్రస్థాన స్వర్గారోహణ సమయాలలో ధర్మరాజులో కలిగిన దేహాభిమాన నిర్వేదమే అంత్యకాలం సమీపించినప్పుడు కుంతిలోనూ కలిగింది.

శరీరాన్ని వదలవలసిన సమయంలో కుంతీదేవిలో సూచనగా ప్రకటితమైన నిర్మోహత్వం, నిస్సంగత్వం, నిశ్చలత్వం, ధార్మికత స్వర్గారోహణంలో ధర్మరాజులో వికసించి ప్రస్ఫుటంగా దర్శనమిస్తాయి. ధర్మసాధనలో స్త్రీ పురుషులిద్దరు సమానులు. ఎవరి మార్గంలో వారు ఎంతటి కష్టంవచ్చినా ధర్మాన్ని విడువరాదు. ధర్మమే మానవుని పరమపదానికి చేర్చే మార్గమని తమ జీవితాల ద్వారా నిరూపించిన ఉత్కృష్టధర్మ సాధకులు వీరు. లౌకికమైన ఉద్వేగాలు, దీర్ఘకాలం పీడించిన కష్టాలు ఏవీ వీరి ధర్మసాధనకు అవరోధం కాలేదు. వీరి చిత్తస్థైర్యాన్ని బలహీనపరచలేదు. మానవ మనస్సంబంధమైన దుఃఖానికి కుంతీదేవి, ఆవేశానికి ధర్మరాజు కొన్ని సందర్భాలలో తాత్కాలికంగా గురైనారు. అయినప్పటికీ ఆ ఉద్వేగాలు వీరి ధర్మసాధనను చలింపచేయలేదు. మానవులు తమ సాధనద్వారా లౌకిక, ఆధ్యాత్మిక ధర్మ మార్గాలను ఏ విధంగా నిశ్చల చిత్తంతో అనుసరించాలి అనే విషయాన్ని వీరి జీవితాలు నిరూపిస్తున్నాయి.

## ధర్మాంశసంభూతుడు - యుధిష్ఠిరుడు

'ధర్మజుఁడు ధర్మతరువర్యునందు ఘనస్కంధ'మని మహాభారతం వర్ణించింది. ధర్మతరువైన ధర్మరాజుకు మూలం శ్రీకృష్ణుడు. వృక్షానికి జీవశక్తి, చైతన్యం మూలమైన వేరునుంచే లభిస్తాయి.

అదే విధంగా ధర్మరాజనే ధర్మద్రుమానికి చైతన్యశక్తి, ధర్మస్వరూపుడైన శ్రీకృష్ణునినుంచి లభించింది. ధర్మరాజు తన ధర్మసాధనను సిద్ధధర్మస్వరూపుడైన శ్రీకృష్ణుని ఆధారం చేసుకుని కొనసాగించాడు సిద్ధమైన, స్థిరమైన, శాశ్వతమైన మూలం ఆధారంగా ఉన్నందువలననే ఎంతటి పెనుగాలులు ఎదురైనా యుధిష్ఠిరమహాద్రుమం సుస్థిరంగా నిలువగలిగింది.

శ్రీకృష్ణుడు నిలుపదలచిన ధర్మం సమాజశ్రేయస్సుకు, ఆత్మజ్ఞానసిద్ధికి ఆలంబనమైన ఒకానొక స్థిరమైన జీవననియతి. ఆ నియతి లేదా ధర్మానికి సాధనమార్గాన్ని చూపించిన వ్యక్తి ధర్మరాజు. సిద్ధధర్మస్వరూపుడైన శ్రీకృష్ణుని దృఢంగా విశ్వసించి జీవించిన సాధకుడు. ధర్మాన్ని అనుసరించటం, ధర్మంపట్ల అచంచలమైన విశ్వాసం ధర్మరాజు స్వభావంగా రూపొందాయి. 'ధర్మ తత్త్వజ్ఞుడైన ధర్మరాజు ధర్మమార్గాన్ని ఏల తప్పగలడు' అని ద్రౌపదీ వివాహసందర్భంలో వ్యాసుడు ధర్మరాజు ధార్మికబుద్ధిని ప్రశంసించాడు. ధర్మమే చేదోడై తమను రక్షించగలదని, తమకు ప్రాపుగా ధర్మరక్షకుడైన శ్రీ కృష్ణుడున్నాడని పరిపూర్ణ విశ్వాసంతో సంజయునితో చెప్పగలిగిన ధర్మ పరాయణుడు ధర్మరాజు.

ఇటువంటి ధర్మరాజు జన్మయే ఒక విశేషంగా సంభవించింది. కురువంశ రక్షణయే కర్తవ్యంగా గల భీష్ముడు ధృతరాష్ట్ర పాండురాజులను పెంచి పెద్దచేసి వారి వివాహాలను జరిపిస్తాడు. సుబల రాజపుత్రి గాంధారికి సుతశతలాభ వరం ఉందని తెలిసి ఆమెను ధృతరాష్ట్రునికిచ్చి వివాహం జరిపిస్తాడు. కురువంశాన్ని వృద్ధిచేయటమే భీష్ముని వాంఛ. మహావీరుడైన పాండురాజు స్వయంవరంలో కుంతిని, తరువాత మహోత్సవంగా మాద్రిని పరిణయమాడుతాడు. విధివిలాసం వలన మహర్షి శాపానికిగురై, రాజభోగాలను విసర్జించి, ఉత్తర కురుభూములకు తరలిపోతాడు. పుత్రసంతానం లేనివారికి స్వర్గద్వారప్రవేశం దుర్లభమనివిని క్షేత్రజ సంతానం కోరి కుంతీదేవిని అభ్యర్థిస్తాడు. భర్తమాటను మన్నించి కుంతి తనకు దూర్వాసముని ప్రసాదించిన మంత్రాన్నిగురించి పాండురాజుకు తెల్పుతుంది. ఏ దేవతను ఆరాధించి పుత్రుని పొందగలనని పాండురాజును ప్రశ్నిస్తుంది. అప్పుడతడు 'లోకాలన్నిటికీ ధర్మమే మూలంగనుక ధర్ముని అనుగ్రహంతో తనకు తొలిసంతాన భాగ్యం కలిగించమని అర్థిస్తాడు. అనంతరం కుంతి ఏకాగ్రచిత్తంతో సభక్తిపూర్వకంగా మంత్రం జపించి ధర్ముని కృపవలన పుత్రుని పొందుతుంది. పాండురాజు కోరికకు ఈ తొలిపుత్రుని లక్షణాలకు గల సంబంధం గమనింపదగినది. పాండురాజు మహావీరుడైన కుమారునిగాని, ఉత్తమ లక్షణాలు గలిగిన వారసునిగాని కోరలేదు. తొలిసంతానం ధార్మికబుద్ధి గలవాడై ఉండాలని ధర్మదేవత అనుగ్రహాన్ని కోరటం పాండురాజు ధర్మవర్తనకు నిదర్శనం. మానవ జీవితానికి ఆధారమైన చతుర్విధ పురుషార్థాలలో ధర్మమే మొదటిది, ముఖ్యమైనది. ధర్మానికి కట్టుబడినవారికి మిగిలిన మూడు పురుషార్థాలు వాటంతట అవే సమకూరగలవన్నది భారతీయ

విశ్వాసం ధర్ముని అంశతో జన్మించిన ధర్మరాజులో సకల సద్గుణాలు విలసిల్లాయి. సంస్కృత మహాభారతంలో ధర్ముడు, యముడు వేర్వేరని ఉన్నదని, వారి అంశలతో జన్మించిన వారే విదుర ధర్మజులని ఒక వాదం ఒకప్పుడు తలెత్తింది[50]. కాని కవిత్రయంవారు మాత్రం విదుర ధర్మజులిద్దరు యమధర్మరాజు అంశతో జన్మించినవారనే వర్ణించారు.

బాల్యంలో కురుభూముల్లో మునివాటికలలో నివాసం, మునిగణసేవనం, ధర్మరాజులో సాత్త్వికగుణవికాసానికి దోహదం చేశాయి. భగవద్గీతలో శ్రీకృష్ణుడు - అహింస, సత్యం, అక్రోధనం, త్యాగం, శాంతి, ఉదారబుద్ధి భూతదయ, అలోలత్వం, మృదుస్వభావం, చపలత్వం లేకుండుట, కూడని పనులు చేయటానికి సిగ్గుపడటం, తేజస్సు, క్షమ, ధృతి, శౌచము, అద్రోహబుద్ధి, అధికమైన అభిమానం గాని దురభిమానంగాని లేకుండుట, గర్వంలేకపోవుట[51], మొదలైన గుణాలు దేవతాసంబంధమైన సంపత్తునందు పుట్టినవారి లక్షణాలని వివరించాడు. ఈ గుణాలన్నీ ధర్మరాజులో స్వాభావిక లక్షణాలై విలసిల్లాయి. ఈ గుణాలనే ధర్ముని లక్షణాలని మహాభారతం వర్ణించింది. వీటన్నింటిలోను క్షమదమాలు, సత్యాహింసలు, శ్రేష్ఠములైన ధర్మాలని మహాభారతం అనేక సందర్భాలలో వివరించింది. ఈ గుణాలన్నింటిని సహజలక్షణాలుగా కలిగిన ధర్మరాజు సాధువర్తనుడుగా వినయాన్వితుడైన రాజయోగిగా ప్రస్తుతిపొందాడు.

తండ్రిని కోల్పోయిన పాండవులను, కుంతీదేవిని మహర్షులు హస్తినాపురానికి వెంటబెట్టుకుని వచ్చి భీష్మద్రోణాది పెద్దల సమక్షంలో వారిని ధృతరాష్ట్రునికి అప్పగించి తండ్రివలె కాపాడమని చెప్పి మరలిపోతారు. పినతండ్రి పుత్రులుగా, దాయభాగవారసులుగా వచ్చిన పాండవుల ఉనికిని దుర్యోధనుడు సహించలేక వారిని అనేక విధాలుగా హింసిస్తాడు. కౌరవులు ఎంత వేధించి ఎన్ని ఇక్కట్లకు గురిచేసినా ధర్మరాజు తన క్షమాగుణంతో, ఓరిమితో సహించి తన సాత్త్వికస్వభావాన్నే చూపిస్తాడు. లాక్షాగృహదహనం తరువాతకూడా తమకు కలుగుతున్న అనుభవాలను, సమస్యలను, పరీక్షలుగా స్వీకరించాడు తప్ప ఎవరినీ బాధ్యులనుచేసి దూషించలేదు. దుఃఖపడలేదు. వీనిలో ఏ ఒక్కటి శాశ్వతంగా నిలువదనీ, కాలవిపర్యయం వలననే దుఃఖాలు సంభవిస్తాయని వ్యాసుడు వివరించిన సూక్తిని ధర్మరాజు దృఢంగా విశ్వసించాడు. పరిహాసానికైనా అసత్యం పలకటం అధర్మమని తన మనసు అందుకు ఇయ్యకొనదని కృష్ణద్వైపాయనుని సన్నిధిలో వెల్లడించిన సత్యవాక్ప్రియుడితడు. సత్యం, త్యాగం, అక్రోధనం, దయ అనే నాలుగు సాత్త్విక గుణాలను అనుక్షణం ఆచరణలో పాటించినవ్యక్తి ధర్మరాజు.

---

★ 50. 'భారత పరిశీలనము - ధర్మస్వరూపము' శ్రీకృష్ణభిక్షు. - ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక. సం-50, పు-55.
★ 51. భగవద్గీత 16-33

ఇంతటి సత్యవాక్పాలకుడైన యుధిష్ఠిరుడు యుద్ధమధ్యంలో అశ్వత్థామ మరణించాడనే అబద్ధం పలకటమేకాక గురుద్రోహానికి కూడా తలపడడానికి కారణం ఏమిటి? ఇది అతి క్లిష్టమైన సన్నివేశం. ధర్మరాజు అనుసరించే వ్యక్తిధర్మానికి, శ్రీకృష్ణుడు ప్రతిష్ఠించదలచిన శాశ్వత ధర్మసంస్థాపనకు మధ్య సంఘర్షణ ఏర్పడిన సమయం ఇది.

ధర్మరక్షణకు, సాధు సంరక్షణకు, దుష్టశిక్షణకు మాత్రమే తనను తాను సృష్టించుకుంటానని చాటిన శ్రీకృష్ణుడు స్థాపించదలచిన ధర్మం సమాజ శ్రేయోదాయకమైనది. లోకప్రయోజనకరమైన ధర్మస్థాపన కోసం వ్యక్తిగతమైన ధర్మాన్ని తాత్కాలికంగా ఉల్లంఘించక తప్పని పరిస్థితిలో కృష్ణుడు ధర్మరాజును ఆ వాక్కును ఎలుగెత్తి పలుకమని ప్రోత్సహించాడు. 'ప్రాణాపాయ పరిస్థితి ఎదురైనప్పుడు ధర్మభంగం చేసినట్లు కనిపించినప్పటికీ, ఉత్తమమైన ప్రయోజనాన్ని ఆశించినప్పుడు తప్పనిసరిగా మార్గాంతరాన్ని అనుసరించవలసి వస్తుందని, అటువంటి మార్గాంతరాన్నే ఆపద్ధర్మం అని అంటారని మహాభారతమే వివరించింది. ఆపద్ధర్మాన్ని అనుసరించి శ్రీకృష్ణుని ప్రోద్బలంతో ధర్మరాజు గొంతెత్తి బిగ్గరగా 'అశ్వత్థామ చచ్చెన'ని ద్రోణునికి వినరాకుండా 'కుంజరమ'ని అన్నాడు. స్వాభావికమైన సత్యమార్గాన్ని తప్పినందుకు, గురు ద్రోహానికి పాల్పడి అతని మరణానికి కారణమైనందుకు దారుణమైన హృదయావేదనకు, పశ్చాత్తాపానికి ధర్మరాజు గురైనాడు. భారతీయ ధర్మశాస్త్రం ప్రకారం 'రాజ్యాంతే నరకం ధృవం' అన్న సూక్తిని అనుసరించినా, పాశ్చాత్యుల సిద్ధాంతాన్ని బట్టి 'Everything is fair in war and love' అని విశ్వసించినా, ఆపద్ధర్మం అనే ధర్మసూక్ష్మాన్ని పాటించినా ధర్మరాజు నరకదర్శనానికి కారణం అసత్యవచన ప్రలాపమేనని చెప్పాలి. సత్యవాక్పాలకుడైన ధర్మరాజు వ్యక్తిధర్మభంగానికి వెఱచి కుంజర శబ్దాన్ని మెల్లిగా పలికినప్పటికీ ఆ వాక్కుకు గల ప్రయోజనం అసత్యప్రచారమే గనుక అది బుద్ధిపూర్వకంగా ఉచ్చరించిన అబద్ధమే అయింది. వాక్కుకన్నా బలమైంది సంకల్పం. ఈ సందర్భంలో ద్రోణునిచేత అస్త్రసన్యాసం చేయించటమే ధర్మరాజు సంకల్పం. అతని సంకల్పం ధర్మవిరుద్ధమైనది కావటంవలన అసత్యవాక్కుకుగల ఫలితాన్ని అతడు అనుభవింపక తప్పలేదు. తత్పాపఫలితంగానే అతడు నరకలోకాన్ని దర్శించి కొద్దికాలమైనా నరకయాతనను అనుభవించాడు. విరాటనగరంలో అజ్ఞాతవాసంలో ఉన్నప్పుడు కూడా అవసర సందర్భాలలో యుధిష్ఠిరుడు నర్మగర్భంగా పలికాడేతప్ప ఎట్టి పరిస్థితులలోను తన సత్యవ్రతాన్ని విడువలేదు. కాని విపత్కర పరిస్థితిలో తన వ్యక్తిధర్మాన్ని వదలి ఆపద్ధర్మాన్ని పాటించి, ధర్మస్వరూపుడైన శ్రీకృష్ణుని సమక్షంలో అతడి ప్రోత్సాహంతోనే తన దృఢవ్రతాన్ని ధర్మరాజు సడలింపక తప్పలేదు. తత్ఫలితాన్ని అనుభవించకుండా తప్పించుకోనూలేదు.

వ్యక్తిగతమైన ధర్మాధర్మ వర్తనలకు, వాటివాటి ఫలితాలకు కార్యకారణ సంబంధం ఉంటుందని మహాభారతం ఎన్నోవిధాల ప్రబోధించింది. ఇవి ఏవిధంగా పరిణమించినా శాశ్వత

ధర్మస్థాపనమే మానవలోకానికి క్షేమకరమనే అంశాన్నే కృష్ణుడు ప్రబోధించాడు. వ్యక్తి ధర్మపాలన మనిషికి ప్రధానం. శాశ్వత ధర్మ రక్షణలో వ్యక్తి ధర్మాన్ని భంగపరచినా, తత్ఫలితం అనుభవించవలసివచ్చినా వెనుదీయరాదనే అంతరార్థం ఈ ఘట్టంలో నిక్షిప్తమైఉంది.

హర్షభయక్రోధాదులనుంచి, సమస్తమైన ఉద్వేగాలు వ్యాకులతలనుంచి ప్రభావితుడు కానటువంటివాడే నాకు ప్రియుడని, ధర్మరాజులో ఈ లక్షణాలన్నీ ఉన్నందువల్లనే అతడు నాకు ప్రియుడు, ఇష్టుడు అని శ్రీకృష్ణుడు అనేక సందర్భాలలో పలుకుతాడు. కేవలం వయస్సులో పెద్దవాడైనందువల్లనేకాక ధర్మవర్తన వలన కూడా ధర్మరాజు పూజనీయుడని వెల్లడించేందుకు కృష్ణుడు ధర్మరాజకు నమస్కరించేవాడు. అతడి ఆజ్ఞలేనిదే తాను నగరాన్ని వదలలేనని తన గౌరవాన్ని వ్యక్తం చేస్తాడు. తన శరీరప్రాణములు, సకల బంధువర్గము, సర్వసంపదలు ధర్మరాజు సేవకోసమేనని అతడి ఆజ్ఞకు బద్ధుడై ఉండటమే తన వ్రతమని కృష్ణుడు చాటిచెప్పాడు. జన్మాంతరంలో నరనారాయణులైనందున అర్జుననియందు తనకు అధికమైన వాత్సల్యం ఉన్నప్పటికీ ధర్మరాజుపట్ల తనకుగల గౌరవభావం మిక్కుటమైనదని వివరిస్తాడు. భగవంతుడు ధర్మసాధనపరులైన వారికి వశవర్తియై ఉంటాడనేందుకు కృష్ణుని వాక్కులే నిదర్శనం.

ఇంతేకాక ధర్మరాజు ధర్మమార్గాన్నితప్ప మరొక విషయాన్ని గురించి ఆలోచించడని, ధర్మముతప్పి లభించిన ఇంద్రపదవినైనా తృణీకరిస్తాడని కృష్ణుడు ధర్మరాజు ధార్మికబుద్ధిని ఉద్యోగపర్వంలో రాజలోకసముఖంలో ప్రశంసిస్తాడు.

అటువంటి ధర్మపరాయణుడైన యుధిష్ఠిరుడు, అజాతశత్రువని, పేరుపొందినవాడు, ఒక మహాయుద్ధానికి సన్నద్ధుడై, పుత్రమిత్రబాంధవ నాశనానికి కారకుడయ్యాడు. సంజయుని మాటలలో 'రక్తపుకూటికి' ఆశ పడ్డాడు. ఇది ఎలాంటి ధర్మం?

క్రోధం మనసులో జనించే భావం, ఇంద్రియనిగ్రహం, సంయమనం స్వభావంగాగల ధర్మజుడు అరిషడ్వర్గాలను జయించిన నిగ్రహపరుడు. కపట జూదంలో ఓడినప్పుడుగాని, ద్రౌపదీ పరాభవ సమయంలోగాని, దుర్యోధనాదులు తమను అవమానించినప్పుడుగాని తన ప్రత్యర్థులపట్ల ఎటువంటి క్రోధాన్ని ప్రకటించలేదు. తన కారణంగా సభామర్యాదకు విఘ్నం కలుగకుండా, పరులకు హాని సంభవించకుండా, ఉద్వేగానికి, చిత్తవైక్లబ్యానికిలోనుగాక అక్రోధనుడై నిలచాడు. ఆయా సందర్భాలలో ఇతరులకు ధర్మరాజుపట్ల ఈరాష్యద్వేషాలు, చులకనభావం కలిగాయేతప్ప అతడి మనసుమాత్రం చలించలేదు. అతడంత నిశ్చలంగా నిలవటానికి కారణం అతడి ధర్మసాధనయే. ధర్మరాజులోని క్షమ, అక్రోధన స్వభావం, ధర్మవర్తనలను సంజయుడు ధృతరాష్ట్రునికి బహుధా వివరించాడు. యుధిష్ఠిరుని ఓరిమిని మనవారు వెఱపుగా భావిస్తున్నారు, అదివారి

అజ్ఞానం అతడు 'మెత్తనిపులి'' అని హెచ్చరించాడు. జూదంలో అతని ఓటమికి కారణం అతని ధార్మిక బుద్ధితప్ప అసమర్థతకాదని ధృతరాష్ట్రునికేకాక లోకానికికూడా సంజయుడు వెల్లడించాడు.

యుద్ధానంతరం కర్ణుడు తన అగ్రజుడని తెలిసిన తరువాత అతడి మరణానికి తాను కారకుడైనందుకు ధర్మజుడు దుఃఖించాడు. కర్ణుని వధించకుండా తనకు ముఖం చూపవద్దని అర్జునుని ప్రేరేపించి భ్రాతృహత్యాపాతకానికి ఒడిగట్టినందుకు ఆవేదనపొందాడు పశ్చాత్తప్తుడయ్యాడు. ఆ దుఃఖ తీవ్రతలో స్త్రీలకు రహస్యగోపనంలేకుండా శపించాడు. తల్లి కారణంగా స్త్రీజాతినే శపించేందుకు దారితీసిన పరిస్థితులకు దుఃఖించాడే తప్ప క్రోధాన్ని చూపలేదు. ఎటువంటి స్థితిలోను తన సంయమనాన్ని కోల్పోలేదు. సర్వవిధాలా సంధికోసం ప్రయత్నాలు జరిపిన తరువాతనే యుద్ధానికి సిద్ధపడ్డాడు దుర్యోధనుని స్వభావం తెలిసినందువలననే సంధికీ, యుద్ధానికీ కూడా ప్రయత్నాలు చేశాడు. ఇది అతని రాజనీతి చాతుర్యానికి, లోకజ్ఞతకు నిదర్శనం, అందువలననే సంజయుడు 'సానురేగెనేని తల పాలమునగాని నిలువదు సుమ్మీ' అని హెచ్చరిస్తాడు. 'సంయమబుద్ధిగల యుధిష్ఠిరుడు అజాతశత్రుడని అట్టివాడు అలిగితే ఎదురు నిలువరాదని కృష్ణుడు కూడా కౌరవసభలో ధర్మరాజు క్రోధరహితబుద్ధిని ప్రశంసిస్తాడు. ధర్మరాజు సంజయునితో 'కోపంబునిగ్రహింపదగు నహింసయు యుత్తమ ధర్మంబగునట్టినను వంశ దూషకులును లోకకంటకులునగు పాపాత్ముల నిర్మూలంబుగా చెఱచుట ధర్మంబని పెద్దలచేత విందు మదియట్లుండె సంగ్రామంబు రాజులకు ధర్మంబవుంగాదని నీవుచెప్పు'మని క్షాత్రధర్మాన్ని వివరించి తమ యుద్ధం కూడా ధర్మనిర్వహణలో భాగమేనని పలుకుతాడు. ఇది ధర్మంకాదని నీవు చెప్పగలవా అని సంజయుని ఎదురు ప్రశ్నిస్తాడు. తాము క్రోధం పగ కారణంగాగాని, దురాశాపూరితమైన బుద్ధితోగాని సమరానికి సిద్ధపడటంలేదని స్పష్టంగా చెప్పాడు.

అట్టి అజాతశత్రువుకూడా సూక్ష్మమైన అలుకను పొందిన సందర్భాలు మహాభారతంలో రెండు కన్పిస్తాయి. మొదటిది సంజయ రాయబార సందర్భంలో రెండవది కర్ణుని వధించకుండా అర్జునుడు మరలివచ్చిన సమయంలో సంజయుడు భీష్మాది కురువీరుల పేర్లుచెప్పి వారిని జయించటం మీకు అసాధ్యమని పలికినవేళ ధర్మరాజులో క్షాత్రం ఒక్కసారిగా ఉప్పొంగింది. అది 'వెడవెడయలుక'గా బహిర్గతమైంది. ఆ అలుకను అతి స్వల్పకాలంలోనే సౌమ్యంగా మార్చుకొని. తమశక్తిని, వాసుదేవుని చేదోడును కౌరవులకు వెల్లడించమని సంజయునితో పలుకుతాడు.

కర్ణుని బాణఘాతాలకు నొచ్చి అర్జునునిపట్ల 'అలుకగదిరి' కఠినంగా పలుకుతాడు. ఇక్కడ శారీరకమైన బాధను మించినది కర్ణుని ఎదుర్కోవాలనే ఆశయం. అందుకు సమర్థుడైనవాడు, మొదటినుంచి కర్ణుని ప్రతిస్పర్థియైన అర్జునుడొక్కడే. అతనిని రెచ్చగొట్టకపోతే, అతడి శౌర్యాన్ని

గురించి కఠినంగా, నిందాపూర్వకంగా పలుకకపోతే కర్ణుని నిగ్రహించటం సాధ్యంకాదు కనుకనే కార్యవాది అయి యుధిష్ఠిరుడు అర్జునునిపట్ల అలుకను ప్రదర్శించాడు ఈ రెండు సన్నివేశాలలోను అతడిలో పొడమినది అలుకమాత్రమే - క్రోధంకాదు అరిషడ్వర్గాలను అణచివుంచటం, కామ క్రోధాలను అదుపులో ఉంచుకొనటం యోగం, స్థిత ప్రజ్ఞుల లక్షణమేకాని కార్యవాదియైనప్పుడు సమయానుకూలంగా వానిని బహిర్గతం చేయకుండా అణచివేయటం జడుల, నిర్వీర్యుల లక్షణం అనిపించుకుంటుంది. అందులోను క్షాత్రధర్మ నిర్వహణలో అవసరమైన తావుల క్రోధాది గుణాలను బహిర్గతం చేయక తప్పదనే ధర్మసూక్ష్మం తెలిసినవాడైనందున ధర్మరాజు అలుకను ప్రదర్శించాడు. అతడి అలుకకూడా ధర్మబద్ధమైనది, తాత్కాలికమైనది, అవసరమైనది కావటంచేతనే అతడు అజాతశత్రువైనాడు యుద్ధపరిణామం ఎప్పుడైనా రక్తపాతమే అదే కురుక్షేత్రంలో సంభవించింది. ఐదుగురికి ఐదూళ్ళు చాలని అడిగినా కౌరవులు తిరస్కరించినందువల్లనే యుద్ధం అనివార్యమైందని లోకానికి చాటిచెప్పాడు. తాను యుద్ధం రాజ్యకాంక్షతో చెయ్యలేదని, తమ్ములను రాజ్యపాలన చెయ్యమని యుద్ధానంతరం ధర్మరాజు అర్థిస్తాడు సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పినట్లుగా 'అధర్మము మీమీద పెట్టిగాని యుద్ధానికి ధర్మరాజు సిద్ధపడడన్న' మాట అక్షరసత్యం. ధర్మభంగం సంభవించకుండా ఎదిరిపక్షాన్ని ఎదుర్కొనటం యధిష్ఠిరుని రాజకీయం. అతడికి ఎవరిమీద కోపంగాని ద్వేషంగాని ఉండవు ఏ కార్యమైనా ధర్మబద్ధంగానే చేస్తాడు. అలాగే యుద్ధంకూడా చేశాడు.

మానవజీవితాన్ని నడిపించే 'అధిభౌతిక, అధిదైవిక ఆధ్యాత్మిక'[52] ధర్మసాధనను పరిపూర్ణంగా ధర్మరాజు నిర్వహించిన సన్నివేశాలు మూడు మహాభారతంలో ప్రధాన ఘట్టాలున్నాయి. ఇవి ధర్మరాజు ధార్మికవర్తనకు ఋజువుగా నిలుస్తాయి. జూదసమయంలో, శాంత సంయమనాలను వహించి పరమోదాత్తమైన ఆధిభౌతిక ధర్మసాధకుడైనాడు. యక్ష ప్రశ్నల సందర్భంలో మానవ సంబంధమైన జన్మబంధాలకు, లౌల్యానికి అతీతుడై నిజాంశస్వరూపుడైన ధర్మదేవతను మెప్పించి ఆధిదైవిక ధర్మనిర్వహణలో అద్వితీయుడైనాడు. అటుపైన స్వర్గారోహణ పర్వంలో భౌతిక, ఆత్మబంధాలకు అతీతమైన శాశ్వతమైన ధర్మాన్ని వెలయింపజేశాడు ఆధ్యాత్మిక మార్గంలో ధర్మాన్ని ధర్మంతోనే నిలపటం సంభవమని ఎటువంటి పరిస్థితులలోను సుస్థిరమైన ధర్మాన్ని విడువరాదనే పరమసత్యాన్ని నిరూపించాడు 'ధారణా ద్ధర్మమిత్యాహుః' ధరింపదగినది ధర్మమనే సూక్తిని సాధన మార్గంలో నిర్వచించి చూపాడు.

---

★ 52. అధిభూతము నశించెడు స్వభావము గలది - శరీరము. అధిదైవికమనగా అధి భూతమునందుండు సచేతనయగు అదిష్ఠాత. ఆధ్యాత్మికమనగా దేహి స్వస్వరూపము లేక జీవాత్మ ఆధ్యాత్మము - భగవద్గీత 8-3,4 (జ్ఞానదీపిక వ్యాఖ్య - స్వామి ప్రణవానంద)

సంస్కృత మహాభారతం అంధత్వం కారణంగా ధృతరాష్ట్రుడు రాజ్యాధికారాన్ని కోల్పోయాడని స్పష్టంగా చెప్పింది ఆంధ్రమహాభారతం ధృతరాష్ట్రుని ప్రభువుగా చెప్పినప్పటికీ పాండుపుత్రులు పితృరాజ్యానికి అధికారులని వర్ణించింది 'దక్కెను రాజ్యమని' ధృతరాష్ట్రుడు తమ్ముని రాజ్యము మ్రింగజూచాడని. 'పాండురాజుపాలించిన భూమికై ఆశపడుట తగదని' తిక్కన రాజ్యం పాండురాజుదేనని శ్లేషార్థంతో ధ్వనింపజేశాడు. భీష్మ విదురాది పెద్దలు 'పంచి కుడుచుటమేలని' ప్రబోధించారు ఏ విధంగా చూసినా ధర్మరాజు ధర్మబద్ధమైన రాజ్యాధికారి అన్నదే మహాభారత తాత్పర్యం.

పాండవులు హస్తినకు చేరినప్పుడు ధృతరాష్ట్రుడు మొదటవారిని దయతో చేరదీసినా వారికి రాజ్యభాగం పంచి ఇవ్వాలనే సమయం వచ్చినప్పుడు వెనుదీశాడు. రెండురకాలైన మనోదౌర్బల్యాలకులోనై పాండవులను ఏ విధంగానైనా తప్పించాలని ప్రయత్నించాడు. అతడిలోని మొదటి దౌర్బల్యం ఆత్మన్యూనతాభావం. గుడ్డివాడైన కారణంగా తాను పెద్దవాడైనా సింహాసనాధీశుడు కాలేకపోయాడు. తమ్ముని సౌజన్యంవలన, భీష్మాది వృద్ధుల దయవలన మాత్రమేతాను సింహాసనం పొందగలిగాన భావం అతడిలో బలంగా నాటుకునివుంది. రెండవ దౌర్బల్యం అతడి అంతులేని పుత్రవ్యామోహం. తాను పొందలేని సామ్రాజ్యాన్ని ఏ విధంగానైనా తన కుమారునికి అందించాలనే తాపత్రయం. ఈ రెండు దౌర్బల్యాలు అతడిని అధర్మప్రోత్సాహకుడిని, ఆపైన కులక్షయానికి కారకుడిని చేశాయి. ధృతరాష్ట్రుని పుత్రవ్యామోహాన్ని వెల్లడించటంలో సంస్కృత మహాభారతం సంకోచించలేదు. ధర్మరాజు గొప్పతనాన్ని ప్రశంసిస్తూనే ధృతరాష్ట్రుడు పెద్దలను రావించి 'ధర్మరాజు తరువాతనైనా దుర్యోధనుడు రాజు కాగలడా' అని, జ్యేష్ఠుడైన తనకు జ్యేష్ఠపుత్రుడైన దుర్యోధనునికి అధికారం వచ్చే అవకాశం ఉందా! అని ప్రశ్నిస్తాడు. అటువంటి అవకాశంలేదని వారు సమాధానమిస్తారు. తెలుగుభారతం దుర్యోధనుడు ఈ ప్రస్తావన చేసినట్లు చెప్పింది. అప్పుడు ధృతరాష్ట్రుడు నేనుకూడా ఎప్పుడూ నీవలెనే ఆలోచిస్తానని, కాని అది దారుణమైన సంకల్పంగనుక పైకి చెప్పటానికి సందేహిస్తానని కుమారునిముందు మాత్రమే వెల్లడిస్తాడు. ధర్మరాజుకు తనకు రాజ్యాధికారం ధర్మబద్ధంగా సంక్రమిస్తుందని తెలుసు. కనుకనే దుర్యోధనుని కుటిల ప్రయత్నాలన్నిటిని ఓర్పుతో సహించాడు. వయస్సులో తనకన్నా చిన్నవాడు, సింహాసనాధీశుడైన ధృతరాష్ట్రుని పుత్రుడు అయిన దుర్యోధనునిపైన అభియోగం చేస్తే తన అసమర్థతను తానే చాటుకున్నట్లౌతుందని లోకనీతి తెలిసిన ధర్మరాజు మిన్నకున్నాడు. అంతేగాక పెద్దలు, ప్రజలు తాము ఈర్ష్యాపరులని తలచి చులకనచేసే అవకాశం కలుగుతుంది. ద్రౌపదీ స్వయంవరం, రాజసూయయాగాలవలన పాండవుల శౌర్యప్రతాపాలు లోకవిదితమైనాయి. రాజసూయయాగం ద్వారా ధర్మస్వరూపుడైన కృష్ణుని అండ, భీష్మద్రోణవిదురాది పెద్దల ఆశీస్సులు తమవెంట ఉన్నాయని ధర్మరాజు లోకానికి చూపించాడు. ఈర్ష్యాపరుడైన దుర్యోధనుడు ఈ

విషయాన్ని గుర్తించలేక కపటద్యూతంలో పాండవుల సంపదలను గెలుచుకున్నాడు. తన గెలుపుకు తానే పొంగిపోయాడు ఈ గెలుపు తమ వినాశనానికి నాంది అని గ్రహించలేకపోయాడు

జూదానికి ఆహ్వానితుడైవచ్చిన ధర్మజుడు దుర్యోధనుడు చేసిన సమయానికి, ఏర్పరచిన నియమానికి క్షాత్రధర్మాన్ని అనుసరించి ఎటువంటి అభ్యంతరం చెప్పలేదు ఓడిపోతున్నకొద్దీ క్షత్రియ సహజమైన రోషం తాత్కాలికంగా పెచ్చుపెరిగి అతనిలో పంతాన్ని పెంచింది ఇది మానవ సహజమైన పట్టుదలవలన జరిగింది సర్వం కోల్పోయిన తరువాత పట్టుదల చల్లారాక వివేకం హెచ్చరిచింది. కనుకనే ద్రౌపది 'ముందు నన్నోడి తననుతాను ఓడాడా లేక ముందు తన్నోడి ఆపైన నన్ను ఓడాడా ఆ జూదరినే అడిగిరమ్మ'ని ప్రాతికామిద్వారా అడిగితే సమాధానం చెప్పలేదు. అతడు ఏ విధంగా సమాధానం చెప్పినా అది సభామర్యాదను ఉల్లంఘించటమే అవుతుంది అదీగాక తానే దాసుడై ఉన్న వ్యక్తికి ధర్మనిర్ణయంచేసే అధికారంలేదనే ధర్మసూక్ష్మాన్ని అతడెరిగివున్నాడు ధర్మరాజునోట ఏ ఒక్కమాట వెలువడినా భీషణ కోపవేగుడైన భీముడు ఆ కురుసభనే మట్టుపెట్టేందుకు సిద్ధమైవున్నాడు. అందువలనకూడా ధర్మరాజు ఎవరి ప్రశ్నలకు సమాధానం చెప్పలేదు. పెద్దల సమక్షంలో ఒక క్రమం ప్రకారం జూదంలో జరిగిన మోసాన్ని గ్రహించాక ఇతరాంశాలను శాంతచిత్తంతో వితర్కించాడు. సభామర్యాదను కాపాడి తమకు కలిగిన దుస్థితిని మౌనంగా తలదాల్చటమే అప్పటికి కర్తవ్యమని గ్రహించాడు. తాత్కాలికంగా తనను వశంచేసుకున్న ఆవేశం, అవమానం, పట్టుదలలను తన మనసునుంచి దూరం చేశాడు.

జూదసమయంలో ధర్మరాజు శాంతాన్ని వహించి ఉండటానికి సంస్కృత మహాభారతం మరొక కారణాన్ని కూడా వివరించింది. రాజసూయయాగం ముగిసిన తరువాత వ్యాసుడు పదమూడేండ్ల అనంతరం ధర్మరాజు ముఖ్యకారణంగా, భీమార్జునులు సాధనములుగా, దుర్యోధనుని అపరాధంవలన సర్వక్షత్రియ వినాశనం జరుగుతుంది. దానిని గురించి చింతించనవసరంలేదు. కాలమహిమ దాటరాదని' భవిష్యత్తును సూచిస్తాడు.[53] అప్పుడు ధర్మరాజు తమ్ములను పిలిచి ఈ భయంకరమైన వినాశనాన్ని నివారించేందుకై తాను తమ్ములను గురించి, ఇతర రాజుల గురించి పరుషములు పలుకనని, బంధువుల ఆజ్ఞను మీరనని, వారి మాటలకు ఎదురాడనని, యుద్ధప్రసక్తిని దరిచేరనీయనని ప్రతిజ్ఞచేస్తాడు భీమాదులు అతని హితంకోరి తాముకూడా అతని ప్రతిజ్ఞకు బాసటగా ఉంటామని ప్రకటిస్తారు. [54]

సంయమనంతో ధర్మరాజు శాంతం వహించి ఊరుకున్నాడని ఆంధ్రమహాభారతం చెప్పగా, సంస్కృత భారతం సంయమనంతోపాటు ప్రతిజ్ఞాబద్ధుడై ఉన్నందువల్లకూడా ధర్మరాజు కురుసభలోని

★ 53. సం.మ.భార సభా. 46-11,16

★ 54. సం.మ.భార. సభా. 46-26, 29,30,32.

పరిణామాలను సహించాలని వర్ణించింది. యుధిష్ఠిరుడు అనుసరించిన ఆధిభౌతిక లేక లౌకిక ధర్మసాధనకు నిదర్శనమే ద్యూత ఘట్టం. ఎటువంటి కష్టం ఎదురైనా, ఫలితం ఏమైనా, మానవుడు ధర్మం తప్పరాదని లోకశ్రేయస్సును కోరి మానవ ప్రయత్నాన్ని పూర్తిగా నెరవేర్చాలని ధర్మరాజు తన ప్రవర్తనవలన నిరూపించాడు.

యక్ష ప్రశ్నల సమయంలో ఆధిదైవికధర్మాన్ని నిర్వర్తించి ధర్మానికి అధిష్ఠాన దేవతయైన ధర్మదేవతనే మెప్పించాడు. అరణ్యవాస సమయంలో యక్షుని ఆజ్ఞను ధిక్కరించి సరోవర జలాన్ని త్రాగి భీమార్జున నకుల సహదేవులు విగతజీవులౌతారు. ధర్మరాజు తన జ్ఞానాన్ని, బుద్ధికుశలతను ప్రకటించి యక్షుని ప్రశ్నలకు సమాధానాలుచెప్పి అతనిని సంతృప్తుని చేస్తాడు. ఆ సమాధానాలలో కూడా మానవ జీవితంలో ధర్మానికే మొదటిస్థానమని సూచిస్తాడు. సంతోషాంతరంగుడైన యక్షుడు నీ సోదరులలో ఒకరిని జీవింపచేస్తానని పలికితే నకులుని బ్రతికించమని కోరుకుంటాడు. మహా పరాక్రమవంతులైన భీమార్జునులు నీ ప్రియ సోదరులుకదా వారిలో ఒకరిని కోరితే నీకు లాభకరమైనప్పుడు వారినికాక నకులుని ఎందుకు కోరుతున్నావని' యక్షుడు ప్రశ్నిస్తాడు. మానవ బంధాలకు, ప్రయోజనాలకు అతీతమైన ధర్మమార్గాన్ని అనుసరించి ధర్మరాజు 'మా తండ్రి పాండురాజుకు ఇద్దరు భార్యలు, కుంతీదేవి సంతానంలో జ్యేష్ఠుడనైన నేను జీవించివున్నాను. అదే విధంగా మాద్రిదేవి సంతానంలో ఒకడు జీవించవలదా' అని యక్షునే న్యాయం చెప్పమని ప్రశ్నిస్తాడు. అంతేకాక 'నేను ధర్మం తప్పి చరించనని ప్రజలు విశ్వసిస్తారు. ఎంత కష్టంవచ్చినా ధర్మహానికి ఓర్వలేన'ని తన స్వభావాన్ని ప్రకటిస్తాడు. ఈ సందర్భంలో ధర్మరాజు భౌతిక శరీరానికి సంబంధించిన సుఖదుఃఖాలకు, భావోద్వేగాలకు అతీతమైన ధార్మికమార్గాన్ని అనుసరించాడు.భీమార్జునులలో ఒకరిని కోరితే పొందే లాభం భౌతికమైనది, అశాశ్వతమైన శరీరానికి సంబంధించినది మాత్రమే అవుతుంది. అంతకన్నా ఉన్నతమైన ఆత్మతృప్తినికోరి నకులుని జీవింపచేయమని అడిగాడు. ధర్మరాజు ధర్మబుద్ధికి సంతోషించిన యక్షుడు వరం కోరుకొమ్మనగా దొంగలపాలైన బ్రాహ్మణుని అరణిని ప్రసాదించమని అర్థిస్తాడు. మిగిలిన తన సోదరులు జీవించాలనిగాని, అరణ్యవాసం సులభంగాను, అజ్ఞాతవాసం నిర్విఘ్నంగాను కొనసాగాలనిగాని, పదమూడు సంవత్సరాల తరువాత తమ రాజ్యం తమకు లభించాలనిగాని అతడు కోరలేదు. యుధిష్ఠిరుని ధార్మిక బుద్ధికి, నిర్లోభత్వానికి ప్రసన్నుడైన యక్షుడు అరణిని ప్రసాదించటమేకాక భీమాదులు నలుగురిని జీవితులను చేసి, అజ్ఞాతవాసంలో పాండవులను ఎవరూ గుర్తించలేరని వరం కూడా ఇస్తాడు. యక్షుడు తాను ధర్మదేవతనని చెప్పి తనను ఆశ్రయించిన వారిని తాను కాపాడుతానని అభయం ప్రసాదిస్తాడు ఓరిమి వహించి సభామధ్యంలో ఆధిభౌతిక ధర్మాన్ని నిర్వర్తించిన ధర్మజుడు ఈ సందర్భంలో జ్ఞానమూర్తియై, అలోలత్వాన్ని చూపి అధిష్ఠాతయైన ధర్మదేవతనే మెప్పించి ఆధిదైవిక ధర్మసాధనలో కృతకృత్యుడైనాడు.

స్వర్గారోహణపర్వంలో ధర్మరాజు ఆధ్యాత్మధర్మ మార్గానుసరణ దర్శనమిస్తుంది. కలి ప్రభావాన్ని గుర్తించిన ధర్మజుడు తామింక నిలువరాదని గ్రహించి పరిక్షిత్తును రాజుగా నిలిపి మహాప్రస్థానానికి బయలుదేరుతారు సోదరులు. ద్రౌపదితోపాటు ఒక శునకంకూడా అతడిని అనుసరిస్తుంది. మార్గమధ్యంలో ద్రౌపది, భీమార్జున నకుల సహదేవులు విగతజీవులై పడిపోగా ధైర్యం వదలక తన బుద్ధిని స్థిరం చేసుకుని ముందుకు సాగిపోతారు భీమాదులు లౌకిక ధర్మబద్ధులు, కర్తవ్య పరాయణులు అయినప్పటికీ వారు అరిషడ్వర్గాలను పూర్తిగా జయించలేకపోయినందుకు వారికి ఇటువంటి దశకలిగిందని గుర్తించి తన యాత్రను కొనసాగించిన నిశ్చలాత్ముడు.

జీవాత్మ తాను పరమాత్మ అంశ అని గుర్తించేందుకు చేసే ప్రయత్నం, అనుసరించే ధర్మం ఏదైతే ఉందో అది ఆధ్యాత్మధర్మం. భగవద్గీతలో శ్రీకృష్ణుడు 'మమైవాంశో జీవలోకే జీవభూత: సనాతన:' అని, నా అంశయే జీవలోకమున జీవాత్మ అయినదని, జీవాత్మయే భోగఫలార్థమై నశ్వరమైన శరీరంలో సంచరిస్తుందని తెలిపారు. దేహధారియైన ఆత్మలక్షణాన్ని ఆది శంకరులు 'తత ఆత్మ సదానన్దో నాస్య దు:ఖం కదాచన' అని వివేకచూడామణిలో వివరించారు. నిరంతరం ఆనందమయమైన శాశ్వతమైన ఈ జీవాత్మ శరీరాన్ని వదలి తన సంపూర్ణ స్వరూపమైన పరమాత్మను చేరేందుకు ప్రయత్నిస్తుంది. అది ఆత్మ స్వధర్మం అని కూడా వర్ణించారు. అటువంటి స్వధర్మానుసరణలో జీవాత్మ అనుసరించేది ఆధ్యాత్మ ధర్మమార్గం. నిస్సంగులైన ముముక్షువులు అనుసరించే ఈ ధర్మాన్ని యుధిష్ఠిరుడు స్వర్గారోహణంలో నిరూపించారు.

విగతజీవులైన సోదరులను ధర్మపత్నిని విడచి నిశ్చలంగా సాగిన యుధిష్ఠిరుని దివ్యవిమానంలో వచ్చి ఇంద్రుడు స్వర్గానికి రమ్మని ఆహ్వానిస్తాడు. ఆత్మజ్ఞానసిద్ధుడైన ధర్మజుడు 'ఆత్మవత్సర్వభూతాని' అని గుర్తించే స్థాయికి చేరుకున్నాడు. సమస్త జీవులను సమదృష్టితో చూడగల బ్రహ్మవేత్త అయినాడు. వెంటవచ్చిన శునకానికి కూడా తనతోపాటు స్వర్గవాసం కల్పించితేనేగాని తాను రాలేనని ఇంద్రుని ఆహ్వానాన్ని తిరస్కరించాడు. అంతేగాక 'సోదరులు, ద్రౌపది చనిపోయినారు వారిని విడువక ఏడ్చినట్లైతే వారు రాగలరా'అని 'చావక తోడువచ్చిన శునకాన్ని విడిచివెళ్ళుట తప్పుకదా' అని ఇంద్రుని ప్రశ్నిస్తాడు. ఆప్తైన శరణాగతుని తిరస్కరించటం, అపరాధిని విడిచిపెట్టటం మహాపాపాలతో సమానమైన దోషంగా భావిస్తానని తన ధర్మశీలతను ప్రకటిస్తాడు. అంతవరకు శునకరూపంలో వెన్నంటి వచ్చిన ధర్ముడు ప్రమోదంపొంది స్వస్వరూపం ధరించి యుధిష్ఠిరుని పుణ్యచరితము, భూతదయలు తన మనసుకు ముదమును కలిగించాయని ప్రకటించి అతడు శరీరంతో పుణ్యలోకాలు చేరేటట్లు అనుగ్రహిస్తాడు. యుధిష్ఠిరుని ధర్మసాధనకు ఇది పరమోత్కృష్టమైన పదము, ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మ ధర్మసాధనలో పరీక్షలకు గురియై విపత్కరపరిస్థితులను

ఎదుర్కొన్నప్పటికీ ధర్మమార్గాన్ని విడువని ధర్మరాజు కృష్ణద్వైపాయనుడు నిరూపించదలచిన సాధనధర్మమార్గానికి గొప్ప ఉదాహరణ.

సిద్ధధర్మమూర్తియైన పరమాత్మ ధర్మసంస్థాపన కొఱకై దేహాన్ని ధరించినప్పుడు అనుష్ఠించవలసిన భౌతికధర్మాన్ని శ్రీకృష్ణుడు తాను ఆచరించి చూసి ప్రబోధించాడు. పరమాత్మ అంశయైన జీవాత్మ సశరీరుడై లౌకికజీవితంలో అనుసరించవలసిన ధర్మానుసరణకు సాధకుడు ధర్మరాజు. సామాన్య విశేష ధర్మపాలనలో ధర్మసూక్ష్మాన్ని గ్రహించి వ్యవహరించాడు భీష్మవిదురాదులనుండి ధర్మతత్త్వాన్ని తెలుసుకున్నాడు. జీవాత్మ స్వధర్మాన్ని అనుసరించి పరమాత్మను పొందగలిగాడు. లౌకిక అధ్యాత్మ ధర్మాలను సాధించి సాధనధర్మమార్గానికి భౌతికరూపంగా నిలచి 'ధర్మద్రుమ'మని పేరుపొందాడు.



# 7. మరికొందరు ప్రముఖులు - ధర్మనివేదన

మహాభారతంలో మహార్షులైనవారిని విడిచిపెడితే పాండవులు, భీష్మవిదుర సంజయులు, కుంతీదేవి, గాంధారి, ద్రౌపది శాశ్వత ధర్మాచరణలో ఆదర్శాన్ని నెలకొల్పినవారు భీష్మవిదురసంజయులు, ధర్మజకుంతీదేవులు అనుసరించిన ధర్మమార్గాలను, వారి ధర్మానుసరణను ఇంతకుముందే పరిశీలించాం. మిగిలినవారిలో గాంధారీ ద్రౌపదులతోపాటుగా ధృతరాష్ట్ర కర్ణులుకూడా ధర్మాన్ని ఎఱిగినవారుగా పేరుపొందారు. ద్రోణుడు ధర్మానుసరణలో తనకొక ప్రత్యేకమార్గాన్ని ఎన్నుకున్న వ్యక్తి.

**ద్రోణుడు** .- బ్రాహ్మణుడైన ద్రోణుడు క్షాత్రవృత్తిని గ్రహించి వ్యక్తిధర్మాన్ని, వృత్తిధర్మాన్ని నిర్వహించాడు. దారిద్ర్య బాధను సహించలేక సహాయంకోరి తన సహపాఠియైన ద్రుపదుని ఆశ్రయిస్తాడు. అక్కడ సభాస్థలిలో ద్రుపదుని చేత పరాభవాన్నిపొంది అవమానభారంతో మరలివస్తాడు. ద్రోణునిలోని ప్రతీకారాగ్ని అతని హృదయంలో బడబానలమై రగిలింది. భీష్మునిచేత కురువంశీయుల రాజపుత్రుల శిక్షణకొఱకై ఆచార్యుడిగా నియమితుడైనాడు. రాజపుత్రుల ఆచార్యుడైనందువలన క్షత్రియేతరులైన ఏకలవ్య కర్ణులకు ప్రత్యక్షగురువు కాలేకపోయాడు. వ్యక్తి ధర్మ వృత్తి ధర్మాలకు కట్టుబడినందువల్లనే దుర్యోధనుని పక్షాన నిలచి పోరాడాడు. ధర్మబద్ధంగా వారి రాజ్యభాగంకోసం పోరాడే పాండవులపక్షం వహించటంకాని, తన ప్రియశిష్యుడైన అర్జున. నిమీద అభిమానంతో ఏ పక్షం వహించకుండా తటస్థంగా ఉండటంకాని చేయలేకపోయాడు. ద్రోణుడు విశేషధర్మ పాలననే తన ప్రథమ కర్తవ్యంగా భావించాడు ద్రుపదునిపట్ల తనలో దాగివున్న క్రోధాన్ని, శత్రుత్వాన్ని అధిగమింపలేకపోయాడు. ఈ క్రోధం కారణంగానే తన తండ్రిని అవమానించాడన్న కోపంతో ధృష్టద్యుమ్నుడు ప్రాయోపవేశంలోవున్న ద్రోణుని శిరస్సును నరికాడు. కృష్ణుడని భావించి వధించినప్పటికీ ధృష్టద్యుమ్నుడు తిరిగి అశ్వత్థామచేతిలో నిద్రావస్థుడైవున్న స్థితిలో హతుడయ్యాడు. శాశ్వత ధర్మస్థాపన కన్నా వ్యక్తిధర్మమే, వృత్తిధర్మమే ముఖ్యమని భావించినందువలన ద్రోణుడు బ్రాహ్మణుడైనప్పటికీ క్షత్రియునివలె పోరాడాడు, మరణించాడు.

ద్రౌపది .- అర్జునునిచేత అవమానితుడైన పాంచాలరాజు అర్జునుని అల్లునిగాపొందేందుకు ఒక కుమార్తెను, ద్రోణునిపై పగతీర్చుకోగలిగిన సామర్థ్యంగలిగిన ఒక కుమారుని, కోరి యజ్ఞంచేయగా యజ్ఞగుండం నుంచి జన్మించిన కన్య ద్రౌపది కృష్ణనామధేయురాలై శ్రీకృష్ణునికి ప్రియసోదరియై మన్ననలందిన వ్యక్తి. ఆదినుంచి ధర్మవర్తనమే తన స్వభావంగా కలిగిన ధర్మరాజును అనుసరించిన ద్రౌపది మహాభారతంలో కనిపించే ఒక విశిష్టమైన వ్యక్తి. సర్వసమర్థురాలైనప్పటికీ ధర్మానికి

కట్టుబడి, అవమానాలను సహించి భర్తలనీడలో సంచరించింది. సమగ్ర సంస్కృత మహాభారతం వెలువడిన కాలంనాటికన్నా ముందే గంగామైదాన ప్రాంతాలలో రూపుమాసిపోయిన బహుభర్తృత్వం అనే ఆచారానికిఆఖరిగుర్తు ద్రౌపది. ఆమె బహుభర్తృత్వం భవిష్యత్తులోని ధర్మసంస్థాపనకు మూలాధారం. ఇంద్రుని ఐదు అంశలు ఐదు రూపాలు ధరించి పంచపాండవులైనారని, నిజానికి వారు స్వరూపాలు వేరుగా ఉన్నా ఏకాత్ములని ద్రౌపది వివాహానికి సంశయిస్తున్న ద్రుపదునికి వివరించి వ్యాసుడు సంశయనివృత్తి చేస్తాడు. ద్రౌపది శక్తిస్వరూపిణి అని, ఆమె శాసించే పంచభూతాల ప్రతిరూపాలే పంచపాండవులని, వారి ద్వారా ఆమె భూభారాన్ని నిర్మూలింపచేసిందని తెలియజెప్పే భారతగాథలుకొన్ని ప్రచారంలోవున్నాయి.

అధర్మాన్ని ఎదిరించిన ద్రౌపది సతీధర్మాన్ని పాటిస్తూ, స్త్రీ ఎవరికీ తలవంచవలసిన అవసరంలేదని చాటి చెప్పింది. తన ఆగ్రహాన్ని, అవమానభారం వలన కలిగిన దుఃఖాన్ని సభాపర్వంలోను, విరాట, ఉద్యోగపర్వాలలోను నిస్సంకోచంగా వెళ్ళగక్కింది. జూదంలో భార్యాబిడ్డలను, ఆశ్రితులను, బంధువులను పణంగాపెట్టటం ఆనాడు సామాన్యంగా కొనసాగే అలవాటు. ధర్మరాజుకు పూర్వం భార్యను పణంగాపెట్టి నలుడు జూదమాడాడు. కలి ప్రభావం వలన నలుడు మొదట జూదంలో సర్వసంపదలు కోల్పోయి భార్యాసహితుడై అడవులపాలౌతాడు. అనేక కష్టాలకు గురౌతాడు. కలిప్రభావం వీడిన తరువాత రెండవపర్యాయం నిర్ధనుడైన నలుడు దమయంతిని పణంగాపెట్టి పుష్కరునితో జూదమాడి,గెలిచి తన సంపదలను తిరిగి పొందుతాడు.[55]

ధర్మవర్తనుడని పేరొందిన ధర్మరాజు తాత్కాలికమైన ఆవేశానికి, పట్టుదలకులోనై తనను తాను జూదంలో ఓడిన తరువాత భార్యను పణంగా పెట్టి ఓడిపోతాడు. ఇది శకుని ప్రోద్బలంతో జరిగిన విషయం. ద్యూతక్రీడ వివరాలువిన్న ద్రౌపది ఈ అన్యాయాన్ని సహిచలేకపోయింది. 'ఎవరిని ముందు ఓడావో నీవైనా చెప్పు నీకు తెలియకపోతే ఆ జూదరినే అడిగిరమ్మని రూక్షంగా పలికింది. ఇదే ప్రశ్న కురుసభలో పెద్దలను అడిగి వారు సమాధానం చెప్పకుంటే 'తాను అధర్మ విజితనని ఎలుగెత్తిచాటింది. దుశ్శాసనుడు ఆమెను అవమానించిన అనంతరం భయభీతుడైన ధృతరాష్ట్రుడు వరాలు కోరుకొమ్మని పలికితే పాండవుల సంపదలు వారికి తిరిగి చేరాలని, ఆయుధాలతో సహా పాండవులకు దాస్యవిముక్తి కలగాలని కోరింది. అంతేతప్ప తాను దాసీననిగాని తనకు దాస్యవిముక్తి కావాలనిగాని ఆమె భావించలేదు. అంతేకాక మరొకవరం కూడా కోరుకొమ్మని ధృతరాష్ట్రుడు ఎంతగా ప్రాధేయడినా" సుక్షత్రియకాంత రెండు వరాలను మించి కోరరాదని, అంతకుమించి కోరికలు కోరటం అధర్మమౌతుందని" సభామధ్యంలో చాటిన ధార్మికురాలు. జూదంలో భార్యను పణంగా పెట్టిన ధర్మరాజును అవకాశం వచ్చినప్పుడల్లా దెప్పిపొడిచినద్రౌపది

★ 55. ఆం. మ. భార. అర. 2-222

సత్యభామకు సతీధర్మాన్ని బోధించింది. అధర్మపరుడైనప్పుడు భర్త అయినాసరే అధర్మాన్ని ప్రతిఘటించాలనేది ద్రౌపది స్త్రీజాతికి ప్రబోధించిన కర్తవ్యం, ధర్మం. భర్తను వశం చేసుకునేందుకు మంత్రమో తంత్రమో తెలుపమని సత్యభామ కోరితే ఆమె అల్పత్వానికి చికాకు పడింది జగన్నాథుని ఇల్లాలవై ఇటువంటి ఆలోచనలు ఎలా చేయగలవని ఆశ్చర్యపడింది. ఆ కాలానికి, ఆమె జీవన విధానానికి తగినటువంటి సత్ప్రవర్తన ఎలాంటిదో వివరించింది స్త్రీలు భర్తలను, బంధుగణాన్ని మంత్రతంత్రాలతో కాక సహృదయంతోను, సత్ప్రవర్తనతోను ఆకట్టుకోవాలని బోధించింది. "ప్రేమ, భక్తి చూపి నీ ప్రియునకు ఏది ఇష్టమో దానినే ఆచరిస్తూ భర్త హృదయాన్నెరిగి ప్రవర్తిస్తే అతడు నీకు వశుడై వుంటాడ'ని ధర్మపత్నియైన స్త్రీ అనుసరించవలసిన సార్వకాలికమైన ధర్మాన్ని ప్రబోధించింది. ద్రౌపది ఎదుర్కొన్నన్ని అవమానాలు చరిత్రలో మరే స్త్రీ ఎదుర్కొనలేదు. ఆమె అశక్తతను, ఆవేశాన్ని అప్పుడప్పుడు మాటలలో వ్యక్తం చేసినప్పటికీ మనో వాక్కాయకర్మలలో ద్రౌపది తన వర్తనంలో ఎన్నడూ ధర్మభంగం జరుగనీయలేదు. మహాప్రస్థానంలో కూడా ధార్మికులైన భర్తలను అనుసరించి పాంచభౌతికమైన శరీరాన్ని ప్రకృతిధర్మంగా విసర్జించింది.

మార్గమధ్యంలో ద్రౌపది మృతికి కారణంగా ధర్మరాజు 'ఆమె మనసులో అర్జునునిపట్ల పక్షపాతబుద్ధి కలద'ని చెప్పటం ధర్మరాజు పాటించిన సత్యవాక్పరిపాలనమే తప్ప ద్రౌపదిని కించపరచటం కావేరదు. శరీరధారులందరికీ అరిషడ్వర్గాల ప్రాబల్యం దాటరానిది. ఎంతటి ధర్మపరాయణులైనా ఏదో ఒక సమయంలో వానికి లోనుగాక తప్పదు. మహోత్కృష్టసాధకుడైన ధర్మపుత్రుడు తప్ప ఇతరులెవ్వరు అరిషడ్వర్గాలను జయించి, ఆత్మజ్ఞాన సిద్ధులై సశరీరులై స్వర్గప్రాప్తిని పొందలేదు. మహాభారతంలోని మహోత్తమ ధర్మపరాయణులలో ద్రౌపది ప్రధానమైన వ్యక్తి. ధర్మవర్తన, అధర్మ ప్రతిఘటన, సతీధర్మ నిర్వహణ ద్రౌపది ప్రబోధించిన సార్వకాలికమైన వ్యక్తి ధర్మాలు.

**గాంధారి :-** భారతంలో వ్యాసమహర్షి చేతనే పొగడ్తలందిన ధర్మపరాయణ చిత్ర గాంధారి. ఆమె ధర్మానుసరణలో సతీధర్మం, మాతృవాత్సల్యం ఆమెను గర్భశోకానికి గురిచేశాయి. వివాహానికి పూర్వమే ధృతరాష్ట్రుని అంధత్వాన్ని ఎఱిగి తాను కూడా లోకాన్ని చూడనని కన్నులకు పట్టము కట్టుకున్న పతివ్రత గాంధారి. భీష్ముని మాటను గౌరవించి తన తండ్రి తనను ధృతరాష్ట్రునకు పత్నిగా నిశ్చయించినాడని తెలియగానే 'పితృవచన దత్త'గా తనను భావించి 'యమ్మహీపతియేగాని యొరుల నొల్లన'ని పలికిన సాధ్వీమణి. పుట్టుగుడ్డియైన భర్తతో సమానంగా తాను కూడా జీవాంధురాలై ఆమరణాంతం నేత్రపటంతో జీవించింది. ఇది గాంధారీదేవి అనుసరించిన పరమోత్కృష్టమైన సతీధర్మానికి నిదర్శనం.

ఉద్యోగపర్వంలో శ్రీకృష్ణుని కృపవలన దృష్టిని పొందిన ధృతరాష్ట్రుడు. 'నిన్ను చూచిన కళ్ళతో వేరొకరిని చూడనని నా దృష్టిని పరిహరించమ'ని కృష్ణుని కోరి లభించిన దృష్టిని వద్దని పోగొట్టుకుంటాడు గాంధారికి అటువంటి అవకాశం లభించలేదు. ఏనాడూ ఆమె భౌతిక లోచనాలను తెరచి లోకాన్ని దర్శించాలని కోరుకోలేదు. యుద్ధానంతరం పుత్రుల శవాలనైనా చూడాలని అభిలషించని స్థిరచిత్తురాలు. మహాసాధ్వి. వ్యాసానుగ్రహంతో తాత్కాలికమైన దివ్యదృష్టిని పొంది నిజవ్రతహానిలేని విధంగా మాత్రమే యుద్ధరంగాన్ని వీక్షించింది.

పుత్రవ్యామోహంతో ధృతరాష్ట్రుడు. పాండవులపట్ల దుర్యోధనుని మాత్సర్యాన్ని ఉపేక్షించి, కుమారుని కుటిలప్రయత్నాలను ప్రోత్సహించినప్పుడు గాంధారి అనుక్షణం భర్తను హెచ్చరించింది. సతీధర్మ పరాయణురాలై ఉత్తమోత్తమమైన నిగ్రహాన్ని చూపుతూనే ధృతరాష్ట్రుని పుత్రవ్యామోహాన్ని నిరోధించేందుకు ప్రయత్నించింది. భర్త పుత్రవ్యామోహానికి ఫలితంగా తనకు కలిగిన గర్భశోకాన్ని కూడా సహించగలిగిందికాని పుత్రుల మరణానికి కారణమైన యుద్ధాన్ని నివారింపనందుకు కృష్ణునిపై తన ఆగ్రహాన్ని చూపి అతడిని శపించింది. యుద్ధానంతరం ధర్మరాజు ఎదుటకు రాగా అతనిని శపించాలనే భావం ఆమెకు కలిగింది. గాంధారి హృదయాన్ని గ్రహించిన వ్యాసుడు ధర్మపరాయణురాలవైన నీకిది తగదు అని హెచ్చరించి ఆమెను వారిస్తాడు. అంతేకాక యుద్ధానికి బయలుదేరుతూ నీ కుమారుడు వచ్చి నమస్కరించినప్పుడు 'ఎక్కడనుండు ధర్మము అక్కడకు జయము సేరు' నని నీవే కొడుకును దీవించి పంపావుకదా అని, నీ మాటయే ఫలించింది అని అవ్యాపదేశంగా ఆమె ధర్మశీలతను ప్రశంసిస్తాడు. గాంధారిలోని ధార్మికబుద్ధి ఆమె పుత్రప్రేమను జయించిందని వెల్లడిస్తాడు.

వ్యక్తిగతమైన మాతృధర్మం, శాశ్వత ధర్మ ప్రతిష్ఠాపనల మధ్య ఏర్పడిన సంఘర్షణను గాంధారి ఎదుర్కొనవలసి వచ్చింది. ధర్మపరాయణురాలైనందుచేత కుమారుని దీవించేవేళ అసంకల్పితంగానే శాశ్వత ధర్మపథాన్ని అనుసరించింది. వ్యక్తిగత ధర్మపాలనలో భర్తృహీనయైన కుంతీదేవికిగల స్వాతంత్ర్యం గాంధారికి లేదు. కనుకనే ఆమె గర్భశోకాన్ని అనుభవించవలసి వచ్చింది. ధృతరాష్ట్రుని సతియైనందున గాంధారి తన భర్త పక్షపాతబుద్ధితో వినాశనాన్ని ఆహ్వానిస్తున్నాడని గ్రహించినప్పటికీ అతడినితిరస్కరించి స్వతంత్రంగా వ్యవహరించలేదకపోయింది. కుంతీదేవి నిర్ణయం ఇందుకు భిన్నంగా స్వతంత్రమార్గంలో సాగింది. పాండవుల అరణ్యవాసకాలంలో ధృతరాష్ట్ర దుర్యోధనుల ఆశ్రయంలో ఉండేందుకు ఆమె ఇష్టపడలేదు. స్వయంనిర్ణయంతో విదురుని ఇంట ఉండేందుకు నిశ్చయించుకుంది. చివరకు తన కొడుకులను అరణ్యాలపాలుచేసి కోడలిని అవమానించిన దుర్యోధనుని మరణంతో ఆమె మాతృహృదయానికి సాంత్వన కలిగి ఉండవచ్చు. అనంతరమే కౌరవుల ఇంటి కోడలుగా తన ధర్మాన్ని నిర్వర్తించేందుకు పూనుకుంది.

కర్తవ్య నిర్వహణనే ప్రధానంగా తలచింది. గాంధారీధృతరాష్ట్రులను అనుసరించి వనవాసానికి తరలిపోయింది. ఇక్కడకూడా ఆమె స్వయంనిర్ణయాధికారాన్ని ధర్మరాజుకాని మరెవరుగాని కాదనలేకపోయారు. ఈ విధమైన అధికారం గాంధారికి వుండివుంటే ద్రౌపదీ పరాభవాన్ని, రెండవమారు జరుగబోయే జూదాన్ని బహుశా ఆపగలిగి ఉండేది. ధృతరాష్ట్రుని పట్టమహిషిగా ఆమెకు కొన్ని అధికారాలు ఉన్నప్పటికీ గాంధారి సతీధర్మానికి, రాజాజ్ఞకు బద్ధురాలు అకారణంగానే భర్తలోని బలహీనతను విమర్శించి హెచ్చరించటంవరకే ఆమె చేయగలిగింది. పాండవులకు రాజ్యాన్ని నీవు పంచియివ్వదలచితే నిన్ను అడ్డుపెట్టగల వారెవరున్నారని అతడికి శ్రేయోమార్గాన్ని వివరించేందుకు సర్వదా ప్రయత్నించింది.

**ధృతరాష్ట్రుడు** :- మహాభారతంలో సంక్లిష్టవ్యక్తిత్వానికి, ద్వంద్వ ప్రవృత్తికి ధృతరాష్ట్రుడు ఒక గొప్ప ఉదాహరణ. ఇతడు సర్వధర్మాలను తెలిసినవాడు. ఆదినించి తనలోని పుత్ర ప్రలోభాన్ని గ్రహించినవాడు. అయినప్పటికీ హద్దులులేని పుత్రప్రేమవలన బాధితుడైనవాడు. తాత్కాలికంగా పాండవులవలన ప్రమాదం తప్పితేచాలని భావించేవాడు. అంగవైకల్యంవలన రాజ్యాన్ని కోల్పోయిన తన దురదృష్టాన్ని పుత్రుని ద్వారా అధిగమించాలనే బలహీనతకు లోనైనాడు. ధైర్యంగా దుర్యోధనునివలె ధర్మాన్ని ఎదిరించి నిలువలేడు. ధర్మరాజువలె ధర్మాన్ని ఆశ్రయించి అనుసరించలేడు. ఈ ద్వైదీభావంలోనే జీవితాంతం కొట్టుమిట్టాడాడు. ధర్మవేత్తయైన విదురుడి సాన్నిహిత్యాన్ని, అతడి ధర్మబోధనను నిరంతరం వాంఛిస్తాడు. కానీ ఆచరణలో ప్రలోభానికి లొంగిపోయే నైజంకలవాడు. తనలోని బలహీనతను తెలుసుకోగలిగిన వ్యక్తి. కనుకనే విదుర సంజయులు, వ్యాసాది మహర్షులు ధర్మబోధచేసినా, తనను విమర్శించినా గౌరవంతో ఆలకించాడు. అందులోని అంతరార్థాన్ని గ్రహించాడు. అయితే వినాశనం జరగదని, ధర్మరాజు యుద్ధం చేయడేమోనని చివరివరకూ తనను తానే భ్రమలో పెట్టుకున్నాడు. ఈ భ్రమకు నిదర్శనమే సంజయరాయబారం. శ్రీకృష్ణ రాయబారం అనంతరం పరిస్థితులను గుర్తించి దుఃఖితుడయ్యాడు.

ఎప్పటికప్పుడు ధర్మరాజు ధార్మికతను గ్రహిస్తున్నా పాండవులపట్ల ధృతరాష్ట్రునికి కూడా అంతరాంతరాలలో ద్వేషంవుంది. 'మాటలలో, చేతలలో పాండవులయందు ప్రీతి ఉన్నట్లు ఉంటాముగాని విదురునకైనా నా హృదయం తెలియనీయను. మీరు తలచినట్లే నేను కూడా తలచుచుందును' అని తన మనసులోని ఆలోచనను దుర్యోధనుని ముందు వెల్లడిస్తాడు. పైగా 'పాండవవీరులను ఏమి చేయగలము ఏవిధంగా చేయగలము' అని వారికి తన అనుమతిని తెలియజేస్తాడు. లాక్షాగృహ నిర్మాణంలో పాండవ వినాశనానికి అంగీకారాన్ని తెలియజేయడంతో ధృతరాష్ట్రుని ధర్మవ్యతిరేకమైన ఆచరణ ప్రారంభమౌతుంది. అతడిలోని న్యూనతాభావం, అవధులులేని పుత్రప్రేమ సర్వనాశనానికి దోహదం చేశాయి. ధర్మప్రబోధాలకు శ్రోతగా మాత్రమే

ధృతరాష్ట్రుడు మిగిలిపోయాడు. మంచినివిని ధర్మమార్గాన్ని గ్రహించినప్పటికీ ఆచరణలో ప్రలోభాలకులోనై ఆపదలను కొనితెచ్చుకునేవారు ప్రపంచంలో ఎప్పుడూ ఉంటారు. అటువంటి వ్యక్తులకు ప్రతినిధి ధృతరాష్ట్రుడు.

కర్ణుడు .- ధృతరాష్ట్రునివలెనె ప్రలోభాన్ని జయించలేక బాధపడిన వ్యక్తి. సంఘంచేత బాధింపబడిన వ్యక్తి కర్ణుడు. ఇతడు కూడా వ్యక్తిత్వాన్ని, వ్యక్తి ధర్మాన్ని జీవితంలో ముఖ్యధ్యేయంగా భావించాడు. కాని ఇతడి వ్యక్తిధర్మం, భీష్ముని వ్యక్తిధర్మంవలె ప్రశంసలు పొందలేకపోయింది.

శారీరక, మానసిక లక్షణాలను బట్టి, లోకంలో చెప్పుకునే మాటలను బట్టి తాను ఉత్తమకుల సంజాతుడనని తెలిసినా, అతడికి తన జన్మరహస్యం కురుక్షేత్ర యుద్ధ ప్రారంభం వరకు తెలియలేదు. సూతకులంలో పెరిగినందుకు అతడు బాధపడినట్లు ఋజువులు లేవు. కాని జన్మించిన కులంనుంచి బహిష్కృతుడైనందువలన లోకం దృష్టిలో తక్కువవాడుగా ఉండవలసినందుకు అస్త్రవిద్యాప్రదర్శనవేళ సిగ్గుపడ్డాడు. ఈ లజ్జాభావమే అతడిలో క్రోధాన్ని పెంచింది. శౌర్యం కలవాడు, అధిక సేన గలవాడు రాజు కాగలడని ప్రకటించి తనను అంగరాజ్యాభిషిక్తుని చేసి రాజులోకంమధ్య నిలిపిన దుర్యోధనునిపట్ల కర్ణుడు ఎనలేని కృతజ్ఞతాభావాన్ని ఏర్పరచుకున్నాడు. కర్ణుని బలహీనత పరాక్రమ ప్రదర్శన. తాను అర్జునుని మించిన వీరుడని పేరుపొందాలన్నదే అతడి జీవితధ్యేయం. ఆవిధంగానైనా తన ఆధిక్యతను లోకానికి చాటిచెప్పాలన్నదే అతడి మనోగతవాంఛ. ఈ లక్ష్యసాధనవాంఛకు అతడికి లోకంమీదగల క్రోధం, కక్ష ఆజ్యం పోశాయి.

తన లక్ష్యసాధనను సఫలీకృతం చేసుకునేందుకు కర్ణుడు ఎన్నో ప్రయత్నాలు చేశాడు. దుర్యోధనుని పట్ల అచంచలమైన స్నేహభావాన్ని కృతజ్ఞతను వ్యక్తం చేసినా తన లక్ష్యానికి భంగం కలిగించేటటువంటి ఏ విషయాన్నిగాని కర్ణుడు దుర్యోధనుని ముందు బయటపెట్టలేదు. స్నేహధర్మాన్ని మించి తన లక్ష్యసాధననే ముఖ్యంగా భావించాడు. పరశురాముని వద్ద విద్యాభ్యాసానికి వెళ్ళినప్పుడు తాను బ్రాహ్మణుడనని అసత్యం పలుకుతాడు. ధర్మాచరణలో మొట్టమొదటి లక్షణమైన సత్యవాక్పాలననే అతిక్రమించాడు. అంతేకాక యుద్ధప్రయత్నాలకు పూనినప్పుడు 'గురుని అలుకవలన నాకు అస్త్రవిద్య మరుపు వచ్చునని జనులు చెప్పుమాట బొంకు, భక్తితత్పరలతో ఆ మునీశ్వరుని మెప్పించి విద్యను తిరిగిపొందితిని' అని చెప్పి యథార్థాన్ని దుర్యోధనునివద్ద రహస్యంగా ఉంచాడు. కర్ణుని బల పరాక్రమాలమీద విశ్వాసం ఉంచిన దుర్యోధనుడు కర్ణుని తేజస్సుకు కారణాలైన కవచకుండలాల విషయంలో కూడా కర్ణుడు చెప్పిన మాటలనే విశ్వసించాడు. తన కుండలాలను శచీదేవి నిమిత్తం ఇంద్రుడు స్వయంగా వచ్చి

అర్థించాడని సగర్వంగా కర్ణుడు చెప్పుకున్న విషయాన్ని దుర్యోధనుడు పునరుద్ఘాటించాడు కవచకుండలాలు కర్ణుని తేజస్సుకు, రక్షణకు దోహదకారులన్న విషయం కర్ణుడు గోప్యపరచివుండవచ్చు, లేక దుర్యోధనుడు విస్మరించియైనా ఉండవచ్చు తన పరాక్రమాధిక్యతను, దానగుణాన్ని చాటుకుని తనలోని లజ్జాభావాన్ని అధిగమించేందుకు కర్ణుడు ప్రయత్నించాడు. కుంతీదేవికి వరాన్ని ఇచ్చిన విషయంకూడా దుర్యోధనునితో ప్రస్తావించలేదు. వ్యక్తిగా మహోన్నతుడు, దానశీలిగా అద్వితీయుడు అని పేరుపొందిన కర్ణుడు అసత్య ప్రలాపం వలన, రహస్యగోపనంవలన, పరాక్రమ ప్రలోభంవలన శాశ్వతధర్మ వ్యతిరేక వర్తనుడైనాడు. తన వ్యక్తిగత ధర్మపాలనలో మాత్రం 'కౌరవనాథుని యే విడిచిపోవుట ధర్మమే వీరకర్మమే' అని, 'మత్సేవాధర్మంబు నిర్వహించెద బలోత్సేకంబు లోకంబునంభావింపన్' అని స్పష్టంచేశాడు. ఈ చెప్పడంలో కూడా కౌరవనాథుని అంటిపెట్టుకుని ఉండటం వీరధర్మానికి, కర్తవ్యానికి, గుర్తుగాను, అతడిని సేవించటం లోకానికి తన పరాక్రమాన్ని చాటుకోవటం కోసమని తన లక్ష్యాన్ని స్పష్టంగా చెప్పాడు.

భీష్ముడు కూడా వ్యక్తి ధర్మానికి ప్రాధాన్యం ఇచ్చినప్పటికి కర్ణునివలె అధర్మాన్ని సమర్థించలేదు, ప్రోత్సహించలేదు. పైగా సమయం వచ్చినప్పుడల్లా కౌరవుల ధర్మభంగవర్తనను ఖండించాడు లేదా ధర్మసూక్ష్మాన్ని గ్రహించి తటస్థంగా ఉండిపోయాడు. కర్ణుడు ఆ విధంగా కాక తన లక్ష్యసాధనకు దుర్యోధనునివలె శాశ్వత ధర్మ మార్గానికి విరుద్ధమైన దారిని ఎన్నుకున్నాడు. కర్ణుడు ధృతరాష్ట్రునివలె ధర్మాన్ని తెలిసినవాడు, ధర్మవర్తన ఫలితాన్ని గుర్తించినవాడు. అయినప్పటికీ అతనివలెనే తనలోని ప్రలోభాన్ని జయించలేకపోయాడు. ధర్మప్రభావాన్ని గుర్తించినందుచేతనే కృష్ణునితోను, కుంతీదేవితోను తన నిర్ణయాన్ని, యుద్ధ ఫలితాన్ని నిర్భయంగా వెల్లడించగలిగాడు. అచంచలమైన నిష్ఠతో తాత్కాలికమైన విశేష ధర్మాచరణను కొనసాగించినప్పటికీ ద్వంద్వ ప్రవృత్తి కారణంగా శాశ్వత ధర్మపథానికి చేరటం సాధ్యంకాదని కర్ణధృతరాష్ట్రులు నిరూపించారు.

వ్యక్తి జీవితంలో తత్కాలీన జీవనానికి విశేష ధర్మానుసరణ ఎంత అవసరమో అంతకుమించి శాశ్వత ధర్మానుసరణ ఉత్కృష్టమైనదనే అంశాన్ని మహాభారతం ప్రబోధిస్తుంది. రాజధర్మ నిర్వహణకు, వర్ణాశ్రమ జీవనానికి, జాతి, కుల, దేశ సంబంధమైన ధర్మాలకుగల ప్రాధాన్యం వివరిస్తూనే ఇవి లౌకికమైన జీవనానికి సంబంధించినవని స్పష్టంచేస్తున్నది. విశేషధర్మంపేర ఆచరించేది ప్రవృత్తి ధర్మమని వివరిస్తున్నది. మానవుని శాశ్వతపథగమ్యాన్ని చేర్చేది ఆధ్యాత్మధర్మం. ఇదే నివృత్తి ధర్మం. మనిషి ప్రవృత్తి ధర్మ నిర్వహణ కొనసాగిస్తూనే నివృత్తి ధర్మపథాన్ని చేరుకోగలగాలి. అట్టి స్థితికి చేర్చగలిగినది జ్ఞానం ఒక్కటే. ఆ జ్ఞానమే ప్రకృతి తత్త్వాన్ని, జీవలక్షణాన్ని తెలియజేస్తుంది. జరామరణములు ప్రకృతి ధర్మమని, అమృతత్వమే అక్షరమైనదని గుర్తించటమే జ్ఞానం. ప్రకృతి లక్షణాన్ని వ్యక్తమని, అక్షరత్వము అవ్యక్తమని మహాభారతం వివరిస్తున్నది. వ్యక్తావ్యక్తములు

రెంటిని తెలుసుకోగలిగినవాడే జ్ఞాని. సాధ్యసాధన ధర్మపరులైన వ్యక్తులు ఇట్టి జ్ఞానాన్ని పొందినవారు. ఇతరులు విశేషధర్మాచరణలో విశిష్టులని పేరుపొందినప్పటికీ శాశ్వతపథానికి చేరుకోలేకపోయారు. వారిలో వ్యక్తావ్యక్త గ్రహణ శక్తి మరుగున పడటమే కారణం.

శాశ్వత విశేషధర్మాలను ప్రబోధించిన మహాభారతం ఉపాఖ్యానాల ద్వారా సోదాహరణంగా ధర్మస్వరూపాన్ని నిరూపిస్తున్నది.

★

# 8. ధర్మప్రబోధంలో ఉపాఖ్యానాల పాత్ర

ఆంధ్రమహాభారతంలో కౌరవ పాండవుల గాథ ఇతివృత్తంగా తీసుకొని వ్యాసుడు ప్రబోధించిన ధర్మతత్త్వాన్నే కవిత్రయం వారు నిర్వహించారన్న విషయాన్ని ఇంతవరకూ పరిశీలించి చూశాము. ఈ ధర్మప్రబోధానికి ప్రధాన కథతోపాటుగా మహాభారతంలోని అనేక ఉపాఖ్యానాలు ధర్మప్రచార సాధనాలుగా వర్ణితమైనాయి. ఈ ఉపాఖ్యానాలు శాశ్వత ధర్మాలను, విశేష ధర్మాలను, జన్మమృత్యురహస్యాలను, కాలప్రభావాన్ని, విధివిలాసాన్ని అనేక విధాలుగా పునరుద్ఘాటించాయి. వీనిలో ప్రధానకథతో సంబంధం ఉన్నవి, జనమేజయునితోను, పరీక్షిత్తుతోను సంబంధంవున్నవి, కేవలం ధర్మప్రబోధం కొఱకే ధర్మరాజుకుగాని, ఇతరులకుగాని వివరించినవి అనేకం ఉన్నాయి. ఈ ఉపాఖ్యానాలు ధర్మతత్త్వ నిరూపణ చేయటమే కాక మానవ జీవితంలో ఎదురయ్యేటటువంటి కార్యకారణ సంబంధాన్ని, విధి లేక కాల ప్రభావాన్ని వివరిస్తాయి. మానవుడు కాలచక్రంలో బంధితుడైన జీవి. కాలము ఆదిమధ్యాంతరహితమై నిరంతరం కొనసాగిపోతూంటుంది. భూతభవిష్యద్వర్త మానాలనే విభాగం తన జీవితాన్ని బట్టి మానవుడు ఏర్పరచుకున్నదే తప్ప అనంతమైన కాలానికి సంబంధించినది కాదు. మనిషి జీవితంలో అతడు చేసే పనులను బట్టి అతడి జీవనవిధానము, జీవితానంతరం లభించే శాశ్వతపథము నిర్ణయింపబడతాయి. కనుకనే మానవులు ధర్మాన్ని అనుసరించి శాశ్వతపథాన్ని చేరుకునేందుకు ప్రయత్నించాలని ఉపాఖ్యానాలద్వారా భారతం వివరిస్తున్నది.

కార్యకారణ సంబంధాలను వివరించే ఉపాఖ్యానాలలో సౌపర్ణోపాఖ్యానము, ఉదంకోపాఖ్యానములు ప్రధానకథకు సంబంధించిన గాథలు. గరుత్మంతుని జన్మము, అతని పరాక్రమ వర్ణనలు సౌపర్ణోపాఖ్యానంగా ప్రసిద్ధిచెందాయి. సవతులైన కద్రువ, వినతల మధ్య మాత్సర్యం కారణంగా కద్రువ పుత్రులైన నాగులకు శాపం, వినతకు దాస్యం సంభవించాయి. వినతాపుత్రుడైన గరుడుడు తల్లికి దాస్యవిమోచనం కల్పిస్తాడు. నాగుల శాపకారణ ఫలితంగా జనమేజయుని సర్పయాగం, యాగశాలలో మహాభారత కథాశ్రవణం అనే కార్యాలు సంభవించాయి.

గురుకార్య నిర్వహణలో అవరోధం కల్పించిన తక్షకుని చర్య, ఉదంకుడు జనమేజయుని సర్పయాగానికి ప్రోత్సహించేటట్లుగా చేసింది. గురుపత్ని కోరిక తీర్చేందుకు ఉదంకుడు పౌష్యమహారాజు భార్య కుండలాలను అర్థించి తెచ్చేందుకు బయలుదేరుతాడు. పౌష్యుని ఆతిథ్యాన్ని స్వీకరించి పౌష్యదేవి కుండలాలను పొందుతాడు. ఆ కుండలాలను అపహరించేందుకు తక్షకుడు నిరంతరం ప్రయత్నిస్తుంటాడని, జాగ్రత్త వహించి ఉండమని పౌష్యదేవి ఉదంకుని

హెచ్చరిస్తుంది. మార్గమధ్యంలో ఉదంకుని ఏమార్చి తక్షకుడు కుండలాలను అపహరిస్తాడు. తపశ్శాలియైన ఉదంకుడు తక్షకుని వెంబడించి నాగలోకాన్ని చేరి, నాగులను స్తుతించి తన ప్రభావాన్ని చూపి తిరిగి కుండలాలను పొందుతాడు. సమయం మించిపోకుండా కుండలాలను గురుపత్నికి అందించినప్పటికీ తనకు కార్యవిఘ్నం కల్పించిన తక్షకుని పట్ల క్రోధోద్దీప్తుడౌతాడు. సమయం కొఱకు వేచివుంటాడు.

క్షుత్పిపాసాపరుడైన పరీక్షిత్తులో క్రోధం ఒక బలహీనతగా మారిన కారణంగా ముని శాపానికి గురైనాడు. తక్షకుని విషాగ్నికి బలియై మృతుడైనాడు. ఉదంకుడు తక్షకునిపట్ల తనలో రగులుతున్న క్రోధాన్ని, తండ్రి మరణకారణం తెల్పి జనమేజయునిలో ప్రజ్వలింపజేస్తాడు. కద్రువ, ఉదంకులలో కలిగిన మాత్సర్యక్రోధాలే సర్పయాగానికి, మహాభారత కథాశ్రవణానికి ముఖ్యకారణాలైనాయి. గరుడునిచేత అమృతం తెప్పించి, అమృతపానం ద్వారా పుత్రులకు తానిచ్చిన శాపాన్ని తప్పించాలని కద్రువ ప్రయత్నించినా అది సాధ్యపడలేదు. కార్య కారణాల మధ్యగల బలమైన సంబంధాన్ని మహాభారతం అద్యంతం వర్ణించింది. కారణంలేకుండా ఏ కార్యమూ సంభవించదు. ఆ కారణం ప్రధానంగా స్వయంకృతమై ఉంటుంది.

శీఘ్రకోపియైన ఉదంకుడు దుష్టాన్నము పెట్టినందుకు పౌష్యుని 'అంధుడవు కమ్మని' శపించి అతనినుండి ప్రతిశాపాన్ని పొందుతాడు. ఒక చిన్న పొరపాటును సహింపలేక నన్ను శపించిన నీవు పుత్రహీనుడవై జీవించమని పౌష్యుడు ఎదురుశాపం ఇస్తాడు. కుండలాలను అందిస్తూ పౌష్యదేవి హెచ్చరించినప్పటికీ ఒక జలాశయ ప్రాంతంలో స్వధర్మ నిర్వహణకై పూనుకుని ఉదంకుడు కుండలాలను పొగొట్టుకుంటాడు. తిరిగి తక్షకుని వద్దనుంచి వానిని పొందినప్పటికీ అతడిలో కోపం చల్లారలేదు. కురుక్షేత్రయుద్ధానంతరం కూడా తన ఆశ్రమానికి వచ్చిన శ్రీకృష్ణుని చూచి యుద్ధాన్ని నివారించనందుకు తన ఆగ్రహాన్ని వ్యక్తం చేస్తాడు. కృష్ణుని శపించేందుకు సిద్ధపడతాడు.

పితృదేవతల ఉత్తమ గతులకు, వంశ విస్తరణకు సంతానం పొందటం ధర్మం అని విశ్వసించే కాలంలో సంతానహీనత సాధారణ విషయం కాదు. క్రోధం కారణంగా ఉదంకుడు తనకూ, పితృదేవతలకూ కూడా ఉత్తమ గతులులేకుండా చెసుకున్నాడు. సంతానం ప్రాముఖ్యాన్ని మహాభారతం దీర్ఘతముని వృత్తాంతంలో నొక్కివక్కాణించింది. 'క్రతుశతంబుకంటె సుతుండ మేలు' అని భావించే కాలంలో ఉదంకుడు క్రోధం కారణంగా నిస్సంతుగా మిగిలిపోయాడు.

కార్య కారణ సంబంధం వలెనే కాలప్రభావాన్ని కూడా మహాభారతం అనేక సందర్భాలలో వివరించింది. సకల చరాచర సృష్టిలో సమస్త కార్య కారణాలకు సాక్షీభూతమై నిలిచేది కాలం.

"క్రియాంతరం కాలః" రెండు పనుల మధ్యది కాలము అని కాల నిర్వచనం. ఆ రెండు పనులకూ కార్యకారణ సంబంధం ఉంటుంది. అన్నిటికీ అతీతమైన కాలం మేలుకీళ్ళను కలిగిస్తున్నట్లు కన్పిస్తుంది కాని నిజానికి ఆయాఫలితాలకు కార్యకారణాలే ముఖ్య కారణం. అందువలననే 'కాలో ఽస్మిన్' అని శ్రీ కృష్ణుడు గీతలో తానే కాలాన్ని, అనగా అన్నింటికీ అతీతమైనవాడిని, దేనిచేత బంధింప రానివాడిని, సాక్షీభూతుడను అని వివరించాడు. భూభార నిర్మూలనకై ప్రజాక్షయం జరగవలసివున్న విషయం విధికృతం. విధి కార్యకారణాలచేత రూపొందేది. అవి ప్రారబ్ధాలు కావచ్చును, సంచిత కర్మలు కావచ్చును. ఆయా కర్మల ఫలితంగా అనుభవైకవేద్యమైనదే విధి. ప్రజాక్షయానికి విధి నిర్ణయం కారణం కాగా కౌరవులు తమ కర్మల ద్వారా ఆ కార్యాన్ని సానుకూలపరచారు. వీటన్నిటికీ కాలం సాక్షిమాత్రంగా నిలచింది. ఈ కార్యకారణాలు, విధివిధానం, కాలప్రాబల్యాలను వివరిస్తూనే, వీటన్నిటి మధ్య మానవుడు శాశ్వత విశేష ధర్మాలను అనుసరించినట్లైతే శాశ్వత పథానికి చేరగలడని మహాభారతం ప్రబోధిస్తోంది.

విశేష ధర్మాలను చాతుర్వర్ణ్య ధర్మాలు, ఆశ్రమ ధర్మాలు, రాజధర్మాలు, పతివ్రతా ధర్మాలు అనే వివిధ రూపాలలో భారతం విపులంగా వర్ణించింది. వీనికి సంబంధించిన ఉపాఖ్యానాలను ఎన్నింటినో ఉదహరించింది. ఇక శాశ్వత ధర్మాలకు సంబంధించిన ఉపాఖ్యానాలలో ధర్మం మనుషులందరకు, సర్వకాల సర్వావస్థలలోను అనుసరణీయమైనదిగా మహాభారతం వివరిస్తోంది. సందేహాలకు, అనుమానాలకు సమాధానాలుచెప్పి యథార్థమైన ధర్మస్వరూపాన్ని ఉపాఖ్యానాలద్వారా నిరూపిస్తోంది.

శాశ్వత ధర్మాలలో సత్యవాక్పాలనకు మహాభారతం అగ్రస్థానాన్ని కల్పిస్తున్నది. 'నూరుగురు కొడుకులకంటే ఒక్క సత్యవాక్కుమేలని నిర్ద్వంద్వంగా ప్రకటించింది. సత్యవాక్కు అంటే ఉన్నది ఉన్నట్లు చెప్పటం మాత్రమేకాక ఇతరులను బాధింపనిది కూడా సత్యమే అని ధర్మసూక్ష్మాన్ని స్పష్టంగా చెప్పింది.

ఉ॥ **భూత హితంబుగా బలులకు బొంకుదు సత్య పలంబునిచ్చు ద**
**ద్భూత భయాస్పదంబగు ప్రభూతపు సత్యము బొంకునట్లు ప్రా**
**ణా తరుదైనచోఁ బరిణయంబున యందును బల్కు బొంకు స**
**త్యాతి శయంబయంద్రు మహితాత్మక ఇట్టివి ధర్మ సూక్ష్మముల్** ★

అని సత్యవాక్పాలనను వివరించింది. సత్యమును పలుకుటయే సత్యవాక్పాలన అయినప్పటికీ ఇతరులను బాధించునటువంటి యథార్థాన్ని చెప్పరాదని, ప్రాణులకు మేలు

---

★ 56. ఆం. మ. భార. అరణ్య 5-62

కలిగించునటువంటి అసత్యము సత్యఫలాన్ని ఇస్తుందని. ప్రాణరక్షణ సమయములందు, పరిణయములనందు పలికినట్టి అసత్యము సత్యమును మించినదని ధర్మసూక్ష్మాన్ని వివరించింది. సత్యవాక్పాలనకు అర్థం పరహితమేనని. పరులను బాధించేది యథార్థమే అయినా అది అసత్యంతో సమానమవుతుందని చెప్పి సత్యవాక్పాలనకు లోకహితం పరమార్థమని భారతం తెలియజేస్తున్నది

సత్యవాక్పాలన తరువాత అంతటి మహిమాన్వితమైన ధర్మం అహింస. మానవ జీవితంలో నాలుగు రకాలైన హింసకు అవకాశం వుంది. మనస్సుతో, వాక్కుతో, శరీరంతో ఇతరులను హింసించడం అనే మూడు విధాలు కాక మాంసభోజనాన్ని నాల్గవ రకమైన హింసగా భారతం చెప్పింది.

మనోవాక్కాయాలతో ఇతరులను హింసించరాదనే మాట నిస్సంశయమైనదే. దీనినే అహింసావ్రతమని అంగీకరించటంలో సందేహంలేదు. అయితే మాంసభోజనం హింసగా పరిగణింపబడినప్పుడు మాత్రం కొంత ఇబ్బంది కలుగుతుంది. అటువంటి సందేహనివృత్తికోసమే పితృకార్యములందు, యజ్ఞముల యందు వేదవిహితమైన హింస అహింసతో సమానమని, రుచికోసం జంతువులను చంపి భుజించటం, వినోదం కోసం జంతువులను వేటాడటం హింస అవుందని భారతం వివరించింది. ఏ కారణమూ లేకుండా, హింసాప్రవృత్తితో లేడిని కొట్టినందుకే పాండురాజును మృగరూపంలోవున్న కిందముడనే ముని శపించాడు అయితే జాతి ధర్మంగా జీవులకు విధింపబడిన భోజనం హింసకాదనే ధర్మసూక్ష్మాన్ని శిబి అనే రాజర్షికి, డేగ, పావురాలకు జరిగిన సంవాదం ద్వారా భారతం వర్ణించింది.

సత్యాహింసలనే రెండు ప్రధాన ధర్మాలకు మూలకందమైన ధర్మవ్యాధోపాఖ్యానంలో 'హింస చేయనివాడు ఒక్కడైనా ఈ సృష్టిలో ఉండడని, తమ తమ శక్త్యానుసారం హింసకు దూరంగా ఉండటం కూడా అహింసయే' అనే ధర్మసూక్ష్మాన్ని భారతం ప్రబోధిస్తుంది. ధర్మవ్యాధుడు ఒక మాంస విక్రేత, ధర్మస్వరూపాన్ని తెలుసుకునేందుకై సుశీల అనే పతివ్రత చేత ప్రబోధితుడైన కౌశికుడనే బ్రాహ్మణుడు ధర్మవ్యాధుని వద్దకు వస్తాడు. అతడి వృత్తిని, జీవన విధానాన్ని చూచి ఆశ్చర్యం పొందుతాడు. కౌశికుని ఆశ్చర్యాన్ని గుర్తించి ధర్మవ్యాధుడు అతడి సందేహాలను తీరుస్తాడు. వృత్తిధర్మంగా, ఇతరులు వధించి తెచ్చిన జంతువుల మాంసమును మాత్రమే తాను తగిన వెలకు అమ్ముతానని తనకు తానై హింసచేయనని వివరిస్తాడు. మాతా పితృల సేవ, సత్యశౌచదయాగుణములయందు శ్రద్ధ, పరనిందాలాపములపట్ల విముఖత, ఏకపత్నీవ్రతము, నిందాస్తుతులయందు సమాన భావము తన స్వభావ లక్షణాలని కౌశికునకు వినయపూర్వకంగా వివరిస్తాడు. ధర్మ వ్యాధోపాఖ్యానం ద్వారా మహాభారతం హింసకూ, సత్ప్రవర్తనకు గల

భేదసారూప్యాన్ని వర్ణించింది. కేవలం స్వాధ్యాయం చేతగాని, కర్మ సన్యాసం చేతగాని ధర్మమార్గాన్ని గుర్తించటం సాధ్యంకాదని కౌశికుని వృత్తాంతం ద్వారా వివరిస్తున్నది. దేశ, కాల వర్ణాశ్రమ జీవన విధానాలను కొనసాగిస్తూనే ధర్మమార్గాన్ని అనుసరించవలసిందిగా భారతం ప్రబోధిస్తోంది.

దానశీలగుణంలోకూడా మనిషి సంపద ఉన్నప్పుడు దానం చేయటం ఘనత కాదని అదివారి సహృదయతకు నిదర్శనం మాత్రమేనని భారతం తెల్పుతున్నది. జన్మగతమైన కవచకుండలాలను ఒలిచియిచ్చిన కర్ణుని దానశీలతను, రాజసూయ, అశ్వమేధయాగాలలో విశేష ధనరాశులను తన రాజ్యంతో సహా దక్షిణగాయిచ్చిన యుధిష్ఠిరుని ఉదారగుణాన్ని ప్రస్తుతించిన మహాభారతం సక్తుప్రస్థుడు ఈ ఇద్దరినీమించిన దానశీలుడని వర్ణించింది.

సక్తుప్రస్థుడనే బీదబ్రాహ్మణుడు ఉంఛవృత్తితో జీవిస్తూ 'అకలిగొన్నవానికి అన్నంబిచ్చుట పరమధర్మమ'నే సూక్తిని పాటించి జీవిస్తుంటాడు. ఒకనాడు ఒక వృద్ధబ్రాహ్మణుడు ఆకలిగొని వారి అతిథిగా వస్తాడు. అదే సమయానికి కుటుంబసభ్యులందరు ఆనాటి భోజనాన్ని పంచుకొని తినేందుకూ ఉపక్రమిస్తుంటారు, అప్పుడు వచ్చిన అతిథిని అదరించి అతని ఆకలిని తీర్చేందుకు ఒకరి తరువాత ఒకరు తమ వంతు ఆహారాన్ని సంతోషంగా సమర్పిస్తారు. తాము క్షుధార్తులైనప్పటికీ అతిథిని సంతృప్తిపరచటంలో వారు చూపిన సహృదయతకు, వారి ధర్మ నిరతికి వృద్ధవిప్రుని రూపంలో వచ్చిన యముడు సంతోషితాంతరంగుడౌతాడు. వారి దానగుణాన్ని ప్రశంసించి వారి వాంఛితార్థాన్ని ప్రసాదిస్తాడు. ఈ ఉపాఖ్యానం ద్వారా దానగుణాన్ని వర్ణిస్తూ భారతం 'అర్హతను, పాత్రతను గుర్తించి చిన్నవస్తువునైనా సమర్పించటం ఉజ్వలమైన ధర్మమని దానప్రయోజనాన్ని కూడా వివరించింది. దానం అనేది దాతలకు పుణ్యఫలాన్నిచ్చేది మాత్రమే కాక స్వీకరించేవారికి వారి అవసరాన్ని తీర్చేదిగా, ఉపయోగకరంగా ఉండటం ముఖ్యమనే ధర్మసూక్ష్మాన్ని ప్రకటించింది. పుణ్యఫలార్థులై శక్తి కొలది అనేక దానాలుచేయటం విశేషధర్మం కాగా ఎదుటివారి అవసరాన్ని గుర్తించి తనకులేకున్నా వారికి దానం చేయటం శాశ్వతమైన దానశీలత అని చాటిచెప్పింది.

మహాభారతంలోని ఉపాఖ్యానాలు ధర్మనిరూపణకు, ధర్మసూక్ష్మ వివరణకు నిధులై ధర్మశాస్త్రమైపరగు మహాభారతానికి పురాణతత్వాన్ని అపాదింపచేస్తున్నాయి. కృష్ణద్వైపాయనముని వాక్కుననుసరించి 'ఇక్కడ ఉన్నది అంతటావున్నది, ఇక్కడ లేనిది ఇంకెక్కడా లేదు' అనే మాటను అక్షరసత్యంగా ఆంధ్రమహాభారతం నిరూపిస్తున్నది.

# 9. ఆంధ్రమహాభారతం ప్రబోధించిన ధర్మతత్త్వం

సంస్కృత మహాభారతంలో కృష్ణద్వైపాయనుడు నిరూపించిన అర్థాన్నే తెలుగులో ప్రతిపాదింపుమని రాజరాజు తనను కోరినట్లుగా నన్నయభట్టారకుడు స్పష్టంగా చెప్పారు. తిక్కన కూడా ధర్మార్థకామ మోక్షములకు మహాభారతం మూలకందమని పేర్కొని శ్రుతి, స్మృతి, పురాణములలో భిన్నాభిప్రాయాలవలన వాదాలు చెలరేగితే ఆ వాదాలకు పరిష్కారం చూపించేది మహాభారతమేనని ప్రకటించారు. సమస్త ధర్మాలకు తార్కాణమైన మహాభారతమనే వేద సంహితను వ్యాసుడు లోకహిత నిష్ఠతో చేశాడని వర్ణించారు. ఎఱ్ఱాప్రగడ నన్నయభట్టు మార్గాన్నే అనుసరించి తద్రచనయకా భారతపూరణ చేసినట్లు చెప్పుకున్నాడు. కవిత్రయం వారు ఆంధ్రమహాభారతంలో వ్యాసహృదయాన్ని సమగ్రంగా ఆవిష్కరించారు. ధర్మసంస్థాపన కార్యాన్ని, ధర్మప్రచారాన్ని లక్ష్యంగా గ్రహించి ఆంధ్రమహాభారతాన్ని నిర్మించారు. ఇంతవరకు ఆంధ్రమహాభారతం ఆధారంగా తీసుకుని సంస్కృత మహాభారతాన్ని అవసరమైన తావుల పరిశీలిస్తూ ధర్మస్వరూపాన్ని, ధర్మతత్త్వాన్ని, ధర్మసూక్ష్మాన్ని గురించి తెలుసుకున్నాం. ఆంధ్రమహాభారతం ఆధారంగా సిద్ధసాధ్యసాధన ధర్మమార్గ వర్తనులను గురించి పరిశీలించాం. ఇప్పుడు ధర్మతత్త్వజ్ఞులు, ధర్మమార్గ వర్తనులు అయిన ఆ వ్యక్తుల జీవితాల ద్వారా ఆంధ్రమహాభారతం నిరూపిస్తున్న ధర్మతత్త్వాన్ని గురించి, ప్రబోధిస్తున్న ధర్మ మార్గాన్ని గురించి పరిశీలించవలసివున్నది.

ధర్మో రక్షతి రక్షితః' అన్న సూక్తిని ఆంధ్రమహాభారతం నిరూపిస్తుంది. శాశ్వత విశేష ధర్మాలను, వానిని అనుసరించవలసిన విధానాన్ని వివరించి ధర్మతత్త్వాన్ని, ధర్మసూక్ష్మాన్ని బోధిస్తున్నది. భారతీయ తత్త్వ శాస్త్రాన్ని విశ్లేషించి వివరించిన డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు "సుఖ సాధనములైన ధర్మసూత్రములకు మహాభారతముచ్చస్థానమిచ్చినది. జీవులందరూ దుఃఖ నివారణమును, సుఖప్రాప్తిని కోరుదురు. లోకమున సుఖదుఃఖములు రెండునూ కలసివున్నవి. కానీ సుఖదుఃఖములు రెండు అనిత్యములే. ఏ స్థితియందుండి సుఖదుఃఖములు రెంటినీ నిర్వికార ప్రశాంత చిత్తులమై గ్రహింపగలమో ఆ స్థితిని సంపాధించుటే మానవప్రవృత్తికి పరమావధి. మానవునికి సంపూర్ణ సంతృప్తినొసంగుటకు నిశ్చలస్థితిని ధర్మమే ప్రసాదింపగలదు"[57]. అని వివరించి అటువంటి ధర్మానికి మహాభారతంనుంచే ఉదాహరణలు చూపించారు.

మహాభారత ప్రబోధిత ధర్మాద్వైతాన్ని వివరిస్తూ డా॥ మోపిదేవి కృష్ణస్వామి భారతంలో వ్యక్తి జీవితం-వ్యక్తిగత జీవితం, సామాజిక జీవితం అనే రెండు భాగాలుగా వివరింపబడిందని

★ 57. భారతీయ తత్త్వశాస్త్రము -సం2, డా॥ ఎస్. రాధాకృష్ణ, అనువాదం - బులుసు వెంకటేశ్వర్లు పు. 376

మానవుడు తన జీవితంలోని ఈ రెండు పాత్రలను ధర్మబద్ధంగా నిర్వహించుకోవాలని భారతం చెప్తున్నదని పేర్కొన్నారు. "వ్యక్తిగత జీవితం సామాజిక జీవితానికి దీప్తిని కలిగించాలి. సామాజిక శ్రేయస్సుకు అవసరమైనప్పుడు వ్యక్తిగత జీవితాన్ని మనిషి త్యాగం చేయాలి ఆ త్యాగమే ధర్మం"[58] అని వివరించారు

ఈ విధంగా వివరిస్తూ సామాజిక శ్రేయస్సు కన్నా వ్యక్తిగత జీవితానికే ప్రాముఖ్యాన్నిచ్చే మనిషి అధర్మవర్తనుడు అవుతున్నాడని మహాభారతం ఉపదేశిస్తోందని పేర్కొన్నారు. ధర్మరాజు, కర్ణ దుర్యోధనులు ఈ విషయాన్ని నిరూపిస్తున్నారు. వ్యక్తిగత జీవితం కన్నా సామాజిక జీవితానికి, నిర్వికార ప్రశాంతస్థితికి ప్రాధాన్యాన్నిచ్చిన ధర్మరాజు ధర్మవర్తనుడని పేరొందాడు. వ్యక్తిత్వానికి, వ్యక్తిగత యశస్సుకు ప్రాముఖ్యం చూపిన కర్ణదుర్యోధనులు ధర్మరాజువలె శాశ్వత పథానికి చేరుకోలేకపోయారు. కర్మఫలభోగమైన స్వర్గప్రాప్తిని పొందారు. మానవ జీవితంలో ధర్మాన్ని ఆచరించవలసిన విధానం, ధర్మం తప్ప మరొక మార్గంగాని, ధర్మ సంఘర్షణగాని లేని స్థితిని రామాయణం చూపుతోంది. మహాభారతం అనేక ధర్మ సంఘర్షణలకు, ఆపద్ధర్మాలకు పరిష్కారాలను, సమర్థనలను వివరిస్తోంది. రామాయణం ధర్మప్రతిష్ఠిత కావ్యం కాగా మహాభారతం ధర్మ ప్రబోధ ధ్యేయంగల మహాగ్రంథమైంది.

మానవుడి భౌతిక, ఆధ్యాత్మిక జీవితాలకు సంబంధించిన శాశ్వతపథాన్ని నిర్దేశించి ఒకానొక సంపూర్ణస్థితికి జీవాత్మను చేర్చేది ధర్మం అని మహాభాతరం ప్రబోధిస్తోంది. ధర్మస్థాపకుడైన శ్రీకృష్ణుని భగవంతునిగా, సిద్ధధర్మస్వరూపునిగా ప్రస్తుతించి, భగవంతుడే ధర్మమని ప్రతిపాదిస్తోంది. అధునిక పండితులుకూడా ధర్మమంటే భగవంతుడనీ, భగవంతుడు స్థాపించదలచిన నైతికశ్రేయస్కరపథాన్ని చేరుకోడానికి ధర్మమే సాధనమని అన్నారు. ఇందుకు మార్గంగా మనిషికి మనిషి పట్ల, మనిషికి దైవం పట్ల గల కర్తవ్యాన్ని నిర్వర్తించటం ఒక్కటే సంపూర్ణతకు సరైన బాట అని చెప్పారు. కనుక ధర్మం అనేది మనిషి భౌతిక, ఆధ్యాత్మిక జీవితాలను సన్మార్గంలో నడిపించే సాధనం అని వివరించారు.[59]

ఇట్టి ఈ ధర్మం సమస్త సంపదలకూ మూలమని మహాభారతం వివరించింది. 'శీలంబున ధర్మంబు వెలయు ధర్మంబున సత్యంబు దొరకొను సత్యంబున వృత్తంబు సొప్పడు వృత్తంబున బలంబు వాటిల్లు బలంబున నేను గలుగుండుగావున సమస్తంబులకు మూలంబు శీలంబని[60]

---

★ 58. భారతంధర్మాద్వైతం డా॥ ఎమ్. కృష్ణస్వామి పు.20

★ 59. Kalyanaakalpataru "Dharma And Its Implications"- పరశురామ చతుర్వేది పు. 184

★ 60. ఆం. మ. భార . శాంతి 3-146

సాక్షాత్తు లక్ష్మీదేవి చెప్పింది శీలం అనేది ఇంతకు ముందు చెప్పుకున్న భౌతిక, ఆధ్యాత్మిక జీవితాలకు సంబంధించిన నడవడి. ధర్మంవల్ల లేదా ధర్మానుసరణంవల్ల మాత్రమే ఒక వ్యక్తి శీలం ప్రస్ఫుటమౌతుంది. భారతంలో ప్రధాన వ్యక్తుల ధర్మానుసరణను పరిశీలించినప్పుడు వారి శీలవివరణ అనేక సందర్భాలలో వెల్లడైనది. సంఘర్షణ ఏర్పడినప్పుడు ధర్మసూక్ష్మాన్ని గుర్తించి వారు వ్యవహరించిన తీరు వారి ధార్మికతను, వారు పొందిన శాశ్వతపథాన్ని నిరూపించి చూపింది. మహాభారతంలో ఆది, సభా అరణ్యపర్వాలలో, శాంతి పర్వంలో లౌకిక ధర్మవివరణ, అనుశాసనిక పర్వంలో ఆధ్యాత్మిక ధర్మవివరణ విస్తృతంగా వర్ణితమైనది.

మహాభారత ఆరంభమే దేవశుని సరమతో మొదలౌతుంది, పరీక్షిత్తు కుమారుడు జనమేజయుడు సత్రయాగదీక్షితుడై ఉన్నప్పుడు దేవతాశునకమైన సరమ పుత్రుడు సారమేయుడు యాగస్థలిలో తిరుగాడుతుంటాడు. జనమేజయుని సోదరులు అకారణంగా ఆ కుర్కురకుమారుని బాధిస్తారు. అందుకు కోపించిన సరమ 'యుక్తాయుక్త విచక్షణ లేక అనపరాధులను సాధులైన వారిని బాధించిన దుర్వినీతులకు అనిమిత్తములైన ఆపదలు సంభవిస్తాయని చెప్పి మరలిపోతుంది. సారమేయుని బాధించిన జనమేజయునికిగాని, అతని సోదరులకుగాని ఎటువంటి భయాలు, ఆపదలు సంభవించలేదు. పైగా జనమేజయుడు సర్పయాగప్రేరితుడై యాగశాలలో మహాభారతకథాశ్రవణం అనే భాగ్యాన్ని పొందాడు. సరమ వృత్తాంతం ద్వారా భారతంలో సాధుజనులకు ఎగ్గుతలపెట్టడమనే ధర్మవ్యతిరేక కార్యానికి, కావ్యంలో సంభవించబోయే కౌరవుల ధర్మభంగవర్తనకు సంబంధంచూపి 'వస్తు నిర్దేశం' జరిగింది. అయితే సరమ వృత్తాంతానికి గల ప్రయోజనం ఇంతమాత్రమే కాదు. ఈ వృత్తాంతం వెనుక ధర్మసూక్ష్మం నిక్షిప్తమైవుంది.

మహాభారతంలో మహాప్రస్థానిక పర్వంతో పాండవుల లౌకికగాథ ముగింపుకు వస్తుంది. ముగింపులో కూడా శునకం ప్రాధాన్యం వహించిన విషయం ముఖ్యంగా పేర్కొనవలసివుంది. ధైర్యసారోదారుడు, నిశ్చలహృదయుడు అయిన ధర్మతనయుడు సతీసోదరుల మరణానంతరం నిర్వికల్పుడై మహాపథంలో సాగిపోతాడు. హస్తినాపురాన్ని దాటినప్పటి నుండి వారిని వెన్నంటివచ్చిన శునకం మాత్రం అతడిని అధిక భక్తితో అనుసరిస్తుంటుంది. ఇంద్రుడు దివ్యవిమానసహితుడై వచ్చి అతనిని రథమునధిరోహించి స్వర్గానికి రమ్మని ఆహ్వానిస్తాడు. యాత్ర మొదలైనప్పటి నుంచి ఇంతవరకూ వెంటవచ్చిన సారమేయాన్ని విడిచిపెట్టడం మహాపరాధమని అధర్మమని ధర్మరాజు ఇంద్రునితో పలుకుతాడు. శునకం పొందలేని స్వర్గసుఖం తనకు కూడా వద్దని సభక్తిపూర్వకంగా తిరస్కరిస్తాడు. శరణాగతుడై ఆశ్రయించి వెంటవచ్చిన వారిని విడిచిపెట్టడం క్షత్రియధర్మానికి, మానవధర్మానికి కూడా విరుద్ధమైన చర్య అని ధర్మతత్వాన్ని వివరిస్తాడు. మహాప్రస్థానంలో

దేవతాసందర్శనం వరకు చేరుకోగలిగిన రెండు జీవాత్మలుగా తనను శునకాన్ని సమాన దృష్టితో చూడగలిగిన స్థితికి అతడు చేరుకున్నాడు సర్వాత్మ తత్వాన్ని గ్రహించిన ముముక్షువై ధర్మరాజు విలసిల్లాడు అతడి ధర్మనిరతిని. ధర్మతత్వజ్ఞానాన్ని గ్రహించిన ధర్మదేవత శునక రూపం వదలి ఎదుట నిలుస్తాడు. ధర్మరాజు ధర్మవిరతిని ప్రశంసిస్తాడు. అటు తరువాత భౌతికలోకాన్ని వదలి సశరీరుడై ధర్మరాజు అనే మానవుడు శాశ్వతపథానికి చేరుకుంటాడు ధర్మభంగం వలన అనిమిత్తమైన ఆపదలు చుట్టుకుంటాయని సరమగాథతో మొదలైన మహాభారత ఇతిహాసం ధర్మానుసరణం వల్లనే శ్వాశతపధం లభిస్తుందని, ధర్మమే మనిషిని చివరివరకూ వెంటనంటివస్తుందని మహాప్రస్థాన పర్వంలో నిరూపించింది. సారమేయ వృత్తాంతంతో మొదలైనగాథ శునక వృత్తాంతంతో ముగియడంలోగల ఈ ధర్మతత్వం లేదా ధర్మసూక్ష్మం గ్రహించదగినది.

'వేదో2ఖిల ధర్మమూలం' అనే వివరణ ననుసరించి ధర్మానికి మూలమైన వేదాన్ని ప్రాచీనులు శునక స్వరూపంతో పోల్చారు. వేద స్వరూపుడైన దత్తాత్రేయుడు వేద ప్రతీకలుగా శునకాలను వహించి దర్శనమిస్తాడు. వేద మూలమైన ధర్మానికి, యజమానిని నిరంతరం వెన్నంటి వుండే శునకానికి స్వగుణ సారూప్యం చెప్పారు. అందువల్లనే ధర్మతత్వజ్ఞులు ధర్మశాస్త్రంబని వినుతించిన ఈ పంచమవేదగాథ దేవశునితో ప్రారంభమై, శునక రూపం ధరించిన ధర్మదేవత సాక్షాత్కారంతో ముగిసింది. మహాభారతం ఆద్యంతం ధర్మతత్వ ప్రబోధానికి, ధర్మభంగ పరిణామాలకు ప్రత్యక్ష సాక్షిగా నిలిచింది.

ఇటువంటి ఈ మహాభారతంలో ప్రబోధితమైన ధర్మం నేటికీ అనుసరణీయమైనదా అని విమర్శించి చూడవలసిన అవసరం ఎంతైనావుంది. ఈ పరిశీలనలో భాగంగా శాశ్వత విశేష ధర్మాలను, నైతిక ఆధ్యాత్మిక ధర్మాలను మహాభారతం విశ్లేషించిన విధం ముందుగా ప్రస్తావించవలసివున్నది.

పట్టాభిషేకానంతరం శ్రీ కృష్ణుడు సకల ధర్మతత్వవేత్త అయిన భీష్ముని ప్రార్థించి సర్వధర్మాలను తెలుసుకోమని ధర్మరాజును నిర్దేస్తాడు. మహాభారతంలో శాంతి, అనుశాసనిక పర్వాలు భీష్ముడు ధర్మరాజుకు వివరించిన ధర్మస్వరూప చిత్రణతో నిండివున్నాయి. ధర్మరాజు భీష్ముని 'బహుశాఖలు కలిగిన ధర్మాచరణలో దేనిని ఆచరించి పురుషుడు ఐహిక, అముష్మిక సుఖములను పొందగలడని' ప్రశ్నిస్తాడు. తల్లి, తండ్రి, గురువుల సేవ మిన్నయని, సత్యవాక్పాలన సర్వధర్మములకు మిక్కిలి యైనదని భీష్ముడు సమాధానం చెప్తాడు. అరణ్య పర్వంలో సాక్షాత్తూ ధర్మదేవతయే సత్య,శౌచ, దానాది ఎనిమిది గుణాలు తన రూపాలని పేర్కొంటాడు. భీష్ముడు

చెప్పిన మాతాపితృగురుజనసేవ, సత్యవాక్పాలన, ధర్మదేవత చెప్పిన శౌచ దానాది ఎనిమిది అంశాలు సర్వకాల సర్వావస్థలయందు అందరూ ఆచరింపవలసిన శాశ్వత ధర్మాలు. దేశ, కాల, జాతి, వర్ణ, లింగ భేదం లేక మానవులందరకు సద్గతిని, సచ్ఛీలాన్ని సంప్రాప్తింపచేసే గుణాలే శాశ్వత ధర్మాలు. మహాభారతం వీటిలో సత్యప్రభావాన్ని, దయాగుణాన్ని పరమోత్కృష్టమైన ధర్మాలుగా అనేక సందర్భాలలో వివరించింది. 'వర్ణములకెల్ల నింద్రియవ్యాప్తి నిగ్రహంబు వలయు' అని ఇంద్రియనిగ్రహాన్ని కూడా ఉత్తమమైన శాశ్వతధర్మంగా ప్రశంసించింది. 'అహింసో పరమోధర్మః' అని ప్రబోధించిన శ్రీ కృష్ణ భీష్ములే యుద్ధాన్ని ప్రోత్సహించడం, స్వయంగా యుద్ధం చేయడం విపరీతంగా కన్పిస్తుంది కాని అహింసకు నిర్వచనం అసమర్థత కాదని, స్వధర్మ నిర్వహణలో హింసకు అర్థం వేరని, అకారణంగా పరులకు బాధ కలగించడమే హింస అని ధర్మసూక్ష్మాన్ని వాసుదేవశాంతనవులు వివరించారు. స్వకులధర్మపాలన, వృత్తిధర్మ పాలనలోని హింస అహింసతో సమానమైనదని, మహాభారతం స్పష్టంగా చెప్పింది. ఇంకా పరధనములకు ఆశపడకుండుట, ఇతరులను తనవలె చూచుట, ఏ విషయమునందు అసక్తిలేక తటస్థ భావం వహించి ఉండుట, భూతాళిపై దయగలిగి ఉండుట మొదలైన లక్షణాలను సామాన్య లేక శాశ్వత ధర్మాలుగా భీష్ముడు ధర్మరాజుకు వివరించాడు. ఈ శాశ్వత ధర్మాలు దేశ, కాల, వర్ణ, వర్గ, కుల, గణ, స్త్రీ, పురుష వివక్షత లేకుండా సర్వకాల సర్వావస్థలయందు అందరకు ఆచరణయోగ్యమైనవి. మానవ జీవితంలో భౌతికమైన నడవడిని క్రమబద్ధం చేసుకునేందుకు పాటించవలసిన నియమాలే శాశ్వత ధర్మాలు. భారతంలో విదురసంజయాది ధర్మతత్త్వవేత్తలు, మార్కండేయ వ్యాసాది మహర్షులు సామాన్య లేక శాశ్వత ధర్మాల ప్రాశస్త్యాన్ని అనేక సందర్భాలలో ఉపాఖ్యాన సహితంగా వివరించారు.

భౌతిక జీవితానికి సంబంధించిన శాశ్వత ధర్మాలతో పాటుగా వ్యక్తి సామాజిక జీవితానికి అవసరమైన నియమావళిని 'ధర్మ విశేషాలు'గా మహాభారతం చెప్పింది. పరమేశ్వరుడు పార్వతీదేవికి ధర్మస్వరూపం, శాశ్వత విశేషధర్మాల స్వరూపం వివరించాడని, వానినే నీకు నేను బోధిస్తున్నాని భీష్ముడు ధర్మరాజుకు ధర్మాలను వర్ణిస్తాడు. ఆది మధ్యాంతరహితుడైన పరమేశ్వరుడు ధర్మాలను గురించి ప్రసంగించడంలో గల తాత్పర్యం- ధర్మం కూడా ఆదిమధ్యాంతరహితమై నిరంతరంగా సాగిపోయేది అని తెలియజేయడమే. శాశ్వతధర్మాలు నిశ్చలమైనవి, నిరంతరమైనవి. విశేష ధర్మాలు దేశ, కాల పరిస్థితులకు అనుగుణంగా రూపాంతరం చెందుతుండేవి. ఈ అంశం విశేషధర్మ వివరణ వలన సమగ్రంగా బోధపడగలదు.

శ్రుతి, స్మృతులచే వివరింపబడిన నానా విధములైన ధర్మాలను శివుడు పార్వతికి చెప్పిన దానినే నీకు తెలిపెదననీ భీష్ముడు ధర్మరాజుకు వివరిస్తాడు. జాతి ధర్మములు, దేశ ధర్మములు, కుల ధర్మములు, గణ ధర్మములు, ఆపద్ధర్మాలనే ఐదు రకాల ధర్మాలను నానావిధ ధర్మములుగా పేర్కొంటాడు. ఈ ఐదు రకాల ధర్మాలను మహాభారతం సోదాహరణంగా వివరిస్తున్నది.

## జాతి ధర్మాలు

మహాభారతకాలంలో అనేక జాతులకు చెందిన ప్రజలు విభిన్నమైన జీవన విధానాలను అనుసరించి జీవించేవారు. సంస్కార పూరితమైన నాగరికజాతులు, కిరాత, నాగాది అటవిక జాతులు, ఆర్యనాగరికతకు భిన్నమైన సంస్కృతిగల అసుర జాతులు, జంబూద్వీపంలోని భరతఖండంలో జీవిస్తుండేవి. ఈ జాతులలో తిరిగి వర్ణ, వర్గ, భేదాలుండేవి. ఆయా ప్రజలు వారివారి జాతులను, వర్గాలను ప్రత్యేకంగా చూపునటువంటి జీవన విధానాన్ని అనుసరించేవారు జాతిపరమైన జీవన విధానాన్నే జాతి ధర్మం అని అన్నారు. జాతిధర్మం కారణంగానే ఆర్యనాగరిక క్షత్రియ వంశీయులైన కురుకుమారులతో సహపాఠిగా ద్రోణుడు కిరాత జాతికిచెందిన ఏకలవ్యుని శిష్యునిగా స్వీకరించలేకపోయాడు జాతిధర్మాన్ని అనుసరించి డేగ పావురాన్ని ఆహారంగా పొందే అధికారాన్ని కలిగివున్నానని శిబిచక్రవర్తితో వాదిస్తుంది.★ శ్యేనం వేదవచనాలను చూపి జాతి ధర్మాన్ని వివరించి వాదించినప్పటికీ శాశ్వత ధర్మమైన అహింసామార్గాన్ననుసరించి శిబి చక్రవర్తి, శరణాగత వత్సలుడై కపోతాన్ని రక్షిస్తాడు. తన శరీర మాంసాన్ని సమర్పించి డేగ ఆకలిని తీర్చేందుకు ప్రయత్నిస్తాడు. ఇటువంటి ఈ జాతి ధర్మాలను గుర్తించి ధర్మపాలనను చేయవలసిందిగా భీష్ముడు తన మనుమనికి ఉపదేశిస్తాడు.

## దేశజ ధర్మాలు :

దేశజ ధర్మములన్నవి దేశాచారాలుగా ఆచరణలో ఉంటాయి. ఒక్కొక్క దేశానికి, ఒక్కొక్క ప్రాంతానికి జీవన వ్యవహారంలో ఉండే ఆచారాలే దేశజధర్మాలు. పాండవుల జననానికి ముందు పాండురాజు దేశజ ధర్మాన్ని అనుసరించి కుంతీదేవిని క్షేత్రజ సంతానం కోసం అర్థిస్తాడు. ధృతరాష్ట్ర పాండురాజులు జన్మించినప్పుడు, నియోగవిధితో దేవరన్యాయంతో మహాపురుషులవలన క్షేత్రజ సంతానాన్ని పొందటం గంగామైదానప్రాంతాలలో ధర్మవిరుద్ధంకాదు. కాని అతిథి మర్యాదనను సరించి గృహస్థు తన భార్యను అతిథికి సమర్పించే నాటి కాలంలో శ్వేతకేతు గర్భస్థ శిశువుగా ఉన్నప్పుడు వృద్ధ విప్రుడు తన తల్లిని కామించినందుకు కోపిస్తాడు. ఇట్టి ఈ మర్యాద ఇక మీదట చెల్లనేరదని ఈ ఆచారాన్ని గర్హించి 'ఇకపై సతులకు అన్యపురుష సంగమంబున సకల పాతకములగున'ని శాసిస్తాడు. తన శాసనాన్నే మర్యాద (ధర్మం)గా మనుషులందరు పాటించాలని కట్టడి చేస్తాడు. అయితే పాండురాజు ఉత్తర కురుభూములలో మొదలింటి ధర్మమే ఆచరణలో ఉన్నదని శ్వేతకేతు శాసనం ఇక్క వర్తింపదని చెప్పి కుంతీదేవిని ఒప్పించి క్షేత్రజ సంతానాన్ని పొందుతాడు. దేశజధర్మమైన ఈ విషయాన్ని కురువృద్ధులు, హస్తినాపుర ప్రజలు గౌరవించి ధర్మజాదులను పాండురాజు పుత్రులుగా, కురువంశ ఉత్తరాధికారులుగా స్వీకరించారు.

---

★ 61."శ్యేనాః కపోతాన్ ఖాదయన్తి" అను వేదవచనము గలదు" - ఆం. మ. భార - అరణ్య 3-231.

యుద్ధరంగంలో శల్యుని నిందావాక్యాలకు కోపించి కర్ణుడు 'పాపదేశంలో పుట్టినటువంటి నీకు దుర్బుద్ధిగాక సద్బుద్ధివుంటుందా' అని దూషిస్తాడు. మద్రదేశ ప్రజలు అధర్మవర్తనను దేశాచారంగా పాటిస్తారని విమర్శిస్తాడు. అంతేకాక గోమాంస భక్షణము, మద్యపానము చేసి అసంగత దురాలాపములతో సంచరించే బాహ్లిక దేశీయులకన్నా మద్రదేశ ప్రజలు అవినీతులని తీవ్రంగా పల్కుతాడు. ఒక దేశంలో అధర్మాలు, అకార్యాలుగా పరిగణింపబడిన అంశాలు మరొక దేశంలో చెల్లుబాటు అయ్యేందుకు వీలుందని, అవే దేశజ ధర్మాలని, ఒక్కొక్క దేశానికి ఒక్కొక్క రకమైన ధర్మం ప్రవర్తిల్లుతుంటుందని మహాభారతం సోదాహరణంగా చూపుతున్నది.

**కులధర్మం : -**

సంస్కృత మహాభారతంలో వర్ణం, కులం పర్యాయ పదాలుగానే ప్రయోగించారు. ఆంధ్రమహాభారత కాలం నాటికి వర్ణాలు, కులాలు వేరయ్యాయి. వర్ణాలు అగ్ర, అగ్రేతర విభాగాలుకాగా, కులాలు వృత్తులను బట్టి ఏర్పడి శాఖోపశాఖలై విస్తరించాయి. నన్నయ ప్రయోగించిన 'తన కుల బ్రాహ్మణు' అన్న మాట వర్ణానికి, కులానికి గల భేదాన్ని సూచిస్తోంది. బ్రాహ్మణ శబ్దం వర్ణం అనే అర్థంతోను కుల శబ్దం రాజరాజుకు సంబంధించిన రాచకులం అనే అర్థంతోను నన్నయ ప్రయోగించాడు. ఆంధ్రమహాభారత రచనలో మాత్రం వ్యాస భారతంలో మాదిరిగానే కవిత్రయంవారు వర్ణం, కులం అనే పదాలను పర్యాయపదాలుగానే ప్రయోగించారు.

ఈ కులధర్మాలను వర్ణధర్మాలుగాను, వర్ణాశ్రమ ధర్మాలుగాను మహాభారతం వర్ణించింది. సంస్కృత మహాభారత కాలంనాటికి వర్ణవ్యవస్థ ఏర్పడింది కాని జన్మచేత వర్ణం, కులం స్థిరపడతాయని రూఢికాలేదు. కులము ఏదైనప్పటికీ ఎవరికి నచ్చిన వృత్తిని లేదా సామర్థ్యం గల వృత్తిని వారు స్వీకరించే అవకాశం అనాడు ఉండేది. పెరిగిన కుటుంబ పరిసరాలనుబట్టి, వారు పొందిన జన్మసంస్కారాలను బట్టి భారతకాలంలో కులనిర్ధారణ జరిగేదని అనేక ఉదాహరణలు తెల్పుతున్నాయి. క్షత్రియుడైన చేదినాథుని వీర్యసంజనిత అయిన మత్స్యగంధి దాసకులంలో పెరిగింది. ఆమె క్షత్రియుడైన వసురాజు పుత్రికగా కాక దాశరాజు కుమార్తెగానే వర్ధిల్లింది. దాసకులానికి తగిన ధర్మాన్ని అనుసరిస్తూ, వారి కులాచారాలతో ఆమె యుక్తవయస్కురాలైంది. శంతనుని వివాహమాడిన తరువాత సత్యవతి కులాన్ని గురించిన ప్రసక్తి రాలేదు. క్షత్రియుల మర్యాదను, దేశజాతి ధర్మాలను సత్యవతి అనుసరించింది.

మంత్రశక్తి ప్రభావంతో కుంతీదేవికి జన్మించిన కర్ణుడు రూప గుణతేజోవిలాసాలలో విశిష్టుడై వర్ధిల్లాడు. అయినప్పటికీ సూతకులం వారింట పెరిగి సూతకులానికి తగిన సంస్కారాలను పొంది ఆ కులాచారాలను అనుసరించినందువల్ల సూతునిగానే పరిగణింపబడ్డాడు. ఒక్కొక్క

కులానికి వారువారు చేపట్టిన వృత్తులనుబట్టి కులధర్మాన్ని, వృత్తిధర్మాన్ని పాటించవలసిన అవసరం ఆనాడు ఉండేది. అగ్రవర్ణులై బ్రాహ్మణకులంలో జన్మించిన కృపాచార్య, ద్రోణాచార్య అశ్వత్థామలు క్షాత్రవృత్తిని అవలంబించారు వారి జీవితాలలో బ్రాహ్మణ వర్ణ ధర్మపాలన, క్షాత్ర ధర్మపాలన రెంటినీవారు నిర్వహించారు. పెరిగిన సంస్కార సంబంధమైన కులధర్మాన్ని ఆచరించాలని, కులము, వృత్తి మార్చుకునేందుకు ఆ కాలంలో అవకాశం ఉందని మహాభారతం ద్వారా తెలుస్తున్నది. జన్మవృత్తాంతం తెలియకపోయినా సూతకులంలో పెరిగిన కర్ణుడు క్షాత్రవృత్తిని చేపట్టి దుర్యోధనుని మిత్రుడై అంగరాజ్యానికి అభిషిక్తుడైనాడు. కుల ధర్మాన్ని పాటించటం అందరకు అవశ్యకమని భారతం బోధిస్తున్నది. భగవద్గీతలో శ్రీకృష్ణుడు కూడా క్షత్రియ కులోచితమైన ధర్మాన్ని పాటించమని, నిస్సంశయచిత్తంతో యుద్ధంచేయమని అర్జునుని ప్రబోధిస్తాడు. కౌరవులనుండి రాయబారం తెచ్చిన సంజయుడు 'నీవు గురుజనులను, బంధువులను వధించిపొందే సౌఖ్యం ఎటువంటిది? రక్తపుకూటికంటే భిక్షాన్నము మేలుగదా' అని ధర్మరాజును యుద్ధ విముఖుని చేయాలని ప్రయత్నిస్తారు. అప్పుడు ధర్మరాజు వంశదూషకులు, 'లోకకంటకులైన వారిని నిర్మూలించుట ధర్మమని పెద్దలవలన వింటినని అదేగాక యుద్ధము రాజులకు ధర్మంకాదని నీవు చెప్పు' అని కుల ధర్మాన్ని గురించి ప్రస్తావిస్తారు. ఎటువంటి పరిస్థితులలోను కులధర్మాన్ని విడువరాదని మహాభారతం స్పష్టంగా చెప్పింది.

**గణ ధర్మాలు :**

జాతి,దేశ కుల ప్రమేయం లేకుండా వృత్తిని అనుసరించి ఏర్పడేవి గణాలు. 'ఒక్కిండ్లవారైన జనంబుల్ అర్థార్జకులుగాను కార్యనిపుణ మానసులుగాను ఆయుధ జీవులుగాను ఇతరములైన పనులలోను గణములుగా ఏర్పడి వ్యవహరిస్తుంటారని' భీష్ముడు వివరించాడు. కులము ఏదైనప్పటికీ వారనుసరించే వృత్తిమార్గాన్ని బట్టి ఏర్పడిన గణాలు ఆనాడు ప్రచారంలో ఉండేవి. కులాన్ని అనుసరించి వృత్తిగాని, వృత్తిని బట్టి కులంగాని స్థిరపడని కాలంలో గణాలు ప్రముఖ స్థానాన్ని వహించివుండేవనటంలో సందేహంలేదు. బ్రాహ్మణులు క్షత్రియగణంలో, వైశ్యులు శూద్ర గణంలో, క్షత్రియులు బ్రాహ్మణగణంలో అవసర రీత్యాగానీ, మరేకారణం చేతనైనాగానీ చేరుతూండడం ఆనాడు సర్వసామాన్యమైన విషయం. బ్రాహ్మణ కులజులైన ద్రోణాచార్య కృపాచార్యులు క్షత్రియ గణంలో చేరగా నిర్వికారుడైన జనక మహారాజు బ్రాహ్మణ గణ సహజమైన వేదాంత చర్చలలో నిష్ణాతుడైనాడు. మహాభారతంలో అజ్ఞాతవాసకాలంలో పాండవులు విభిన్న గణాల వ్యక్తులుగా రూపాలు ధరించి వారితో కలసి వారి జీవన ధర్మాన్ని అనుసరించటం తెలిసిన విషయమే.

రాజకీయంగా కూడా ఆనాడు రాజవంశపాలనతో పాటు గణరాజ్య పాలనకూడా కొనసాగేది కిరాతులు, నాగులు మొదలైనవారివి గణరాజ్యాలు. వంశపారంపర్య రాజకీయ వ్యవస్థకన్నా గణరాజ్యపాలన, గణాలకు చెందిన ప్రజల జీవన విధానం భిన్నంగా ఉండేది. ఈ గణాలకు అధిపతులుంటారు.[62] గణ ముఖ్యులను ఆదరించి వారు తమలో తాము కలహించకుండాను, రాజుకు కీడు తలపెట్టకుండాను జాగ్రత్త వహించవలసిన భారం రాజుదని భీష్ముడు హెచ్చరిస్తాడు. గణ ధర్మాన్ని గౌరవించి, గణ ప్రజలను కూడగట్టుకున్న ప్రభువుకు సంపదలు పెరుగుతాయని చెప్పి గణధర్మాన్ని గౌరవించవలసిన అవసరాన్ని వివరిస్తాడు. ఈనాటి పరిభాషలో చెప్పాలంటే Professional Ethics అనే వాటిని గణ ధర్మాలని చెప్పవలసివుంది.

**ఆపద్ధర్మాలు :**

'కాయంబు వికృతులఁ గాల విపర్యముల వచ్చు నాపద్ధర్మవర్తనములు' అని భీష్ముడు ఆపద్ధర్మాన్ని వివరిస్తాడు. ప్రాణాపాయ స్థితిలో కాని, మార్గాంతరం లేనప్పుడుగాని అనుసరించవలసిన విధానమే ఆపద్ధర్మం. శాశ్వత విశేష ధర్మాలను వివరించిన మహాభారతం ఆపద్ధర్మాలు ధర్మసూక్ష్మానికి ప్రతీకలుగాను, శాశ్వత ధర్మ ప్రతిష్ఠాపనకు దోహదకారులుగాను ఉండాలని నిర్వచించింది. ఆపద్ధర్మాలనేవి ఆపద తీరిన తరువాత విడువలసినవే తప్ప అవి సదాచారాలు కానేరవు. తత్కాలిక గండం గడిచిన తరువాత విధివిహిత ధర్మానుసరణకు మరలిరావాలి. ఆపద్ధర్మం ధర్మాన్ని అధర్మంగాను, అధర్మాన్ని ధర్మంగాను దర్శింపజేస్తుంది. అందులోని ధర్మసూక్ష్మాన్ని గ్రహించలేకపోతే, అందలి తత్త్వాన్ని తెలుసుకోలేకపోతే 'తృణావృత కూపంలో పడిన జీవిచందాన' మనిషి అధర్మమనే అంధకారంలో మునిగిపోతాడు. ఆపద్ధర్మాచరణలో రెండు ధర్మాల మధ్య లేక ధర్మనిర్ణయ విషయంగాను సంఘర్షణ తప్పదు. ఏ ధర్మం శాశ్వత పథానికి చేర్చగలదు అనే ధర్మసూక్ష్మాన్ని గ్రహించి ఆపద్ధర్మాన్ని అనుసరించాలి. ఈ ధర్మ సూక్ష్మాన్ని వేదవిదులు, త్యాగధనులు, అరిషడ్వర్గ దూరులు - సముచిత చరితులు అయిన వారివలన మాత్రమే తెలుసుకునేందుకు సాధ్యపడతుందని మహాభారతం వివరించింది.

సభాపర్వంలో ద్రౌపదీపరాభవం జరుగుతున్నప్పుడు భీష్మద్రోణులు వ్యక్తి ధర్మానికి, వ్యక్తిగతమైన వృత్తిధర్మానికి కట్టుబడి మౌనం వహించారు హస్తినాపుర రాజ్యరక్షణ భీష్ముని వ్యక్తిధర్మం. కురుకుల గురువుగా ధృతరాష్ట్రునిచేత నియమితుడైన ద్రోణునిది వృత్తిధర్మం వారు ఆ సందర్భంలో ఆపద్ధర్మాన్ని అనుసరించి రాజధిక్కారంగాని దుర్యోధనుని నివారించి ద్రౌపదిని కాపాడటంకాని చేయలేకపోయారు.

★ 62. The culture And Heritage of Indian People Vol I - Bharatiya Vidya Bhavan. Bombay,1989.

యుద్ధసమయంలో ధర్మరాజు ఆపద్ధర్మాన్ని అనుసరించి అసత్యం పలికాడు. సైంధవుని వధించేందుకు కృష్ణుడు చేసిన ప్రయోగం, కర్ణుని నాగాస్త్రాన్ని భగ్నం చేసేందుకు అర్జునుని రథాన్ని క్రిందికిదించటం అపద్ధర్మాలే. శాశ్వత ధర్మ ప్రతిష్ఠాపనలో ఆపద్ధర్మాన్ని అనుసరించటం దోషంకాదని మహాభారతం నిరూపిస్తున్నది.

ఈ పేర్కొన్న ధర్మవిశేషాలన్నీ దేశకాలస్థితిగతులమీద ఆధారపడి మార్పులు చెందుతాయి. కొన్నిసార్లు కాలగర్భంలో కలసిపోతుంటాయి. లౌకిక జీవనమార్గంలో లోకాచారాలుగా అనుసరణీయమైన ఈ విశేషధర్మాలు ప్రముఖస్థానం వహిస్తాయి. అందువలనే 'ఆచారః పరమోధర్మః' అని ఆచార ప్రాముఖ్యాన్ని పూర్వీకులు చాటిచెప్పారు.

'మహా భారతకాలంనాటి ధర్మం ఈనాడు అనుసరణీయమా' అని ప్రశ్నిస్తే శాశ్వత ధర్మానుసరణ విషయంలో 'అవునని' నిస్సందేహంగా చెప్పవచ్చు కాని ఆనాటి విశేష ధర్మాలు ఈనాడు యథాతథంగా ఆచరించటం సాధ్యంకాదు - అని చెప్పక తప్పదు. నాటికీ నేటికీ జాతి, కుల ధర్మాలు ఎన్నో మార్పులు పొందాయి. వాటి స్వరూప స్వభావాలే మారిపోయాయి. వర్ణ సాంకర్యం ఆనాడు మహాపాపం. నేడు సమాజ పురోగమనానికి వర్ణసాకర్యంవలన ఎట్టి ప్రమాదం లేదు. కులవృత్తులు లేదా వృత్తిని బట్టి కులం అన్న నిర్ధారణ మహాభారతకాలంలో లేదు. ప్రస్తుతం కూడా లేదు. కాని మధ్యయుగాలలో కులవృత్తిని తిరస్కరించటం అనేది దోషంగా భావించేవారు. మహాభారతకాలంలో ఆనాటి పరిస్థితులకు, అవసరాలకు తగినట్టుగా ఏర్పడిన సామాజిక ధర్మాలు లేదా దేశజధర్మాలు అయిన నియోగవిధి, దేవరన్యాయం, ఆశ్రితులను, భార్యాబిడ్డలను, సోదరులను జూదంలో పందెంగా ఒడ్డటం ఈనాడు చట్టవిరుద్ధమైన అంశాలు, నేటి సమాజ ధర్మానికి వ్యతిరేకమైనవి. నాటి విశేషధర్మాల స్థానంలో క్రొత్త లోకాచారాలు, సంప్రదాయాలు ఈనాడు అమలులో ఉన్నాయి.

అష్టవిధవివాహాలు, ద్వాదశవిధ పుత్రులవంటి కుటుంబపరమైన ధర్మాలు రూపాంతరం చెందాయి. సంస్కృత మహభారతంలో చెప్పిన అష్ట విధ వివాహాలలో ఆంధ్రమహాభారత కాలం నాటికి ఐదు రకాల వివాహాలు మాత్రమే అంగీకృతమయ్యాయి. ఆ అయిదింటిలోనూ కూడా తిక్కనగారు ఆసురము, రాక్షసము ధర్మదూరములని స్పష్టంగా చెప్పారు. అసురమైన కన్యాశుల్క విధానం ఒక శతాబ్దం క్రిందటి వరకు కొన్ని ప్రాంతాలలో, కొన్ని వర్ణాలలో దేశాచారంగాను, కులాచారంగాను అమలులో ఉండేది, దాయభాగ నిర్ణయంలో కూడా స్వకులస్త్రీయైన ధర్మపత్నియందు జన్మించిన సంతానానికే ఆస్తిమీద పూర్తిగాను లేదా అధిక భాగం ఆస్తిమీద, అధికారం ఉంటుందని మహాభారతం చెప్పింది. బహుభార్యాత్వం నిషేధింపబడిన ఈనాడు ఆస్తి సంతానం అందరికీ సమానంగా లభిస్తుంది. వివాహం, దాయభాగం, సంతానం పొందటం వంటి

విషయాలలోను, కుటుంబపరమైన సంబంధ బాంధవ్యాల హక్కులలోను అనాటి ధర్మాలు ఈనాడు చెల్లవు. జూదానికి అహ్వానం వస్తే తిరస్కరించటం ఈనాడు ధర్మభంగం కాదు.

సంతానం విషయంలోను ఔరసపుత్రుని తరువాత క్షేత్రజుడు ముఖ్యుడని సంస్కృత మహాభారతం చెప్పగా తిక్కన క్షేత్రజుని కన్నా ముందు దౌహిత్రుని చేర్చాడు. కుమార్తె వివాహ సందర్భంలో పుత్ర సంతానం లేని తండ్రి, ఆమె పుత్రుని వారసునిగా స్వీకరిస్తానని మంత్ర సహితంగా అంగీకరించినప్పుడే దౌహిత్రుడికి మాతామహుని ఆస్తిలో భాగం లభిస్తుందని మనుస్మృతి వివరించింది. సంస్కృత మహాభారతంలో దౌహిత్రుని ప్రసక్తిలేదు. మహాభారత కాలానంతరం క్షేత్రజ సంతాన ప్రాముఖ్యం నశించిపోయింది. తిక్కన కాలంనాటికి దౌహిత్రుడు క్షేత్రజుని స్థానంలో వచ్చి చేరటం లోకాచారం కారణంగానే సంభవించింది. ఈనాటి న్యాయ చట్టాలను సామాజిక నీతిని అనుసరించి క్షేత్రజ సంతానానికి వారసత్వపు హక్కుగాని సాంఘికమైన గౌరవంగాని లభించవు.

మహాభారతంలో కానీనుడి ప్రసక్తి ఉండటం చేత తల్లులైన కన్యలు అక్కడక్కడ ఉండేవారని తెలుస్తున్నది. కాని వారు క్షత్రియకాంతలైతే సంఘమర్యాదనుండి బహిష్కృతులయ్యే ప్రమాదం ఉందని కుంతి చర్య నిరూపిస్తున్నది. మహాభారత గాథకు సంబంధించి వ్యాసుడు, కర్ణుడు కానీనులైన సంతానం. ఇద్దరి తల్లులూ తమ కన్యాత్వం దూషితం కానటువంటి వరాలను పొందినవారే. వ్యాసుని తల్లి మత్స్యగంధి సద్యోగర్భాన జ్ఞానస్వరూపుడైన కృష్ణద్వైపాయనుని కన్నది. జన్మించిన వెంటనే దండకమండలధారుడై తల్లి అనుజ్ఞపొంది తపోభూమికి వ్యాసుడు వెడలిపోతాడు. సత్యవతి, కన్యయైన తాను పొందిన సంతానాన్ని గురించి భయపడినట్లుగాని, సంఘభీతి వలన, సామాజిక ధర్మభంగం కలుగుతుందనే భయంచేత, తన పుత్రుని జన్మను రహస్యంగా ఉంచినట్లుగా కాని భారతంలో ఎక్కడా చెప్పలేదు. అంతేకాక విచిత్రవీర్యుడు మరణించిన తరువాత భీష్ముడు ఆమె కోరికలను తిరస్కరించిన పరిస్థితిలో, ఎటువంటి సంకోచంలేకుండా వ్యాసుని గురించి భీష్మునికి చెపుతుంది. భీష్ముని వలెనె తన పుత్రుడైన వ్యాసుడు కూడా విచిత్రవీర్యుని సోదరుడని, దేవర న్యాయాన్ని అనుసరించి కురువంశవృద్ధికి భీష్ముని అనుమతించమని ఆజ్ఞ ఇస్తుంది. భీష్ముడు కూడా శంతనునితో వివాహానికి పూర్వమే పరాశర మహర్షి వలన సత్యవతి పొందినటువంటి పుత్రుని గురించి ఎటువంటి వైక్లబ్యాన్ని ప్రదర్శించడు. ఆమె ఆజ్ఞను శిరసావహించి తాను కూడా కురువంశాన్ని ఉద్ధరింపుమని వ్యాసుని ప్రార్థించి అతనిని గౌరవిస్తాడు.

అయితే కుంతీదేవి విషయంలో ఇందుకు పూర్తిగా భిన్నంగా జరిగింది. బాల్య చాపల్యం చేత మంత్రాన్ని పరీక్షించిన కుంతి పుత్రజననం పట్ల భయభీతురాలైంది. సూర్యుని మరలిపొమ్మని వేడుకుంది. మహర్షియిచ్చిన మంత్రశక్తికి తిరుగులేదని సూర్యుడు చెప్పగా 'నాకు గర్భమైన నా తల్లిదండ్రులు చుట్టములున్ నన్నుచూచి నగరె' అని తన భయాన్ని వెల్లడించింది. సత్యవతి విషయం ఇందుకు పూర్తిగా భిన్నమైనది. పరాశరుని కోరికను అంగీకరించకపోయినట్లైతే ' ఈ ఋషి శాపమిచ్చునేమోనని' భయపడింది. కన్యకావ్రత భంగం అయితే తండ్రియింటికి పోజాలనని తలచి నాకు దోషవిముక్తి అగునట్లుగా అనుగ్రహించమని కోరిందే తప్ప లోకాన్ని గురించి భయపడ్డట్లుగా ఎక్కడా చెప్పలేదు . కుంతీదేవి మాత్రం కుమారుని చూచి ఈ బాలునెత్తుకుని ఇంటికి వెడితే నన్ను గురించి నా బంధువులు ఏమనుకుంటారోనని సంకోచించింది. లోకాపవాద భీతితోనే బాలుని నదీప్రవాహంలో విడిచిపెట్టింది. అస్త్రవిద్యా ప్రదర్శనాంగణంలో కర్ణుని గుర్తించినప్పటికీ 'ప్రథమ పుత్రస్నేహ మెఱుకపడకయుండ' రహస్యంగానే వ్యవహరించింది. ఈ అంశాలను పరిశీలించి చూస్తే ఆనాటి సమాజంలో కన్యా మాతృత్వం అగ్రవర్ణాలలో మాత్రమే విపరీతంగా భావించేవారని, పల్లీయులలో అంత ప్రధానమైన దోషంకాదనే సామాజిక ధర్మం అనుసరణీయమై ఉండేదని భావించేందుకు వీలుకలుగుతున్నది.

సంస్కృత మహాభారతంలో కర్ణుని జన్మలో ధర్మభంగం ఉన్నందువల్లనే అతడు అధర్మాన్ని ఆశ్రయించాడని కనుకనే తాను కర్ణుని దూషించానని భీష్ముడే స్వయంగా చెప్పారు. దోషం అతనిది కాకున్నా దోషభూయిష్టమైన జన్మకారణంగా కలిగిన ఫలాన్ని కర్ణుడు అనుభవించవలసివచ్చిందని సంస్కృత మహాభారతం చెప్పింది. ఈ ప్రసంగం వలన క్షత్రియ కాంత అయిన కుంతీదేవి కన్యగాపొందిన సంతానం ధర్మవిరుద్ధమైనదని, ఆనాటి సమాజ ధర్మానికి వ్యతిరేకమైనదని ఋజువవుతోంది. ఆంధ్రమహాభారతంలో ఇదే విషయం వేరొక విధంగా వర్ణితమైంది. 'కులభేదముగా పలుకుటయును బిడ్డల జెరుపదగదని కినియుదు' అని మాత్రమే చెప్పి కర్ణుడి జన్మ విషయాన్ని ప్రస్తావించకుండా అతడి చర్యలను మాత్రమే భీష్ముడు విమర్శిస్తాడు. వివాహమైనాక కుంతీదేవి నాటి దేశజధర్మాన్ని అనుసరించి భర్త అనుమతితో నియోగవిధిన క్షేత్రజ సంతానాన్ని పొందింది. కనుకనే పాండవులు ధర్మబద్ధమైన కురువంశీయులు కాగలిగారు. సామాజిక ధర్మం అనేది జాతి, కుల, దేశ, గణ ధర్మాల రూపంలో ఎప్పుడూ ఏదో ఒక రకంగా అమలులో ఉంటుంది. కాలాన్నిబట్టి, జీవన విధానాన్ని బట్టి మారుతుండడం విశేష ధర్మాల లక్షణం. కనుకనే ఒక కాలంనాటి విశేషధర్మాలు మరొక కాలంలో విపరీతంగా కన్పిస్తాయి.

మహాభారత కాలంనాటి విశేష ధర్మాలలో సంతానం విషయంలో వలెనే వివాహవిషయంలోను కొన్నిరకాల నియమాలు, సడలింపులు ఉండేవి. వివాహబంధం లేకుండానే

సమయం అంటే ఒప్పందం చేసుకొని దాంపత్యజీవనాన్ని గడపడం, సంతానాన్ని పొందడం ఆ సంతానం ధర్మబద్ధమైన సంతానంగా సమాజం ఆమోదాన్ని పొందటం వంటి విశేషాలు మహాభారతంలో కన్పిస్తాయి. ఈ ధర్మం లేదా నియమం క్షత్రియులలో మాత్రమే వ్యాప్తిలో ఉండివుండవచ్చునని భావించేందుకు అవకాశం కల్పించే సంఘటనలు ఒకటి రెండు కన్పిస్తాయి.

కౌరవ వంశానికి చెందిన శంతనుని గంగ 'మీకు భార్యగా నన్ను పరిగ్రహింప ఇష్టమైన నా నియమానికి నే చేయు సమయానికి అంగీకరించాలని, పలుకుతుంది. శంతనుడు ఆమె చేసిన సమయానికి ఒప్పుకుని ఆమెను భార్యగా పరిగ్రహిస్తాడు. ధర్మపత్ని, సతి అనే ప్రయోగాలు గంగను గురించి కనిపించవు. అంతేగాక ఆమె సమయ భంగం కాగానే కొడుకుని తీసుకొని శంతనుని విడిచిపెట్టి వెళ్లిపోతుంది. ఆ సందర్భంలో 'నీ తోడు సంగతి నాకు నింతియ' అని ప్రకటించి మరీ వెడుతుంది. వివాహబంధంతో ముడిపడిన ఏ ఇతర భార్యాభర్తలు ఈ విధంగా విడిపోయినట్లు భారతంలో మరే ఉపాఖ్యానంలోనూ లేదు. కొంతకాలం గడిచిన తరువాత గంగ అప్పజెప్పిన కుమారుడు దేవవ్రతుని శంతనుడు జ్యేష్ఠ పుత్రునిగా స్వీకరిస్తాడు. అతడిని సకల రాజన్య ప్రధాన సమక్షంలో యువరాజును చేస్తాడు. శంతనుని నిర్ణయానికిగాని, దేవవ్రతుని యువరాజుగా అంగీకరించటానికి గాని ఎవరూ ఎటువంటి అభ్యంతరమూ వెలిబుచ్చినట్లు భారతం చెప్పదు. అంటే ఆనాడు సమయవిధిలో జన్మించిన సంతానం కూడా ధర్మబద్ధమైన సంతానంగానే సమాజం ఆమోదించినట్లు తెలుస్తున్నది.

శంతనుని కన్నా పూర్వమే నహుషపుత్రుడైన యయాతి వివాహ ప్రసక్తి లేకుండానే రాక్షసరాజైన వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠతో దాంపత్య సౌఖ్యాన్ని పొందుతాడు. వృషపర్వుని గురువు శుక్రాచార్యులవారు. అతని పుత్రిక దేవయానిని శుక్రుని అనుమతితో యయాతి భార్యగా స్వీకరిస్తాడు. బాలికలమధ్య పంతం కారణంగా రాజపుత్రియైన శర్మిష్ఠ దేవయానికి దాసీత్వం వహించవలసి వచ్చింది. వివాహ సందర్భంలో శుక్రుడు శర్మిష్ఠను యయాతికి చూపి 'ఈమెను సకల రాజ్యభోగాలతో సంతోషపరచు కాని శయనవిషయంబున పరిహరించవలసినది'గా నియమం చేస్తాడు. దాసీయైన శర్మిష్ఠ దేవయానితో కలసి యయాతి అంతఃపురానికి తరలివస్తుంది. ఋతుమతియైన శర్మిష్ఠ 'ఈ రాజునందు నా హృదయము లగ్నమై ఉన్నది. ఇతడిని సంతానార్థమై పతిగా చేసుకొందున'ని నిశ్చయించుకుంటుంది. అయితే యయాతితో వివాహప్రసక్తి చేయకుండానే 'నీవు దేవయానిని వివాహమాడినప్పుడు ఆమె సంపదనైన నేను కూడా నీచేత పరిగ్రహింపబడిన దానను కనుక నాయందు దయవుంచి ఋతుకాలోచితంబు ప్రసాదింప వలయు' అని అతడి అధికారాన్ని గుర్తుచేస్తుందే తప్ప వివాహం చేసుకోమని కోరదు. శుక్రాచార్యుని మాటను జవదాటేందుకు, ధర్మభంగానికి భయపడి సంకోచించిన యయాతిని శర్మిష్ఠ 'వధూజన

సంగమంబున వివాహ సమయములందున్ అబద్ధం చెప్పినా తప్పుకాదని ధైర్యం చెప్పి అతడిని ప్రోత్సహిస్తుంది. తన కోరికను నెరవేర్చుకుని ముగ్గురు కుమారులను పొందుతుంది. ఆ బాలురను చూచి దేవయాని వీరెవరని ప్రశ్నిస్తే ఎక్కడనుండో ఒక మహాముని వచ్చి నాకు పుత్రోత్పత్తిని ప్రసాదించాడని ధైర్యంగా చెప్తుతుంది లోకం దృష్టిలో, బంధుజనుల దృష్టిలో కన్యగా పరిగణింపబడుతున్న శర్మిష్ఠ తాను కోరుకున్న విధంగా సంతానాన్ని పొందడానికి సంకోచించలేదు. ఆ సంతానాన్ని చూచిన దేవయాని శర్మిష్ఠ చేసిన పనిని ధర్మవిరుద్ధకార్యంగా భావించలేదు. శర్మిష్ఠ పుత్రవతి కావడానికి తన భర్తయే కారణమని తెలిసినప్పుడే తాను వంచింపబడ్డానని, అవమానింపబడ్డానని భావించి దుఃఖించింది. ఈ సందర్భంలో కూడా 'ఋతుమతియై పుత్రార్థము పతిగోరిన భార్యయందు' అని యయాతి శర్మిష్ఠను భార్య శబ్దంతోనే పేర్కొంటాడు. భార్య శబ్దం భరింపబడే వ్యక్తి అర్థాన్ని మాత్రమే సూచిస్తుంది. ధర్మపత్ని, సతి అనే పదాలు స్త్రీ పురుషుల ధార్మికమైన వివాహబంధాన్ని తెలియజేస్తాయి. గంగా శంతనుల విషయంలో గాని, యయాతి శర్మిష్ఠల విషయంలో గాని అష్టవిధ వివాహాలలో ఏ రకమైన వివాహమూ జరిగినట్లుగా భారతంలో ఎక్కడా చెప్పలేదు. శర్మిష్ఠ విషయంలో మరొక విశేషధర్మం గమనింపవలసి ఉంది. వివాహానికి పూర్వమే ఆమె దేవయానికి దాసిగా మారింది దాసీజనానికి సంబంధించి వారు ప్రభువులకు లొంగి జీవించడంగాని లేదా ఎవరి వల్లనైనా సంతానం పొందటంగాని ఆనాడు ధర్మవిరుద్ధం కాకపోయివుండవచ్చు. కనుకనే దేవయాని శర్మిష్ఠ సంతానానికి తండ్రి ఎవరో తెలుసుకోవాలనే విషయంలో శ్రద్ధ చూపించలేదు. ద్రౌపది విషయంలో కూడా కీచకుడు ధూర్తుడై ప్రవర్తించడానికి ఆనాటి సమాజంలో చెల్లుబాటుగావున్న నియతి కారణం కావచ్చు. సైరంధ్రి నియమాలకు విరాటపత్ని మొదట అంగీకరించనప్పటికీ ఆమెను దాసిగా చూచినందువలననే సోదరుని యింటికిపోయి మదిరతెమ్మని ఆదేశిస్తుంది.

యయాతివలన సంతానం పొందిన శర్మిష్ఠ కుంతీదేవిలా సంతాన విషయం రహస్యంగా ఉంచలేదు. ఆమె అసుర రాజకుమారి కావటం వలన కూడా ఈ విధంగా సంతానం పొందడం ఆ జాతివారికి ధర్మవిరుద్ధం కాదని చెప్పేందుకు అవకాశం కల్పిస్తున్నది. అసుర జాతివారిలో తనను తానే సమర్పించుకుని సంతానం పొందడం ధర్మబద్ధమేనని భీముని చేపట్టిన హిడింబవృత్తాంతం కూడా ఋజువు చేస్తున్నది. ఆనాటి సమాజంలో సంతాన భాగ్యాన్ని పొందడమే పరమోత్కృష్టమైన జీవనధర్మంగా భావించేవారు. శర్మిష్ఠ పుత్రులు, హిడింబ పుత్రుడైన ఘటోత్కచుడు అసుర జాతి ధర్మానికి, క్షత్రియ కులధర్మానికి బద్ధులైన తల్లిదండ్రులకు జన్మించినందువలన వారు సామాజిక గౌరవాన్ని పొందగలిగారు.

ఒక కాలంనాటి సామాన్య విశేష ధర్మాలను యథాతథంగా అనుసరించిన వ్యక్తులను ఆనాటి సంఘంలో ధర్మవర్తనులుగా పేర్కొంటారు. విశేషధర్మాన్ని పాటిస్తూనే శాశ్వత ధర్మాన్ని అప్రతిహతంగా అనుసరించే వారు ఉత్కృష్ట ధర్మసాధకులుగా, మార్గదర్శకులుగా చిరస్థాయిగా నిలిచివుంటారు. మానవ జీవితం లౌకిక పారలౌకిక క్షేత్రాలకు చెందినటువంటది. ఈ రెండు క్షేత్రాలకు సంబంధించిన ధర్మమార్గానుసరణ మానవులకు సర్వత్రా ఆచరణీయమని మహాభారతం ప్రబోధిస్తున్నది.

ఇంతవరకు లౌకిక జీవనానికి సంబంధించిన శాశ్వత విశేషధర్మాలను గురించి తెలుసు కున్నాము. ఇప్పుడు మహాభారత ప్రబోధితమైన అధ్యాత్మ ధర్మతత్త్వం లేక శాశ్వత ధర్మాతత్త్వాన్ని గురించి పరిశీలిద్దాం. ఈ శాశ్వత ధర్మపథాన్నే 'ఆత్మపరమైన స్వధర్మం' అని భారతం వివరిస్తున్నది.

జాతి, కుల, గుణ వివక్షతలేని శాశ్వత ధర్మాలను, విశేషధర్మాలను బోధించిన మహాభారతం వీటినన్నింటిని అశాశ్వతములైన లౌకిక ధర్మాలని వివరించింది. ఇవిగాక 'యపునర్భవకారియు ననధికంబును నచలంబును నగు ధర్మంబు గోరుచుండు' అని భీష్ముని ధర్మరాజు అడుగుతాడు. జరామరణ చక్రం నుంచి తప్పించగలిగిన ధర్మమే ఈ పారలౌకిక లేదా ఆత్మధర్మం. దీనినే ఆధ్యాత్మిక తత్త్వబోధ రూపంలో భీష్ముడు ధర్మరాజుకు వివరిస్తాడు. చేసిన పనికి (కర్మకు) ఫలితాన్ని పొందకపోవటం, చేయని పనికి ఫలితాన్ని ఆశించటం ఎవరికీ సాధ్యంకాదని చెబుతూనే భీష్ముడు అవిద్యను తొలగింపగలిగితే జ్ఞానరూపంలో ధర్మమార్గం కనిపిస్తుందని తెల్పుతాడు. అవిద్య ధర్మసాధనచేత, ధర్మవేత్తల సాంగత్యం వలన తొలగిపోతుంది. అశాశ్వతమైన లౌకికధర్మ నిర్వహణ కొనసాగిస్తూనే మానవుడు ఆత్మధర్మాన్ని గుర్తించాలి. సంస్కృత భారతంలో భగవద్గీత రూపంలోవున్న ఆత్మధర్మ ప్రబోధం ఆంధ్రమహాభారతంలో అరణ్య, శాంతి అనుశాసనిక పర్వాలలో విస్తరించివున్నది.

మహాభారతం అనేక సందర్భాలలో విధి బలీయమని, కాలం దాటరానిదని, కర్మఫలాన్ని మానవులు తప్పించుకోలేరని నిర్ద్వంద్వంగా ప్రకటించింది. అయినప్పటికీ ఉత్తమోత్తమమైన ఆత్మధర్మాన్ని గుర్తించిన వారిని విధి, కాలం జయించలేవని ప్రబోధించింది. భగవద్గీతలో శ్రీ కృష్ణుడు స్థితప్రజ్ఞుడు, యోగి, మౌని మొదలైనవారు తనకు ఆత్మీయులని చెప్పి, వారి లక్షణాలను, ఆత్మదర్శనాన్ని గురించి వివరించాడు. పాంచభౌతికమైన శరీరం శాశ్వత విశేష ధర్మ నిర్వహణకు సాధనం. ఈ ధర్మ నిర్వహణలో మానవులు దేశకాల ప్రభావాలకు, జాతి, కుల ధర్మాలకు లోబడి ఉండవలసివున్నది. మహా బలపరాక్రమవంతులైన సోదరులున్నప్పటికీ,

న్యాయబద్ధంగా రాజ్యంలో భాగాన్ని పొందే అర్హత ఉన్నప్పటికీ ధర్మరాజు విధికి తలవంచక తప్పలేదు. కష్టాలను, పరాభవాలను సహించి, కాలం ఎదురైనా శాశ్వత విశేషధర్మాలకు బద్ధుడై తన సాధనను కొనసాగించాడు తప్ప ధర్మాన్ని తప్పి చరించలేదు. ధర్మ సాధకుడుగా సర్వోత్కృష్టమైన స్థాయికి చేరుకున్నాడు. కృష్ణుడే స్వయంగా 'మీరలు ధర్మజు వర్తన గౌరవమెరుగుదురు గాదె' అని సభాముఖంగా పలికాడు. అంతవరకూ ధర్మమార్గాన్నే అనుసరించటం తప్ప మరొక ఆలోచనలేని ధర్మరాజు శ్రీ కృష్ణుని మాటలను కర్మయోగ నిర్వహణకు చూపిన బాటగా గ్రహించాడు. ధర్మబద్ధంగా, ద్యూత నియమం ప్రకారం, అజ్ఞాతవాసానంతరం రాజ్యస్థాపన చేసేందుకు పూనుకున్నాడు. సామమార్గానగాని, క్షాత్రధర్మాన్ని అనుసరించి దండోపాయమైన యుద్ధం చేసిగాని తన వైభవాన్ని తిరిగి పొందడానికి నిశ్చయించుకున్నాడు. తనను హెచ్చరించిన శ్రీకృష్ణునికి సంపూర్ణంగా ఆత్మసమర్పణం చేసుకున్నాడు. లౌకిక దృష్టితో చూచినప్పుడు ధర్మరాజు స్వధర్మపాలన చేశాడనే చెప్పాలి.

ఆధ్యాత్మిక ధర్మదృష్టితో పరిశీలించినప్పుడు ధర్మరాజు కర్తవ్యనిర్వహణలో తాను అనే ప్రమేయం లేక పరమాత్మతో అభేదం పొంది సంపూర్ణంగా ఆత్మార్పణ చేసుకున్నట్లు బోధపడుతుంది. అందువలననే యుద్ధానికి ముందుగాని, యుద్ధకాలంలోగాని ధర్మరాజు హృదయం ఎటువంటి వికలత్వానికి లోనుకాలేదు. మహావీరుడైన అర్జునుడు మాత్రం యుద్ధరంగానికి చేరగానే ఇరుపక్షాలలోని పుత్ర, మిత్ర,బాంధవ సమూహాన్ని చూచి వికల మనస్కుడైనాడు. స్వధర్మాన్ని గురించి శ్రీ కృష్ణుడే స్వయంగా అర్జునునకు బోధింపవలసివచ్చింది. స్వధర్మాన్ని గుర్తించిన ధర్మరాజు యుద్ధవిజయానికి అన్ని మార్గాలను అన్వేషించాడు. భీష్మద్రోణుల ఆశీస్సులను పొంది వారిని పడగొట్టే మార్గం వారి ద్వారానే తెలుసుకున్నాడు. అద్వితీయమైన శౌర్యానికి అర్జునుడు, అచంచలమైన ఆత్మ స్థైర్యానికి ధర్మరాజు ప్రతినిధులుగా నిలుస్తారు. పరిస్థితుల ప్రాబల్యం వలన శౌర్యవంతులు చలించగలిగే అవకాశం వుందిగానీ ఆత్మస్థైర్యంగలవారు కొంచెం కూడా కంపించరని వీరిద్దరిద్వారా భారతం నిరూపిస్తున్నది. స్వధర్మమైన క్షాత్రధర్మాన్ని బోధించిన శ్రీకృష్ణుడే

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః**[63]

(సర్వధర్మములను విడిచిపెట్టి నన్నే శరణుపొందుము. అట్లు చేసితివేని నేను నిన్ను సమస్తపాపముల యొక్క బంధములనుండి విముక్తుని చేసెదను, విడిపించెదను, కావున దుఃఖపడకుము)

---

★ 63. భగవద్గీత 18-66

సర్వధర్మాలను విడిచిపెట్టి (అనగా నేను, నాది అనే భావం, కర్మఫలముల యందు ఆసక్తి) వన్నే శరణు కోరమని చెప్పిన కృష్ణుని మాటను గ్రహించి ధర్మరాజు తన శరణాగతిని ప్రకటించాడు. కనుకనే అతడికి అర్జునివలె మనోవైక్లబ్యం కలుగలేదు. ధర్మ సమ్మూఢ చేతస్కుడు కాలేదు.

సాంఖ్యతత్త్వం ప్రకారం పాంచభౌతికమైన మానవశరీరాన్ని జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలు, మనోబుద్ధ్యహంకారాలు మొదలుగాగల ఇరవైనాలుగు తత్త్వాలు నడిపిస్తుంటాయి. ఈ తత్త్వాలన్నింటికీ వానివాని నైసర్గిక ధర్మాలు ఉంటాయి. జన్మ, విద్యా సంస్కారాలు, శాశ్వత విశేష ధర్మానుసరణ ఈ తత్త్వాల నైసర్గిక ధర్మాలను ప్రస్ఫుటం చేస్తాయి. లౌకికమైన, అశాశ్వతమైన తత్త్వాలలో చరించే ఈ శరీరాన్ని అధిగమించి చూస్తే మానవుడు శాశ్వతమైన ఆత్మ స్వరూపం. అనశ్వరము, అవ్యక్తము, అప్రమేయము అయిన ఈ ఆత్మ (దేహి) విశ్వాత్మలోని అంశం. దేహానికి లౌకికమైన స్వధర్మం ఉన్నట్లుగానే దేహికి కూడా స్వధర్మం వుంటుంది. విశ్వాత్మలో భాగమైన దేహికి శాశ్వత విశేష ధర్మాలు అనే విచక్షణ లేదు. సమస్త బంధాలను ఛేదించుకుని విశ్వాత్మలో లీనం కావడమే దేహి స్వధర్మం. భగవద్గీతలో శ్రీకృష్ణుడు 'ఒకవేళ నీవీ ధర్మయుక్తమగు యుద్ధమును చేయకపోదువేని అందువలన స్వధర్మమును, కీర్తిని కూడా పోగొట్టుకొని పాపమునే పొందెదవు' అని చెప్పినప్పుడు స్వధర్మం, కీర్తి అనే రెండు పదాలను ప్రయోగించాడు. లౌకికమైన స్వధర్మపాలన వలన విజయమైనా వీరస్వర్గమైనా కీర్తి లభించడం తథ్యం, అటువంటప్పుడు ఏ అంతరార్థము లేకుండా రెండు పదాలను ప్రయోగించాడు. అని భావించేందుకు వీలులేదు. ఇక్కడ స్వధర్మం అనే మాటకు ఆత్మపరమైన స్వధర్మం అని గ్రహించాలి. అందువలననే చంపేవాడు చచ్చేవాడు అనే భేదంలేదని సర్వం తానేనని వివరించాడు. ఆత్మ లేదా దేహి స్వధర్మం విశ్వాత్మను అనగా పరమాత్మను చేరుకోవడం. భీష్మాది వీరుల ఆత్మలకు ఈ యుద్ధం ద్వారా స్వధర్మ పాలనకు అవకాశం కలిగించాలన్నదే శ్రీకృష్ణుడు అర్జునునికి చేసిన ప్రబోధం. ఈ యుద్ధం వలన స్వధర్మ నిర్వహణ, కీర్తి రెండూ లభిస్తాయని చెప్పటంలో విశేషం ఇదే. స్వధర్మానికి భిన్నమైన, లౌకికమైన సామాన్య విశేషధర్మాలు పరధర్మ సదృశాలే.

'మనుజుని యొక్క నిజధర్మము వాస్తవమున (అకర్తకావున) అకర్తృత్వయుక్తము, (అభోక్త కావున) అభోక్తృత్వయుక్తము సాక్షిమాత్రము అయివున్నది.[64] మనో ధర్మము బుద్ధి ధర్మముకంటే భిన్నమైనది. బుద్ధిధర్మము ఆత్మధర్మముకన్నా భిన్నమైనది ఇంద్రియాల కారణంగా మనోబుద్ధులు రెండు పరధర్మాలను (శాశ్వతవిశేషధర్మాలను) ఆశ్రయిస్తాయి. కాని వీటన్నిటికీ అతీతమైన దేహి స్వధర్మము మాత్రము అక్షరము, అచంచలము అయినది. కనుకనే శ్రీకృష్ణుడు "శ్రేయో' స్వధర్మో

★ 64. భగవద్గీత - జ్ఞానదీపికా వ్యాఖ్య - స్వామి ప్రణవానంద పుట 97

విగుణః పరధర్మా భయావహ' అని గుణసహితమైన పరధర్మం కన్నా గుణరహితమైన స్వధర్మం శ్రేయస్కరం అని స్పష్టంగా చెప్పారు. సాంఖ్యులు 'ఆత్మలక్షణమే ధర్మలక్షణము' అని చెప్పడంలోని అంతరార్థం యిదే. శ్రీకృష్ణుడు లౌకికమైన స్వధర్మాన్ని, ఆత్మపరమైన స్వధర్మాన్ని రెంటినీ నిర్వహించాలని అర్జునునికి ప్రబోధించారు. దేహము, దేహి రెండింటిలో దేహం ధర్మానుసరణకు సాధనంకాగా దేహి స్వధర్మాన్వేషణ ద్వారా సంపూర్ణతను పొందుతుంది. ఈ సంపూర్ణతనే శాశ్వతపథం అని వ్యవహరించారు. ఈ అన్వేషణలో లౌకిక సాధనలో ఎన్ని అవాంతరాలు ఎదురైనా ఆత్మ స్వధర్మానుసరణను విడువరాదు. అనగా విశ్వాత్మలో లీనం కావడం అనే ధర్మమార్గాన్ని విస్మరించరాదు. ఈ విధంగా ఆత్మ స్వధర్మాన్ని గుర్తించినవారే, అట్టి మానవులే మహాయోగులు. ధర్మతత్త్వాన్ని సంపూర్ణంగా గ్రహించిన ధర్మతత్త్వజ్ఞులు అని మహాభారతం నిరూపిస్తున్నది. 'అనేక పనులలో ఉండివున్నప్పటికీ పాలవాని దృష్టి పాలకడవమీదే ఎలా ఉంటుందో అదే విధంగా మనసుచేసే మాయలకు ఏమరక ఆత్మాన్వేషణ చేయాలి'అని తిక్కనగారు సులభమైన ఉపమానంలో ఆత్మాన్వేషణ ఏ విధంగా చేయాలో వర్ణించారు. మనసును ఏ కొన్ముఖం చేసి ఉత్తమ ధర్మ సాధకుడై ఆత్మను తెలుసుకోగలిగిన మానవుడే ద్వంద్వాతీతుడై భయవిముక్తుడౌతాడని అతడే ఆత్మను దర్శించగలుగుతాడని మహాభారతం ఆధ్యాత్మిక ధర్మమార్గాన్ని నిరూపించి చూపుతున్నది. లౌకిక, ఆధ్యాత్మిక ధర్మ నిర్వహణలో స్వధర్మాన్ని స్పష్టంగా గుర్తించగలిగినందువల్లనే ధర్మరాజు ముముక్షుస్థితికి చేరుకోగలిగారు. శరీరధర్మం వల్ల తాత్కాలికమైన ఉద్వేగం, దుఃఖం ధర్మరాజును ఒకటి రెండు సందర్భాలలో లోబరుచుకున్నప్పటికీ ధర్మతత్త్వ ప్రబోధం వలన అతడు ఆత్మధర్మాన్ని గుర్తించి ఉద్వేగాలనుండి విముక్తుడైనాడు.

ఆంధ్రమహాభారతం వ్యాస హృదయాన్ని ఆవిష్కరించి ధర్మతత్త్వాన్ని ప్రబోధించింది. విశేష, శాశ్వత ధర్మాలను, లౌకిక ఆధ్యాత్మిక ధర్మాలను విభజించి చూపటం కష్టసాధ్యంకాదు. కానీ ధర్మతత్త్వం ఇది అని నిర్ణయించి చెప్పగలిగినవారు మహాపురుషులు మాత్రమే. మహాభారతంలో శిశుపాలుడు 'కడుకొనె ధర్మతత్త్వమెఱుగంగ నశక్యము' అని భీష్ముని అజ్ఞాని అని దూషిస్తాడు. ఆ సందర్భంలో భీష్ముడు ' ఓ శిశుపాలా రాగ కోపాలతో నిండిన మనస్సు కలిగి అల్పసంపదల చేతనే కన్నులు కానరాక అకారణంగా వాదాలకు దిగుతున్న నీకు ధర్మము తెలుస్తుందా' అని శిశుపాలుని మూర్ఖత్వాన్ని విమర్శిస్తారు. ధర్మతత్త్వం గ్రహించడం కష్టమన్న శిశుపాలునికి అసలు ధర్మమే తెలియదని భీష్ముడు పలుకుతాడు. వీరి మాటల ద్వారా ధర్మాన్ని తెలుసుకున్నా ధర్మతత్త్వాన్ని గ్రహించడం సులభసాధ్యంకాదని మహాభారతం చెప్తున్నది.

ధర్మం సామాన్య జ్ఞానానికి తెలియదగినది. మహాజ్ఞానులకు, యోగులకు మాత్రమే ధర్మతత్త్వం తెలుసుకునేందుకు సాధ్యపడుతుంది. సామాన్య విశేష ధర్మాలను, లౌకిక ఆధ్యాత్మిక ధర్మాలను సవిస్తారంగా వివరించిన మహాభారతం ధర్మసాధనవలన, నిర్లోభత్వం వలన, నిర్మోహత్వం వలన మాత్రమే ధర్మతత్త్వాన్ని గ్రహించగలరని నిరూపిస్తున్నది. ధర్మం జీవితాన్ని నడిపిస్తుంది. ధర్మతత్త్వం శాశ్వతపథానికి చేరుస్తుంది. **శాశ్వత అశాశ్వతాలను గుర్తింపగలిగిన జ్ఞానమే ధర్మతత్త్వమని** ఆంధ్రమహాభారతం ప్రబోధిస్తున్నది. విధి, కాలం స్వయంకృతకర్మ ఒకదానితో ఒకటి పెనవేసుకునివుండే నిత్యసత్యాలు. కాలాన్ని జయించడం మానవునికి సాధ్యం కాకపోయినా స్వయంకృత కర్మల ద్వారా వినాశనాన్ని అదుపుచేయవచ్చును. స్వయంకృత కర్మఫలం మానవుని లౌకిక, ఆధ్యాత్మిక జీవితాలు రెండింటినీ శాసించగలదు. ఈ ధర్మసూక్ష్మాన్ని గుర్తించి మెలగడమే మానవజీవిత పరమార్థం. భగవత్స్వరూపమే సిద్ధధర్మంకాగా మహాభారతం సాధ్యసాధన ధర్మమార్గాలను, ఆ మార్గాలను అనుసరించటం వలన కలిగే శాశ్వతత్వాన్ని ప్రధానకథలోను, ఉపాఖ్యానాల ద్వారాను నిరూపిస్తున్నది. ధర్మానికి గ్లాని ఎదురైనప్పుడు భగవంతుడు సిద్ధస్వరూపుడై ధర్మప్రతిష్ఠాపనకు పూనుకుంటాడని వివరిస్తూ ధర్మానికి గ్లానితప్ప నాశనం ఉండదని, అది అక్షరము, అవ్యయము, అయినదని నిరూపిస్తున్నది. శాశ్వత, విశేషధర్మాల రూపంలో ఉన్నటువంటి ధర్మాన్ని ఆశ్రయించి, అనుసరించి జీవించటమే మానవుల కర్తవ్యం అని ప్రబోధిస్తోంది. ధర్మానికి గ్లాని సంభవించినట్లైతే నాశనంపొందేది మనుషులే తప్ప ధర్మం కాదని ఎలుగెత్తిచాటుతోంది. విశేషధర్మాలు రూపాంతరం పొందవచ్చు. కాని శాశ్వతధర్మాలు సర్వదా అనుసరణీయమైనవి. సంస్కృత మహాభారత కాలంనాటికే రూపాంతరం చెందుతున్న కొన్ని విశేషధర్మాలను యక్షప్రశ్నలు, అజగరోపాఖ్యానంలో భారతం వివరించింది. ప్రకృతి ధర్మాలను విడిచిపెడితే, బ్రాహ్మణుడెవడు? వంటి కులవిశేషాన్ని తెలిపే అంశాలు ఆనాడు రూపాంతరం చెందుతున్న విశేషధర్మాలు. వీనిలో కొన్నింటికి అర్థాలు నేడు పూర్తిగా మారిపోయాయి.

**క.** **ఒరులేయవి యొనరించిన**
**నరవర యప్రియము దనమనంబున కగుదా**
**నొరులకు నవి సేయకునికి,**
**పరాయణము పరమధర్మపదములకెల్లన్.**[65]

ఇంతకు మించిన ధర్మం ఏ మానవుడూ ఆచరించలేడు. జీవన విధానానికి సంబంధించి తనకు విధింపబడిన సమ్యగాచారమే ధర్మసాధనగా మానవుడు గుర్తించాలి. ఉత్తమ సాధకులైన

---

★ 65. ఆం. మ. భా శాంతి 5-220

ధర్మరాజు, కుంతీదేవుల చరిత్ర ఈ విషయాలనే నిరూపిస్తోంది. సాధన ద్వారా సాధ్యధర్మమార్గాన్ని పొందగలగడం. అక్కడనుండి సిద్ధధర్మస్వరూపుడైన భగవంతుని చేరడం ధర్మసాధనకు ఫలం. నిరంతర సాధకులను భగవంతుడు వెన్నంటివుంటాడు అతడే జీవాత్మను శాశ్వతపథానికి చేర్చువాడు. సంస్కృత మహాభారతం ద్వారా వ్యాసుడు చేయదలచిన ఈ ధర్మ ప్రబోధాన్ని ఆంధ్రమహాభారతం యథాతథంగా ప్రతిబింబింప చేస్తోంది. సంస్కృతాంధ్రమహాభారతాల మధ్య దేశ, కాల భేదాలున్నప్పటికీ ధర్మప్రబోధం విషయంలో మాత్రం ఆంధ్రమహాభారతం సంస్కృత మహాభారత మార్గాన్నే అనుసరించింది. వ్యాసుని జయకావ్యం ప్రధానంగా ఇతిహాసం. ఇతిహాస రచన వ్యాజంతో వ్యాసుడు ధర్మబోధానికి, ధర్మవ్యతిరేకత వలన కలిగే పరిణామాల వివరణకు పూనుకున్నాడు. తన ధర్మప్రబోధానికి ఉపబలకంగా అనేక ఉపాఖ్యానాలను వేదగతమైన వానిని, అంతకు పూర్వం జరిగిన గాథలను, జన బాహుళ్యంలో ప్రచారంలో ఉన్నవానిని మహాభారతేతిహాసంలో సందర్భానుసారంగా వర్ణించాడు. ఆంధ్రమహాభారత ప్రధానోద్దేశం కూడా ఇతిహాస సూత్రంలో పొదగబడినటువంటి ధర్మమార్గప్రబోధమే. "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని, వేదాంతులు వేదాంతమని, పౌరాణికులు బహుపురాణ సముచ్చయమని, కవి వృషభులు మహాకావ్యమని" ప్రస్తుతించిన మహాభారతాన్ని, వ్యాసప్రబోధిత ధర్మాన్ని కవిత్రయంవారు ఆంధ్రదేశంలో తెలుగుబాషలో మహాకావ్యరూపంలో ప్రతిష్ఠించారు.

జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి, కంచిపీఠాధిపతులు ధర్మాన్ని గురించి ఈ విధంగా ప్రవచించారు. "ధర్మమనే పదానికి హైందవమతంలోనే ఒక విశేషమున్నది. హిందువుని జీవనశీలములే ఆ ధర్మానికి ప్రతిమానములు. ఆ పదానికి అనేకమైన అర్థాలు వివిధచ్ఛాయలు ఉన్నవి. ఒక విధంగా చూస్తే ఈ విశ్వమంతా దేన్ని అనుసరించి నడుస్తుందో అదే ధర్మం అని చెప్పాలి.

ధర్మం ఆధ్యాత్మికానికీ చెందుతుంది. భౌతికానికీ చెందుతుంది. ఒక్క సామాన్య ధర్మం భౌతికాన్ని ఆధ్యాత్మికంతో అంటగడుతుంది. ఆ ధర్మం మూలంగానే భౌతికాన్ని అధిగమించి ఆత్మానుభూతిని మనము అందుకుంటున్నాము. ధర్మమే విశ్వంభరి. ఈ విశ్వానికొక స్థిరత్వం పవిత్రత ఆ ధర్మం మూలంగానే కల్గుతుంది."[66]

ఓం తత్ సత్

*

★ 66. యోషద్ధర్మ సనాతనః - జగద్గురు బోధలు వాల్యూమ్ 3

